## వారెవ్వా!

# బంగారు కెమెరా

ప్రపంచంలోనే మొట్టమొదటి వాటర్‌ప్రూఫ్, డస్ట్ ప్రూఫ్ బంగారు కెమేరాను పెంటాక్స్ కంపెనీ 60వ వార్షికోత్సవం సందర్భంగా తయారు చేసింది. ఇది డిజిటల్ కెమెరా కాదు. అమ్మమ్మల కాలంనాటి 'ఫిల్ములు' తీసే కెమేరానండీ! కానీ ఆ కంపెనీ దీన్నొక అపురూప కళాఖండంగా తీర్చిదిద్దింది.






చతుర
సంపుటి -31
సంచిక - 7
ఆగస్టు 2008
367వ సంచిక


- మనసున ఉన్నదీ.. 4
- యర్రంశెట్టి సాయి అపార్ట్‌మెంటాలజీ
  డాడీ మమ్మీ... ఓ టెలుగూ గాళ్! 6
- టాంక్‌బండ్ కథలు-10
  ప్రాయశ్చిత్తం 114
- రష్దీకి బుకర్ బహుమతి 117
- చతుర ప్రవేశిక విజేతలు 119
- కాలాతీతం
  ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదికలో మేరీ షెల్లీ నవల ఫ్రాంకెన్‌స్టీన్
  నిర్వహణ: ఎం.వసంత 121
- సంధ్యావందనం లక్ష్మీదేవి ఇదీవేదం
  వేదాలు మాంసాహారాన్ని సమర్థించాయా? 126
- చతుర కత 129
- చతుర ప్రపంచం
  సేకరణ : ఎం.కావ్య
- చతురోక్తులు, వారెవ్వా!
  సేకరణ : కె.రఘు


ముఖచిత్రం : సంధ్య  ఛాయాగ్రాహకుడు : మధు

ముఖపత్రాలంకరణ : రాజు యాట

వెలి బతుకు నీదంటూ సమాజం ఎంత ఛీత్కరించినా అతను వెలుగు బావుటా చేబూనాడు. తిరుగులేని మనోస్థైర్యంతో గెలుపుబాటవేపు చూపు సారించాడు. అవమానాలను ఎదుర్కొంటూనే 'అభిమాన' ధనుడిలా అంచెలంచెలుగా ఆ యువకుడు ఎలా ఎదిగాడో విపులీకరించే స్ఫూర్తిదాయక రచన

డా॥ చిలుకోటి కూర్మయ్య

**అభిమానం**

10 వ పేజీలో

బొమ్మలు: భాస్కర్



# మనసున ఉన్నదీ...



★ జులై చతురలో ప్రచురించిన 'భూమి గుండ్రంగానే ఉండాలి' నవల రచయిత వసంత రావు దేశపాండే కలం నుంచి జాలువారిన ఆణిముత్యం. లోకానికి అన్నం పెట్టే రైతులు ఎన్ని కష్టాలు పడుతున్నారో హృదయవిదారకంగా వివరించిన నవల ఇది. అమాయకత్వం నిండిఉన్న పల్లె వాతావరణం ఆవిష్కరిస్తూ వివిధపాత్రలను రచయిత నడిపించిన తీరు అభినందనీయం. ఇదే సంచికలోని 'హాస్యం దివ్యౌషధం' చిన్నచిర్నవ్వు వల్ల కలిగే లాభాలను తేటతెల్లం చేసింది. 'కొత్తగాలి' పేరిట ప్రచురిస్తున్న మినీకవితలు ఆకర్షిస్తున్నాయి.

– శైలూషి, అరసవిల్లి

★ కాజల్ ముఖచిత్రంతో చతుర చాలా అందంగా ఉంది. 'హాస్యం దివ్యౌషధం' చింతలుబాపే చిర్నవ్వు గురించి తెలియని సమాచారాన్ని అందించింది. 'భూమి గుండ్రంగానే ఉండాలి' నవల అష్టకష్టాలు పడుతున్న రైతుల జీవనాన్ని హృద్యంగా చిత్రీకరించింది. రచయిత రచనాశైలి నవలకు నిండుదనాన్నిచ్చింది.

– ఉప్పలపాటి శ్రీను, శ్రీశైలం డ్యాం, కర్నూలు

★ పత్తి రైతుకొచ్చిన 'విపత్తు'ను ఎంతో ఉదాత్తంగా చిత్రీకరించిన 'భూమి గుండ్రంగానే ఉండాలి' నవలా రచయితకు అభినందనలు. నా అభిమాన రచయిత 'మపాసా' పరిచయం, ఆయన రచన 'ఒక జీవితం' గురించి సవివరంగా తెలియజేసినందుకు కృతజ్ఞతలు. 'ఇదీవేదం'లో వేదరహస్యాలను వర్తమాన ప్రపంచం పోకడలతో సరిపోల్చుతూ చక్కటి రచనలందిస్తున్న రచయిత్రి ప్రతిభ అనుపమానం.

–పెన్మెత్స సూరిబాబు, బంజారాహిల్స్, హైదరాబాద్

★ వ్యవసాయం కడుభారమై రైతుల బతుకులను కృంగదీస్తున్న నేటి పరిస్థితుల్లో ఆధునిక వ్యవసాయ పద్ధతుల కన్నా పాతపద్ధతులే మేలని చాటిచెప్పిన నవల 'భూమి గుండ్రంగానే ఉండాలి'. కులవృత్తులవారు సైతం వారి వృత్తులలోని పాతపద్ధతులను విడనాడి, మారుతున్న సమాజానికి అనుగుణంగా వారు మారితే బాగుంటుందని రచయిత సూచించడం అభినందనీయం. అయితే, తెలంగాణా మాండలికంలో ఉన్న ఈ నవలను అర్థం చేసుకోవడం కష్టమైంది. 'శత్రువు', 'ఐడియాలు అమ్మబడును' కథలు బాగున్నాయి.

–అక్కినపల్లి రామారావు, లలితానగరం, విశాఖపట్నం

★ కాజల్ ముఖచిత్రంతో విచ్చేసిన చతుర ఆకర్షించింది. ప్రతిమాసం చక్కని నవలతో పాటు 'అపార్ట్‌మెంటాలజీ', 'కొత్తగాలి', 'చతుర ప్రపంచం', 'చతురకతలు'...వంటి ఇతర రచనలు అందిస్తుండడం ఆనందదాయకం. చివరి అట్టచిత్రం 'ఆనందం అర్ణవమైతే...' మా హృదయానికి హత్తుకుంది.

– నేమాన సుభాష్ చంద్రబోస్, శ్రీకాకుళం టౌన్

'చతుర' సంచికలపై, శీర్షికలపై తమతమ అభిప్రాయాలను స్వేచ్ఛగా, నిర్మొహమాటంగా వ్యక్తం చేసే వేదిక ఇది. స్పష్టంగా, క్లుప్తంగా పాఠకులు తమ అభిప్రాయాలను ఏనెల సంచికపై ఆనెల రాయండి.

చిరునామా: మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ –500 082

ఈ మెయిల్ చిరునామా: chatura@eenadu.net

# సేవే ఆయన ఆనందం




2001లో ఓ ఉదయం 74 ఏళ్ల మేక్‌స్టేలీ కేలిఫోర్నియాలోని టిబురోన్ అనే ఊళ్లోని చెత్త నింపే ఓ గోతి దగ్గరకి వెళ్లాడు. అప్పుడే వచ్చిన చెత్త లారీలో చక్కటి కండిషన్‌లో ఉన్న వీల్ ఛెయిర్‌ని చూసాడు. గేటు దగ్గరున్న వాచ్ మేన్‌ని స్టేలీ, "ఇలాంటి మంచి వస్తువులని చెత్త లారీ తెస్తుంటుందా" అని అడిగాడు. "చాలామంది చాలా మంచి వస్తువులని పారేస్తుంటారు. అవన్నీ ఆ గోతిలోకి వెళ్లిపోతాయి" జవాబు చెప్పాడు వాచ్‌మేన్.

అప్పటికప్పుడే స్టేలీ అలాంటివాటిని సేకరించి, అవసరమైన బీదలకివ్వాలని నిర్ణయించుకున్నాడు. 'హోమ్‌కేర్స్ ఎక్విప్‌మెంట్ రీసైక్లర్స్' అనే లాభాపేక్షలేని సంస్థని స్థాపించి, రోగులకి ఉపయోగించే వీల్ ఛెయిర్స్, వాకర్స్, కమోడ్స్, చేతికర్రలు తదితర వస్తువులను చెత్త లారీల నుంచి సేకరించి ఉచితంగా ఇస్తున్నాడు.

ఇందుకు అతనికి మేర్లిన్ మాక్ కొనేలీ అనే 70 ఏళ్ల రిటైర్డ్ నర్స్ సహాయం చేస్తోంది. ప్రతి బుధవారం మూడుగంటలు ఈ పనికోసం కేటాయిస్తోంది. హాస్పిటల్స్‌నుంచి, ఇళ్లల్లోని బాగుపడ్డ రోగులనుంచి వారు ఉపయోగించే పరికరాలని సేకరిస్తున్నారు. ఇందుకోసం వాళ్లు ఓ ట్రక్‌ని ఉపయోగిస్తున్నారు. 2007లో ఈ సంస్థకి 281 మంది నుంచి 1953 వస్తువులు అందాయి. వాటిని 393 మంది రోగులకు పంపిణీ చేసారు.

లాభాపేక్షలేని ఈ సంస్థకి గోడౌన్ అవసరమైంది. ఓ దాత వేర్‌హాస్ అద్దెని వీరి తరపున చెల్లిస్తున్నాడు. వీరు అచ్చువేసే కరపత్రాలు, ఫోన్ బిల్, ట్రక్ ఇన్స్యూరెన్స్ మొదలైన ఖర్చులు వివిధ దాతలు ఇచ్చే డబ్బుతో భరిస్తున్నారు.

అమెరికాలో సెకండ్‌హేండ్ వస్తువులని కొని, అమ్మే వ్యాపారాలు దాదాపుగా లేవనే చెప్పాలి. ఒక్క పుస్తకాలకి, కార్లకే సెకండ్‌హేండ్ మార్కెట్ ఉంది. అందువల్ల ఇంట్లో అడ్డుగా ఉన్న, తమకు అవసరం లేని వస్తువులను తమ ఇళ్ల బయట ఉన్న చెత్తబుట్టల్లో పడేయడం అమెరికన్స్‌కి అలవాటు. కరపత్రాలని చదివి వీళ్లకి ఫోన్ చేసి ఇచ్చే దాతలు క్రమేపీ పెరుగుతున్నారు.

స్టేలీ ఇప్పుడు బీద దేశాలైన నికారాగ్వా, మెక్సికో, పెరూ దేశాల్లోని హాస్పిటల్స్‌కి కూడా ఇలా దొరికిన వస్తువులని ఎగుమతి చేస్తున్నాడు. ఇందుకు వీరికి ఆయాదేశాల్లోని లయన్స్ క్లబ్బులు సహాయం చేస్తున్నాయి. మొదట్లో విరాళాలు తక్కువ వచ్చేవికానీ ఇప్పుడు బాగానే అందుతున్నాయి.

"నా రిటైర్డ్ జీవితాన్ని ఇలా సద్వినియోగం చేస్తున్నందుకు లభించే తృప్తి, మానసిక ప్రశాంతత నాకు చాలు" అంటాడు స్టేలీ.



అపార్ట్‌మెంటాలజీ-7

# డాడీ-మమ్మీ -ఓ తెలుగూ గాళ్



యర్రంశెట్టి సాయి

రామ్‌భరోసా అపార్ట్‌మెంట్ వాళ్ళం దరం మా అసోసియేషన్ ప్రెసిడెంట్ హమీద్‌మియాకి సన్మానం చేయాలని డిసైడ్ చేశాం.

నిజానికి మేము సిన్సియర్‌గా ఫీలయి అలా డిసైడ్ చేయలేదు గానీ మా ప్రెసిడెంట్ హమీద్‌మియాయే వారంరోజుల పాటు మా వెంటపడి సామదానభేద దండోపాయాల ద్వారా అలాంటి నిర్ణయం తీసుకునేలా చేశాడు.

"కానీ, నీకిక్కడ సన్మానం జరగటం చాలా కష్టం బ్రదరూ" అన్నాడు శంకర మూర్తి.

అందరం ఉలిక్కిపడ్డాం!

హమీద్‌మియా కళ్ళల్లో టెర్రర్ కనిపించింది.

"ఎందుక్కష్టం? " అనడిగాడు నీరసంగా.

"ఎందుకేంటి? మన అపార్ట్‌మెంట్స్‌కి సంబంధించిన వాస్తు ఎవరయినా గమనించారా? ఈశాన్యంలో పెద్ద దిబ్బ! ఆ దిబ్బ మీద ఇంకా అంతెత్తు లేచిన రోడ్డు-

దానివల్లే అపార్ట్‌మెంట్స్‌లో అందరికీ ఎప్పుడూ ఏదొక సమస్య వస్తుంటుంది. ఇక్కడ మనం ఏం చేద్దామన్నా అన్నీ రివర్స్ అవుతూంటాయ్-"

అతనామాట అనేసరికి అందరం ఫ్లాష్ బాక్‌లోకి వెళ్ళి ఆ మాట కొంతవరకూ నిజమే అనుకున్నాం.

"వాస్తూ గీస్తూ అంతా బోగస్! నేను నమ్మను" అన్నాడు కృష్ణమూర్తి.

హమీద్‌మియా వెంటనే అతనిని సపోర్ట్ చేశాడు "నేనూ నమ్మయ్" అన్నాడు.

ఇంకో నలుగురైదుగురు కూడా "వాస్తూ లేదు గుడ్డూ లేదు- అంతా మన బ్రెయిన్‌లో ఉందది" అన్నారు హమిద్‌ని సపోర్ట్ చేస్తూ.

మొహిందర్ సింగ్ మాత్రం ఒప్పుకోలేదు "వాస్తూ బహుత్ జరూరీ హై" అన్నాడు.

"ఇంతకూ మన ప్రెసిడెంట్ గారికి సన్మానం ఎప్పుడు చేద్దాం. ఎవరెవర్ని ఇన్‌వైట్ చేద్దాం? అవన్నీ ఇప్పుడే డిస్కస్ చేద్దాం!" అన్నాడు విజయ్‌యాదవ్.

సరిగ్గా అప్పుడే 'సి' బ్లాక్‌లోని ఒక అపార్ట్‌మెంట్ నుంచి పెద్దగా ఏడుపులు వినిపించినయ్.

"నేను చెప్పానా? సన్మానం అనగానే ఏడుపులు వినిపిస్తున్నాయ్. అంటే 'సి' బ్లాకులో ఎవరో ఎగిరిపోయుంటారు" అన్నాడు శంకరమూర్తి.

"అంటే- ఏమంటావిప్పుడూ? "

"సన్మానం అనుకున్నామా చూడండి వాస్తు ఎఫెక్ట్- ఏదయినా కార్యక్రమం టేకప్ చేయాలంటే వాస్తే ఎఫెక్ట్ ఎలా ఉంటుందో చెప్తున్నా! అంతే! ఇంకేంలేదు"

అందరి గుండెలూ ఝల్లుమన్నయ్. హమిద్‌మీయా మొఖం వాడిపోయింది.

"ముందాగొడవేంటో మనం చూస్తయ్-చలో" అన్నాడు హమీద్‌మియా.

అందరం ఆ అపార్ట్‌మెంట్‌లో కెళ్ళాం.

అది ఒక స్టేట్ గవర్నమెంట్ ఆఫీసర్ అపార్ట్‌మెంట్. వాళ్ళకి ఒక్కర్తే కూతురు. ఆ ఆఫీసర్ రామనాధంగారూ, ఆయన భార్య పూనమ్ ఇద్దరూ గుండెలవిసేలా ఏడుస్తున్నారు.

"ఏంటండీ! ఏం జరిగింది? బంధువులెవరయినా పోయారా? " అడిగాడు మొహిందర్‌సింగ్.

"దేముడో! మా అమ్మాయిని ఇరవైఏళ్ళు కష్టపడి పెంచాం. అల్లారు ముద్దుగా పెంచాం! ఏం కావాలంటే అది కొనిచ్చాం! అందరూ అంటూనే ఉన్నారు. 'ఆడపిల్లకు అంత స్వేచ్ఛ ఇవ్వకండి- ఏదొక రోజు కొంపమీదకొస్తుందీ' అని! అందరూ అన్నట్లే అయిందిరా దేవుడో- ఇప్పుడు మాకేందారి నాయనో" అంటూ ఏడుస్తోంది పూనమ్.

మాకెవరికి ఏం జరిగిందో అర్థం కావటం లేదు.

కన్నీళ్లతో కూర్చుని ఉన్న రామనాధాన్ని సంగతేమిటని అడిగాడు విజయ్‌యాదవ్.

"ఏడవకే! ఎవరి ఖర్మ ఎలా ఉంటే అలా జరుగుతుంది! అది మనం కలలు కన్న దారిలో నడిచి ఇటు మన వంశానికి, అటు మనదేశానికి కూడా మంచి పేరు ప్రతిష్టలు తెస్తుందని ఆశపడ్డాం! కానీ ఇంత నికృష్ట



మయిన పనిచేస్తుందని ఎవరనుకున్నారు? " అంటూ అతను భార్యను ఓదారుస్తుంటే మాకు మేటర్ అర్థమయింది.

"వాళ్ల కూతురు ఎవడో కానివాడితో లవ్‌లో పడటమో, లేక లేచిపోవటమో లాంటిదేమయినా చేసిఉంటుంది" అన్నాడు శంకరమూర్తి రహస్యంగా. ఎంత రహ

స్యంగా చెప్పినా ఎలా స్ప్రెడ్ అయిందో తెలీదుగానీ- మా వాచ్‌మెన్ మరుక్షణంలో తన చుట్టూ మూగినవారికి చెప్తూ కనిపించాడు.

"పూనమ్ మేడమ్ కూతురు ఎవడితోనో లేచిపోయిందటంట! వాడు టాంక్‌బండ్ దగ్గర పల్లీలమ్ముతుంటాడంట"

"మీ అమ్మాయి ఏమయినా చేయరాని పని చేసిందా?" అడిగాడు శంకరమూర్తి డైరక్టుగా.

"చేయబట్టే మాకీ సమస్య సార్! క్షణాల్లో మా పరువు సర్వనాశనం అయిపోయింది. ఇక ముందు మేము నలుగురిలో ఎలా తలెత్తుకు తిరగాలి? "అన్నాడు రామనాథం మళ్ళీ.

ఇలా లాభంలేదని సీతావరదరాజన్ పూనమ్ పక్కన చేరింది.

"ఏమి జరిగినది? నీ బిడ్డ ఎవర్తోనో లేచిపోయివుండాదా?" అంది తమిళ్ యాక్సెంట్‌తో.

"లేచిపోయినా మాకు బాధవుండేది కాదమ్మా! అంతకంటే దారుణమయిన పని చేసింది- దేముడో నలుగురిలో నవ్వుల పాలయిపోయినాం నాయినో-"

వాళ్ళమ్మాయి ఎవడో దిక్కుమాలిన వాడితో లేచిపోయిందని కన్‌ఫరమ్ అయిపోయింది. సరిగ్గా అప్పుడే పక్క బెడ్ రూమ్ కర్టెన్ తెరుచుకొని వాళ్ళమ్మాయి శ్రావ్య కోపంతో హాల్లోకొచ్చింది.

"అమ్మా! నాన్న! మీకు దణ్ణం పెడతాను! దయచేసి ఏడుపు ఆపండి! నేను మీరిచ్చిన స్వేచ్ఛను దుర్వినియోగం చేసుకున్నమాట నిజమే! ఒప్పుకుంటున్నా కదా! ఇప్పటికయినా దయచేసి నా మానాన్న నన్ను వదిలేయండి! తప్పో ఒప్పో నాకిష్టమయిన బతుకు నన్ను బతకనివ్వండి-" అంది కన్నీళ్ళతో.

ఆ అమ్మాయిని చూడగానే అక్కడకు చేరిన మా అపార్ట్‌మెంట్ స్టూడెంట్స్ బిగ్గరగా నినాదాలు చేశారు.

"శ్రావ్య లవ్ మారేజ్ వర్థిల్లాలి! శ్రావ్య లవ్ మ్యారేజ్‌కి మేమందరం- సపోర్ట్ చేస్తాం సపోర్టు చేస్తాం..."

పూనమ్ కోపంగా లేచి నిలబడింది.

"చూశారా! ఎంత బరితెగించి మాట్లాడుతుందో! నీ భవిష్యత్తు గురించి ఎన్ని కలలు కన్నామే! ఎంత డబ్బు ఖర్చు చేశామే! నీ స్వార్థం కోసం మా కలలు నేల రాస్తావా? మా పరువు ప్రతిష్టలు మంట కలుపుతావా?" అంటూ మళ్ళీ ఏడుపు మొదలుపెట్టింది.

"మీరెవరు ఎన్ని చెప్పినా- నా నిర్ణయం మార్చుకోనమ్మా! కావాలంటే మీ ఇల్లు వదిలి బయటకుపోడానికైనా రడీ" అంది శ్రావ్య.

ఈసారి రామనాథం మాట్లాడాడు.

"అమ్మా శ్రావ్యా... నువు చేయబోతున్న పనివల్ల మాకే కాదమ్మా! నీకూ ఎన్నో అవమానాలు ఎదురవుతాయి. అందరూ నిన్ను అసహ్యించుకుంటారు. నీ ఫ్రెండ్స్ నిన్ను వెలివేస్తారు. మన అపార్ట్‌మెంట్స్ వాళ్ళు నిన్ను సోషల్ బాయ్‌కాట్ చేస్తారు-"

ఇక లాభంలేదని మేము కూడా కల్పించుకున్నాం.

"చూడమ్మా! తల్లిదండ్రులనిలా హింసించడం నీకు భావ్యం కాదు. పాపం వాళ్ళు కొడుకయినా కూతురయినా నువ్వే అనుకుని బతుకుతున్నారు. అలాంటిది ఇప్పుడు నువ్విలా ఎవడితోనో నీ స్వార్థం కోసం లేచిపోవడం సమంజసంగా లేదు" అన్నాడు శంకరమూర్తి.

"అవ్-నీది చేస్తున్నది మంచిపని లేదు" అన్నాడు హమీద్‌మియా.

సీతావరదరాజన్ ఆమెకు ఓ సలహా ఇచ్చింది.

"కావాలంటే నువ్ నిండా ప్రేమించిన

వాడితో ఎఫైర్ పెట్టుకో- కల్యాణం మాత్రం నీ పేరెంట్స్ చూసిన సంబంధమే చేసుకో- టూ బర్డ్స్ ఇన్ వన్ షాట్" అంది.

"స్టాపిట్! వాట్ నాన్సెన్స్ యూ ఆర్ స్పీకింగ్? అసలు నేను ఎవర్నో లవ్ చేశాననీ లేచిపోతున్నాననీ ఎవరు చెప్పారు మీకు?" అంది శ్రావ్య ఆవేశంగా.

అందరం కంగారు పడ్డాం.

"మరి మీ పేరెంట్స్..." అంటూ ఏదో నసిగాడు మొహిందర్ సింగ్.

"షటప్! తెలీనప్పుడు మాట్లాడకండి! అమ్మా! ఆరు నూరయినా, నూరు ఆరయినా సరే! నేను ఐఎఎస్ ట్రైనింగ్ కెళ్ళటం ఖాయం! నన్నెవరు ఎంత హీనంగా చూసినా ఫరవాలేదు. మీ ఇంట్లో నుంచి గెంటినా- నన్ను వెలివేసినా ఓకే! నాకేం ఫరక్ పడదు" అందామె.

వెంటనే పూనమ్ అందుకుంది.

"చూశారా- చూశారా! మళ్లీ అదేమాట! ఐఎఎస్ ట్రైనింగే ఎక్కువయిపోయింది దానికి! దానిని ఎనిమిదో ఏటే డాన్స్ బేబీ డాన్స్‌లో డాన్స్‌లు చేయించాను. ప్రత్యేకంగా సినిమా ఫీల్డ్‌లోని కొరియో గ్రాఫర్‌తో బూతు డాన్స్‌లు నేర్పించాము. వాడికివ్వాల్సిన ఫీజుకోసం మన ఫ్లాట్ ఒకటి అమ్మేశాం!

నీ వళ్ళంతా అణువుణువూ- మనదేశంలో పబ్లిక్ అంతా టి.వి. ఛానెల్ ద్వారా చూసే విధంగా ఫ్యాషన్ పరేడ్‌లో కాట్‌వాక్ చేయించాం!

ఆ తరువాత పది లక్షలు ఖర్చు పెట్టి నీతో రీమిక్స్ ఆల్బమ్ రిలీజ్ చేయించాం! దాని కోసం నా నగలన్నీ అమ్మేశాను. ఇదంతా ఎందుకు చేశాం? నువ్ సినిమాల్లో కెళ్ళి డాన్సుల స్పెషలిస్ట్ అవాలనే కదా? నీ బాడీ- బాడీలో వంపులూ ఎంత గొప్పవో అన్ని దేశాల వాళ్ళకూ తెలియాలనే కదా!

కనీసం సినిమాల్లో అయిటమ్ గాళ్‌గా డాన్స్‌లు చేసి మన వంశానికి పేరు ప్రతిష్టలు తెస్తావనుకున్నాం!

ఇన్ని అవస్థలుపడి- ఇంత ఖర్చు పెట్టి నిన్నీ స్టేజ్‌కి తీసుకొస్తే పేరున్న తెలుగు సినిమా డైరెక్టర్ మాంచి డాన్స్ అవకాశం ఇస్తే- కాదని ఐఎఎస్‌కు వెళ్తానంటావా?" అంటూ ముక్కు చీదిందామె.

"సరే- నీ మాటే నెగ్గాలనుకుంటే అలాగే కానీ, నువ్విలా నమ్మకద్రోహం చేస్తావని నేనూ మీ అమ్మా విషం బాటిల్స్ రడీగా ఉంచుకున్నాం. కన్నకూతురు ఇలా ప్రతిష్టాత్మకమయిన మాధ్యమాన్ని వదిలి ఐఎఎస్‌కు వెళ్తూంటే ఇంక మేము బతకటం అనవసరం. మా డెడ్‌బాడీస్ మీద నుంచీ నడిచి ఐఎఎస్ అవుదువుగాన్లే" తండ్రి సోఫా అడుగున దాచిన విషం బాటిల్స్ బయటకు తీశాడు. వాళ్ళిద్దరూ విషం తాగబోతూంటే ఆ అమ్మాయి ఆ బాటిల్స్‌ని విసిరిగొట్టి ఏడుస్తూ వాళ్ళ దగ్గర కూలబడింది.

"నా స్వార్థం కోసం మీరు ఆత్మహత్యలు చేసుకుంటూంటే చూడలేనమ్మా! మీ కోసం ఐఎఎస్ అవకాశాన్ని క్యాన్సిల్ చేసుకుని డాన్స్‌లు చేసే తారనవుతానమ్మా! మీరంతా కోరినట్లు సినిమాల్లో డబుల్ మీనింగ్ డైలాగులు, హావభావాలు, బూతు బాడీ జెర్కులు అన్నీ చేస్తూ మీకు మన బంధువులకూ, మన అపార్ట్‌మెంట్స్ వాళ్ళకు పేరు ప్రతిష్టలు తెస్తానమ్మా! అందరికీ ఆనందం కలుగజేస్తానమ్మా-" అంది.

అందరం తప్పట్లుకొట్టాం. ఆనందం భరించలేక మా అపార్ట్‌మెంట్ స్టూడెంట్స్ వెంటనే నినాదాలు మొదలుపెట్టారు. "శ్రావ్య డాన్స్‌లూ వర్ధిల్లాలి! భారతదేశానికీ పేరు ప్రఖ్యాతులు తేవాలి! భారత సంస్కృతీ- జిందాబాద్"





నవలల
పోటీలో
రూ.8,000/-
బహుమతి పొందిన
సామాజిక నవల



# అభిమానం



-డాక్టర్ చిలుకోటి కూర్మయ్య




అంబేద్కర్ సాక్షిగా మనుషులంతా ఒక్కటే అని అతడి విశ్వాసం. లోకాన్ని దగ్గరగా చదివితే అందుకు పూర్తి విరుద్ధం. పురుషులందు పుణ్యపురుషుల్లా మనుషుల్లోనూ తేడాలెన్నో?... వెలుగే చూడలేని వెలి బతుకులెన్నో? సమాజంలో ఈ చీకటి కోణాన్ని సహించలేకపోయాడతను. నేను కులాన్ని..కాదు, మనిషిని అని ఎలుగెత్తి చాటిందతడిలోని అభిమానం... నిమ్నజాతులకు, సామాజిక అసమానతలను నిరసించేవారికి ఆత్మస్థైర్యాన్ని నూరిపోసే స్ఫూర్తిదాయక రచన డాక్టర్ చిలుకోటి కూర్మయ్య నవల **అభిమానం** ఈనెల చతుర కానుక.

వెన్నెల రాత్రుల్నీ, వెలుగు రేఖల్నీ, వేళాకోళపు పిల్లల ఆటల్ని పొదివి పట్టుకొని ముఖం విప్పారిన ఎర్ర తామర పూలతో అన్నీ ఉన్న ఇంటి పెద్దలా నిండుగా ఉంది ఆ ఊరి చెరువు. పాటి పూడి ఊరిని ఆనుకొని పంట చేలకు వెళ్లే డొంకదారి పక్కన ఉంది ఆ చెరువు. చెరువుకి దక్షిణం వైపుగా ఊళ్లోవాళ్ల పెద్దపెద్ద దొడ్లు ఉన్నాయి. ఉత్తరం వైపున పంట చేలు, తూర్పుగా అంగడాల గొడ్లు మెయ్యడానికి ఖాళీ పోరంబోకు. నాట్లు పడ్డాక ఊళ్లో గేదెలన్నీ చెరువు పక్క ఖాళీ స్థలంలో ఉన్న ఆ కాస్త గరికనీ కొరికి, ఆ చెరువు నీళ్లల్లో సేదతీరుతాయి. ఊళ్లోవాళ్ల గొడ్లు దిగటానికి ఒకరేవు, మాల మాదిగల గొడ్లు దిగటానికి మాలోళ్ల రేవు ఉన్నాయి. ఏ రేవులో వాళ్ల గొడ్లే దిగుతాయి.

పొద్దుటపూట బడి అవ్వగానే, ఒకటి అరా గొడ్లు ఉన్న పిల్లలు గేదెల్ని తోలుకుని చెరువు దగ్గరకొచ్చేస్తారు. పోరంబోకులో గరిక కొరికినంతసేపు కొరికి, చెరువునీళ్లలో సేదతీరుతాయి గేదెలు. మళ్లీ బడిగంట కొట్టేలోగా గేదెల్ని తోలుకొని ఇళ్లకు బయలుదేరుతారు బడికి వెళ్లే పిల్లలు.

పొద్దుటపూట బడి అవ్వగానే గేదెల్ని తోలుకొని వచ్చి కాసేపు మేపి చెరువులోకి తోలారు మాలపల్లి పిల్లలు. అది పెద్ద చెరువు. ఊళ్లోవాళ్ల రేవులో ఈ మధ్యాహ్నంపూట గేదెలు తక్కువగానే ఉన్నాయి. ఊర్లో దొరల దగ్గర పాలేరుతనాలు చేసేవాళ్లు, అంగడాల గొడ్లు మేపేవాళ్లు గేదెల్ని మేపుతున్నారు. పంటచేను గట్టుమీద నిలబడ్డాడు సత్యనారాయణ. అతని గేదెలన్నీ డొంకంట మేస్తున్నాయి.

మాలాళ్లరేవు దగ్గర గట్టుమీద కూర్చున్నాడు ఏసుదాసు. ఆ ఊరిలో రెండు ఎలిమెంటరీ పాఠశాలలున్నాయి. ఒకటి ఊర్లో వారికి, మరొకటి మాలపల్లి మాదిగోళ్లకి. సి.ఎస్.ఐ. మిషన్‌వాళ్లు పెట్టిన బడది. అది ఏకోపాధ్యాయ పాఠశాల. ఆ పాఠశాల ఉపాధ్యాయుడు ఆనందరావు. ఆయన కొడుకు ఏసుదాసు.

ఏసుదాసు అదే స్కూల్లో తండ్రి దగ్గరే చదువుకుంటున్నాడు. ఆ మొత్తం మాలపల్లిలో చదువులో ఏసుదాసే మెరుగు. ఆనందరావు కుటుంబం మొత్తానికి మాలపల్లిలో చాలా గౌరవం ఉంది. ఆ పల్లెకి మంచి సెబ్బెర అన్నీ మాస్టారే.

మాల, మాదిగపిల్లలు నీళ్లలో ఈదులాడుతూ కొందరూ, తమ గేదెల ఒళ్లు కడుగుతూ కొందరూ ఉన్నారు. బుజ్జిగోడు, లచ్చన, సాదుగోడు చేపపిల్లల్లా ఈదుకుంటూ, చెరువులోని తామరకాడలు కాళ్లకి చుట్టుకోకుండా ఒడుపుగా తామరకాయలు కోస్తున్నారు.

ఒడ్డున కూర్చున్న ఏసుదాసు ఆ కాయ బాగుంది, 'ఇక్కడుంది చూడండి' అంటూ పై నుండి సలహాలిస్తున్నాడు. చెరువులో నుండి సాదుగోడి బోడిగేదె, పెసాదు ఒంటికొమ్ముగేదె, లచ్చన్న కర్రిముండ పైకెక్కాయి. చెరువుగట్టునున్న గరిక కొరుకుతూ బోదెగట్టు వైపుగా వెళ్లాయి.

"ఒరేయ్, నీయమ్మ ఈ గేదెలు సేలో పడతయేమోరా" అన్నాడు లచ్చన్న.

"డొంక మీద గరిక మేత్తయ్‌లేరా" అన్నాడు సాధు నిబ్బరంగా తామరకాయ అందుకుంటూ.

"సత్తెన్నారాయనగోరు ఉన్నాడ్రా బాబు"

"సేలో పడితె గదా"

"నీదంతా తలతిక్కరా, పదండ్రా తోలకొద్దాం ఇటు" అన్నాడు బుజ్జి.

గేదెలు బోదె పక్కన ఏపుగా పెరిగిన పచ్చగడ్డిని నిలిచి మేస్తున్నాయి. సత్యనారాయణ చేనంతా తిరిగి చూసుకుంటున్నాడు. పెద్దబోదెకి ఇవతల పక్కన చాలా దూరంగా మేస్తున్నాయి ఈ మూడు

గేదెలు. బోదె గట్టుకు దూరంగా నడుస్తూ చేను చూసుకుంటున్న సత్యనారాయణ, ఇటువైపు చూశాడు. "ఒరి పిల్లలంజాకొడకల్లార" అని ఒక్క వెర్రికేక వేశాడు. చెరువులో ఈదుతున్న పిల్లలందరూ ఒక్కసారి ఒడ్డుకొచ్చేసారు. గేదెలు చేలోపడి చేనంతా నాశనం చేసినట్టుగానే బండబూతులు తిడుతున్నాడు సత్యనారాయణ పిల్లల్ని- తన చేను తాను చూసుకుంటూనే. బుజ్జి, సాధు, ప్రసాదు, లక్ష్మణ, వాళ్లు తెచ్చిన తామరకాయలన్నీ అక్కడే పడేసి, చిన్న చేతికర్రలు తీసుకుని వాళ్ల గేదెలున్న వైపుకు బయలుదేరారు. ఏసుదాసు, వాళ్ళు తీసుకొచ్చిన తామరకాయల్లో పెద్దవాటిని ఏరుకుంటున్నాడు.

"పెళ్ళి నడకలు నడుస్తున్నారు. రండి లంజకొడకల్లార" అన్నాడు సత్యనారాయణ.

"డొంక మీదె గదుండె" అన్నాడు లక్ష్మణ వినీవినపడనట్లుగా.

ప్రసాదు పరుగెత్తికెళ్ళి సత్యనారాయణ తిట్టిన భయమంతా గేదె మీద చూపించి, చేతికర్రతో వీపుమీద ఒక్క మోదు మోదాడు.

"ఎందుకురా దాన్ని కొడతావ్" అన్నాడు బుజ్జి.

సాధు కర్ర పుచ్చుకుని తన గేదె పక్కనే నిలుచున్నాడు. గేదెలు చెరువువైపు ముఖం పెట్టి మేస్తున్నాయి. ప్రసాదు, లక్ష్మణ గేదెలని ఇంకాస్త అదలిస్తున్నారు. అవేమో పెరిగిన గరికని వదలలేక వెనకవైపుకి మెడచాచి కొరుకుతూనే ఉన్నాయి.

"ఒరే సాధు, నువ్వు తోలవేరా ఇటు" అన్నాడు సత్యనారాయణ.

"నేనుండాను గద. మేత్తది కసేపు" అన్నాడు సాధు.

స్తిమితంగా ఆ మూడెకరాల చేను చుట్టూ ఒక్కసారి తిరిగి, తాటిపట్టెమీద నిలబడి కాళ్లకంటిన మట్టిని పోయేట్టు కడుక్కుంటూ, "నీకింకోసారి చెప్పాలేరా, తోలటు లంజాకొడక" అన్నాడు సాధుని.

"నేనిక్కడే ఉన్నానుగదండే, కసేపు మేత్తది" అన్నాడు సాధు.

"ఏంట్రా లంజాకొడక, తలతిక్కమాటలు. తోలటు" అన్నాడు గాండ్రిస్తూ.

సత్యనారాయణ గాండ్రింపుకి ప్రసాదు, లక్ష్మణ, బుజ్జి ఇంకాస్త గట్టిగా గేదెలని చెరువు వైపుకు తోలారు. సాధు కూడా గేదెని తోలడం ఇష్టంలేనట్లు 'హెయ్', 'హెయ్' అంటున్నాడు.

"నాలుగు తగిల్తేగాని తోలవురా నువ్వు, సుతారంగా కేకేత్తన్నాడు, తోలు" సత్యనారాయణ గాండ్రింపు.

"కసేపు మేత్తదిలెండే, నేనుండానుగా" అని సాధు అనేటప్పటికి చిర్రెత్తుకొచ్చింది సత్యనారాయణకి. తన కేకకి భయపడి మిగిలిన ముగ్గురు పిల్లలూ గేదెల్ని తోలుకెళ్ళి పోతుంటే, వీడు కదలక పోయేటప్పటికి కోపం నషాళానికంటింది.

"ఎంత పొగర్రా నీకు, గేదె చేలో పడితే నీ తాత కడతాడ్రా!" అని సాధు నెత్తిమీద ఒక్కటేసి, వాడి చేతిలో కర్ర తీసుకొని గేదెని దబదబ రెండు బాది, తిట్ల పురాణం లంకించుకున్నాడు సత్యనారాయణ. లక్ష్మణ, ప్రసాదు, గేదెల్ని గబగబా చెరువులోకి తోలేసారు.

"డొంకలోనేగా మేసేది, ఎందుకు కొడతావండే" అన్నాడు సాధు ఏడుపు గొంతుతో.

ఈ మాటతో ఏం జరుగుతుందోనని, చెరువుగట్టునున్న మాలపిల్లలు బెదిరిపోయారు. ఏసుదాసు తామరకాయలు తీసుకుని ఒక్కపరుగిచ్చుకున్నాడు. సత్యనారాయణ సాధుగాడికి మరో రెండు తగిలించి, చేతికర్రని దూరంగా విసిరేసి, "డొంకంట డొంక, ఈడి బాబుది, చెప్తా నా కొడుకు పని, గేదె గట్టు దిగిందో అప్పుడు" అని

తిట్టుకుంటూ, వేపచెట్టు దగ్గర బితుకు బితుకుమంటూ కూర్చున్న మాలపిల్లల్ని రెండు తిట్లు తిట్టి వెళ్ళిపోయాడు.

సత్యనారాయణ అటు వెళ్ళగానే పిల్లలంతా ఏడుస్తున్న సాధు దగ్గర చేరారు.

"నేను చెపుతున్నాన్రా నువ్వినలా!" అన్నాడు బుజ్జి.

"డొంక ఆడి బాబు సొమ్మేంటి?" అన్నాడు సాధు ముక్కునుంచి కారుతున్న చీమిడి తుడుచుకుంటూ. నలుగురూ మళ్ళీ చెరువు గట్టుకు చేరారు. ప్రసాదు సాధునే చూస్తూ, వాడి గేదెని చెరువులోకి మొల్లేసాడు. ఇందాక వాళ్ళు కోసుకొచ్చిన తామరకాయలలో ఏసుదాసు పట్టుకుపోయినవి పట్టుకుపోగా మిగిలిన వాటిలో పెద్దవి వలిచి సాధుకిచ్చాడు లచ్చన్న. అందరూ చెట్టుకింద కూర్చుని, తామరకాయల్లో గింజలు తింటూ కబుర్లలో పడిపోయారు.

మాలపల్లిలో మధ్యాహ్నం పూట మొదటి బడిగంట గణగణ మోగడం మొదలెట్టింది.

పిల్లలంతా ఎవరికివాళ్ళే పుస్తకాలు పట్టుకొని కాకిగోలగా చదివేస్తున్నారు. ఇంకా పుస్తకాలు పట్టనివాళ్ళు పలకా బలపంతో కుస్తీ పడుతున్నారు. బడి మూడో బెల్ కూడా అయిపోయింది. ఇంకా ఒక్కొక్కరే వస్తున్నారు. సాధు గేదెని కట్టుకొయ్యకి కట్టేసి, కాస్తంత ఎండుగడ్డి వేసి, దాకలో ఉన్న అన్నం తిని, పుస్తకాలు పుచ్చుకుని బడి దగ్గరకొచ్చేసరికి, బుజ్జి, ప్రసాదు గుమ్మం దగ్గర నిలబడి వున్నారు తమ పుస్తకాలతో.

"ఏరా, ఒక్కొక్కరే దిగారన్నమాట ఇప్పటికి, రండిటు" అన్నాడు ఆనందరావు. భయం భయంగా ఒక పదిమంది వచ్చి నిలబడ్డారు ఆయన ముందు. ఆయన ఒక్కొక్కణ్ణి బెత్తం పట్టుకొని ఒక్కొక్క దెబ్బ కొడుతున్నాడు. ఆ కొట్టడంలో ఆపేక్షా లేదు, దండనా లేదు. కూలికెళ్ళాల్సిన ఆడవాళ్ళు చెంబుతో చిన్నగా నీళ్ళు చిలకరించి ఒక ముగ్గు వేసినంత అనాసక్తంగా ఆ పని చేసాడు.

ఆ బడి, ఎనిమిది గుంజల మీద లేచిన తాటాకుల పాక. ఆనందరావు మీద ఉండే గౌరవంతో ప్రతి సంవత్సరం కొత్త తాటాకులతో ఆ బడి కడుతున్నారు. ఊరందరి చేతులు అభిమానంగా కలవడంతో చాలా మంది ఇళ్లకంటే ఆ బడి దిట్టంగానే ఉంటుంది. బడికి ఒకపక్క మాత్రం మట్టి గోడ ఉంటుంది. ఆ వైపునే ఆనందరావు మాష్టారు, ఆయన చెక్కకుర్చీ, టేబులు వేసుకొని కూర్చుంటారు. ఆ కుర్చీ పక్కన ఒక చెక్కపెట్టె ఉంటుంది. అది రికార్డులు అవీ ఉంచడానికి. దానికి ఎప్పుడూ తాళం వేసే ఉంటుంది. పంతులుగారున్నా లేకపోయినా ఆ పెట్టెకొచ్చిన ప్రమాదమేమీ లేదు.

ఆనందరావు మాష్టారు ఒక్కొక్క క్లాసులో ఉన్న పిల్లలని దగ్గరికి పిలిచి పాఠం చెబుతున్నారు. ఐదవతరగతి వాళ్ళందరి పలకలూ చూసారు. ఒక్కొక్క పలకే చూస్తూ, "నాగేశ్వరమ్మా, ఈ లెక్క మరోసారి హెచ్చవెయ్యి" అన్నారు పలక చేతికిస్తూ. "సాధు అన్నీ కరక్టేరా"! అని రైటు పెట్టి పలక ఇచ్చారు. ప్రసాదుని పిలవగానే చేతులు కట్టుకుని మాష్టారి దగ్గర కొచ్చాడు. "బాగానే చేస్తున్నావ్" అంటూ పలకిచ్చారు. తప్పులు చేసిన వాళ్ళని ఒక్కొక్కళ్లనే పిలిచి సరిగా ఎలా చెయ్యాలో చెప్పి చేసుకు రమ్మన్నారు.

రెండు, మూడు తరగతుల పిల్లలు నీడ చూడడం ప్రారంభించారు.

"వెంకటేశ్వరరావు, పాస్‌బెల్ కొట్టరా" అన్నారు మాష్టారు. బోడిగాడు పలక అక్కడ పెట్టి, పరుగెత్తుకెళ్లి గంటమీద ఇనుపముక్కతో ఒక్క దెబ్బ కొట్టాడు. పిల్లలంతా ఒక్కసారి బడిలో నుండి బయటకి పరుగు. మంచి నీళ్లకి ఇళ్లకి పరిగెత్తేవాళ్లు

కొందరు, మరో పనికి మరికొందరు. ఇన్ని ఆటలు వీళ్లకెలా తెలుసన్నట్టు ఎవరి ఆటల్లో వాళ్లు మునిగిపోయారు.

★ ★ ★

మాలపల్లి ఇళ్లల్లో కిరసనాయిలు డిబ్బీలు వెలుగుతున్నాయి. పొలాల నుండి, పాలేరు తనం నుండి వచ్చిన వాళ్లు స్నానానికి ఉప క్రమిస్తున్నారు. ఆడవాళ్లంతా పొయ్యిల దగ్గర తంటాలు పడుతున్నారు. బడికి వెళ్లే పెద్ద క్లాసుల పిల్లలు దీపాల ముందు కూర్చుని, కూడబలుక్కుని పాఠాలు చదువు కుంటున్నారు. ఆనందరావు మాష్టారు ఆ వీధిలో తిరుగుతూ, "ఏం తిరుపతమ్మా, నీ కొడుకు, కూతురు ఇంకా పుస్తకాలుచ్చుకొని దీపం ముందుకు రాలేదు?" అన్నారు. తిరుపతమ్మ పొయ్యి దగ్గర నుండి బయటకి వచ్చి, "ఇంట్లో ఏం లేదని కోంటింటికి అంపాను. ఇద్దరూఎల్లారు పంతులుగారో!" అంది తప్పు చేసినట్లుగా.

"రాగానే కూర్చోబెట్టు. మళ్లీ నేనొస్తాను" అని ముందుకు నడిచారు.

సాధు వాళ్ల ఇంటి దగ్గర అరుగు కాస్త పెద్దది. కనీసం ఏడెనిమిది మంది పిల్లలు ఆ ఇంటి అరుగుమీద చేరి చదువుకుంటూ ఉంటారు. మాష్టారు అటువైపుగా రావడం చూసి, 'పంతులుగారు' అని ఒకరికొకరు హెచ్చరించుకుని ఇంకాస్త పెద్ద గొంతుతో చదవడం మొదలెట్టారు. దీపాలు పెట్టాక, పిల్లలందరూ కనీసం ఒక గంటసేపైనా చదివేటట్లు చూడడం, ఆయన ఒక పనిగా పెట్టుకున్నారు. మాష్టారు వీధుల్లో పచార్లు చేస్తూనే ఉన్నారు. పొలాలు వెళ్లినవాళ్లు చాలామందే తిరిగి వచ్చేసారు. పిల్లల చదువుల సందడి సన్నగిల్లింది. చిన్నపిల్లలయితే నిద్రలోకి వెళ్లిపోయారు.

ఒక్కసారిగా మాలపల్లిలోకి పదిమంది వచ్చేసారు. ప్రెసిడెంట్ తాతా రామకృష్ణయ్య, కరణం, మునసబు, సత్యనారాయణ, వెట్టివాళ్లు, కొత్తవాళ్లు మరో ఐదారు

## కొత్తగాలి... 

**చీకటిగుయ్యారంలో**
**ఎంత వెదికినా శూన్యం**
**వెలుతురు పొలంలో**
**కాసింత పనిచేసినా గుప్పెడు ధాన్యం**

–పాయసం సుబ్రహ్మణ్య మహర్షి, నెల్లూరు

గురు ఉన్నారు.

"ఆనందరావు పంతులేనా!" అన్నాడు ప్రెసిడెంటు.

"అవునండీ, ఏంటండీ ఇటొచ్చారు" అన్నాడు ఆనందరావు.

సమాధానం చెప్పకుండా, "ఒరే ఎట్టోడా, ఒక్కసారి మగోళ్లనందర్నీ రమ్మన్రా ఇక్కడికి" అన్నాడు ప్రెసిడెంట్ రామకృష్ణయ్య.

వెట్టి వెంకటసామి ఇంటింటికీ వెళ్లి, "పెసినెంటుగోరు, కరనంగోరు వచ్చేరు, అందరూ ఈదిలోకి రాండ్రా" అని పిలుస్తున్నాడు.

అన్నాలు తినేవాళ్లు కొందరు, స్నానాలు చేసేవాళ్లు కొందరు. 'ఎందుకంట?' అనే అనుమానంతో, 'వత్తన్నాం, వత్తన్నాం' అంటున్నారందరూ. తిళ్లు అయినవాళ్లు బడి దగ్గర వీధిలోకి బయలుదేరారు.

"పంతులూ, ఈయనేమో ఆర్. ఐ. ఈయన మన పెద్దాసుపత్రి నుండి వచ్చారు" అన్నాడు ఏదీ అర్థం కానీయకుండా- ప్రెసిడెంట్.

ఆసుపత్రి నుండి వచ్చారనేటప్పటికి ఆనందరావు కొంచెం అనుమానించాడు. బలవంతంగా తీసుకువెళ్లి ఆపరేషన్లు చేయిస్తున్నారని ఈమధ్య వింటున్నాడు. బహుశా అలాంటిదేదో అయివుంటుందనిపించి, తనని కూడా తీసికెళతారా అని కాస్త భయపడ్డాడు మనసులో.

"అదేనయ్యా ఆనందరావు, నీకు తెలియనిదేముంది, మరి మనూరికి కూడా ఇంత మందని పైనుంచి ఆర్డరొచ్చింది" అన్నాడు, కరణం వినిపించీ వినిపించనట్లుగా.

మగాళ్లంతా వస్తున్నారు.

"ఏంటండీ, కేకేశారంట" అన్నాడు గంగులు వస్తూనే.

"గంగులూ, పోతుగోడు సుబ్బడు, నీ తమ్ముడెంకన్న ఏర్రా ఈళ్లనందరూనూ? " అన్నాడు ప్రెసిడెంట్.

"వత్తన్నారండీ" గంగులు.

ఊర్లో నుండి ఆదరాబాదరా వస్తున్న మాదిగ మనేలు, "ఆ డొంకమీద లారీ ఎట్టారండే. దాని ముందేమో పోలీసులుండారండే" అన్నాడు బితుకు బితుకుగా.

"ఏం జూసి ఏవంటున్నావురా! ఎక్కడికెల్లబాక ఉండిక్కడ" ప్రెసిడెంట్.

"అట్టాగేనండే, ఇంటికాడ బియ్యం లేవండే" అని తుండుగుడ్డలో కట్టుకున్న బియ్యం మూట చూపిస్తూ, "ఇది పడేసొత్తానండే" అన్నాడు మిణుకుమిణుకుమంటూ.

"ఒక్కపూట తిండి ఆలిసమైతే చచ్చిపోతావురా లంజాకొడక. ఉండు" తిట్టిపోశాడు సత్యనారాయణ.

చేసేదిలేక అక్కడే నిలబడిపోయాడు మనేలు.

ఒక్కొక్కరే వచ్చారు. అంతా నలభైమంది వరకూ చేరారు. కరణం, 'అరే నువ్వటురారా, నువ్విటు వెళ్లరా' అంటూ పిల్లలున్నవాళ్లని ఒక పక్కకి ముసలివాళ్లని, పిల్లలు లేని వాళ్లని మరో పక్కకి నిలుచోమంటున్నాడు. ఈలోపు అక్కడకు మరో ఇద్దరు పోలీసులు చేరారు. పోలీసులు అక్కడ అడుగెట్టకముందే, పోలీసులు కూడా వచ్చారని పల్లె పల్లెంతటికీ పాకిపోయింది. దానితో ఆడవాళ్లు, ఇంకా నిద్రపోని పిల్లలు కూడా వీళ్లకి కాస్త దూరంగా వచ్చి నిబడ్డారు.

ఒక పాతికమందిని పక్కకి తీసిన తరువాత కరణం ప్రారంభించాడు- మాట్లాడడం-

"పైనుంచి మనకి ఆర్డర్లు వచ్చాయి. ఒక్కొక్క ఊరికి ఇంతమందని, పిల్లలు పుట్టకుండా ఆపరేషన్లు చేయించుకోవాలని. ఇద్దరు ముగ్గురికంటే ఎక్కువ ఉన్న వాళ్ళంతా బయలుదేరాలి. ఎవ్వర్నీ విడిచిపెట్టేది లేదు. మన ప్రెసిడెంటుగారి తమ్ముడు శివయ్యగారు కూడా చేయించుకుంటున్నారు. అంతా పదండి" అని ఊరుకున్నాడు, ఇంక మాట్లాడడానికి ఏమీ లేదన్నట్లుగా.

"నువ్వెళ్లవయ్యా, ఏదో పనిలో ఉన్నట్లున్నావ్" అన్నాడు ప్రెసిడెంటు, ఆనందరావుతో.

ఆడగుంపులో నుండి "కరణంగోరు కూడా సెయ్యించుకుంటున్నారా" అని చిన్న అరుపు.

"ఎవతె లంజది, నోటి కొచ్చినట్టు పేల్తంది. ముందు దాన్నెక్కించయ్యా" అన్నాడు ప్రెసిడెంటుతో వచ్చిన బలరామయ్య.

పెద్దమాల రాఘవయ్య ముందుకొచ్చి, "ఇంత రేత్తిరిపూట ఎందుకండీ, తెల్లారిగట్ట వత్తారుగా" అన్నాడు.

"అసలు ముందు ఈణ్ణెక్కించండ్రా! ఈ నాకొడుక్కి కోస్తే గానీ అసలు పొగరు దిగదు" అన్నాడు సత్యనారాయణ.

"అదేంటండే, ఆడన్నదాంట్లో తప్పేముంది? " అన్నాడు తాతారావు.

కరణం పోలీసులకి సైగ చెయ్యడంతో, పోలీసులు 'నడవండి' అని గదిమారు. ఏం జరుగుతోందో తెలిసేలోగానే, లారీ మీద ఎక్కించెయ్యడం, లారీ కదలడం జరిగిపోయాయి. సాధు వాళ్ళ నాన్నని ఎక్కించారు. వెంకటేశ్వరరావు నాన్నని, ప్రసాదు

వాళ్ళ నాన్నని, ఒకరిద్దరు పిల్లలున్న వాళ్ళని ఎక్కించారు.

ఆ రాత్రి మాలపల్లిలో ఎవ్వరికీ నిద్రలు లేవు. కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు, వాటిమీద నుంచి వచ్చే ప్రమాదాలు, మగ వాళ్లు సత్తువ లేకుండా అయిపోవడాలు, ఆపరేషన్లు వికటించి చచ్చిపోయినవాళ్లు నాకు తెలుసంటే నాకూ తెలుసని బోలె డన్ని గాథలు చెప్పుకున్నారు. ఎక్కడికి తీసుకెళ్ళారో ఎవరికి తోచిన విధంగా వాళ్ళు మాట్లాడుకున్నారు. రాఘవయ్య వీళ్ళ విషయం ఎలా తెలుసుకోవాలా అని దిగులుగా కూర్చున్నాడు. లారీ వెళ్ళిన తరువాత వచ్చిన ఏగేసు విషయం తెలు సుకుని మండిపడిపోయాడు.

"పదండ్రా, రండి ఆ పెసినెంటునే అడు గుదాం. ఏళ్ళొచ్చాయి బుద్ధిలేదురా లంజకొ డకల్లార, అడ్డమడొద్దా ఆళ్ళకి. అద్దరాతిరి మనోళ్ళని బయటికంపుతాఁ్రా!" అన్నాడు ఏగేసు.

"ఆc అడ్డమడతాఁ్రా, పోలీసులు గీలీ సులు అందరొత్తేను, ఏంటనుకుంటన్నవ్, అసలే ఎమర్జంటు రోజులు. ఎవుణ్ణయినా బొక్కలో తోసేత్తారు" అన్నాడు చిలకయ్య.

"నువ్వు ఇక్కడుండి సేసేదేంటి? బొక్క లోకెల్లి సెయ్యల్లేన్దేంటి తొక్కలోది" చిరాకు పడ్డాడు ఏగేసు.

"ఒరే ఏగేసా, ఎమర్జెంటు రోజులంటె నీకేం దెలుసురా? మొన్న గంటసాల్లో పోలీసోడికి ఎదురుమాటాడితే మక్కిలిరగ దన్ని లోపల దోసేరు. ఇంకా బయటికి రాలా. ఊర్లో కేకలేత్తే కాదు, బయటే వ్వారం" సముదాయించాడు మరో ముసలి.

ఈ మాటలకి ఏగేసు ఊరుకుండిపో యాడు. ఇందిరమ్మ హరిజనులకి ఇళ్లు, పొలాలు, గేదెలు ఇస్తోందనీ, వాళ్ళ బాగు కోసం చాలా చేస్తోందనీ విన్నాడు. ఎమ ర్జన్సీ పరిస్థితేమిటో ఏగేసుకి అర్థం

**కొత్తగాలి...**

**ఉదయం సూర్యుడు**
**రాత్రి చంద్రుడు**
**మరి మధ్యాహ్నం...?**
**ఆకలి తీర్చే అన్నం మెతుకు**

—చలపాక ప్రకాష్, విజయవాడ

కాలేదు.

పెద్దమాల రాఘవయ్య కఱ్ఱ తీసుకుని బయలుదేరాడు- "పెసినెంటుగోరి దెగ్గిరికో, కరనం గోరి దెగ్గిరికో ఎల్లాలి. అసలు ఇసయం తెలుత్తదిగద, ఇక్కడే కూకుంటే ఏం తెలుత్తది? " అని.

రాఘవయ్యతోపాటు ఏగేసు, మాదిగ చిన్నోడు, సాయిబు, రాగ్గాడు, మరో పది మందీ బయలుదేరారు. లారీ ఎక్కిన మగాళ్ల భార్యలు 'మేమూ వస్తా'మని బయలు దేరారు.

"ఈ రేత్తిరికాడ మీరెందుకు? మేమెల్లి తెలుసుకొత్తం గద, ఉండండెహె" అని బయలుదేరారు.

వర్షాలు లేక ఎండిన ఒండ్రుమట్టి బాట. అలవాటు పడ్డ కాళ్ళు, అనాయాసంగా ఆ కటిక చీకట్లో ముందుకెళుతున్నాయి. మాలపల్లి దాటి, చేనుకంపా దాటి, ఊరు పొలిమేరల్లో అడుగు పెట్టగానే దూరంగా వెలుగులు విరజిమ్ముతూ పంచాయతీ ఎల క్ట్రికల్ స్తంభం.

కరణం ఎప్పుడూ సాధారణంగా ప్రెసి డెంటు ఇంటికి రాడు. కాని హరిజనులం దరూ వచ్చారంటే, గబగబా వచ్చాడు. ఈ మధ్య హరిజనులని ఏమైనా అంటే జైల్లో పెట్టేస్తున్నారనీ, ఉద్యోగాలు తీసేస్తున్నారనీ వార్తలొస్తున్నాయి. 'ఈ మాల మాదిగ ల్లోనూ ఈ మధ్య తలబిరుసు వెధవలు

తయారవుతున్నారు. కీడెంచి మేలెంచమన్నారు' అనుకుంటూ వీళ్ళ దగ్గర కొచ్చాడు.

కరణాన్ని చూడగానే ప్రెసిడెంటు, "ఒరేయ్ కరణంగారికి ఇంట్లో నుండి కుర్చీ పట్టుకు రండ్రా" అన్నాడు. చిన్నపాలేరు కుర్చీ తెచ్చివేసాడు. అందరూ కరణం వైపు మొరలు పెట్టారు.

"ఒరే రాఘవులూ, నేనొకటి చెబుతున్నాను విను. ఆపరేషన్ వల్ల వాళ్ళకి మంచేగాని చెడు జరగదు. రేపు మీరు చల్లపల్లి ఆసుపత్రికి వెళ్ళండి. ఆపరేషన్ చేసి రెండ్రోజులుంచి పంపించేస్తారు. ఊరికే కాదురా, డబ్బులిస్తారు. ఇంకోమాట చెబుతున్నా మీకు. ఇందిరాగాంధీ ఎన్ని పనులు చేస్తోంది, ఎన్ని పథకాలు పెడుతోంది, అన్నీ మీ మేలు కోసమే. మిమ్మల్ని పైకి తీసుకుని రావాలనేరా ఆవిడ ఎమర్జెన్సీ పెట్టింది! ఇంకోటి, రేపు ఇళ్ళు కావాలన్నా, గేదెలు, పోరంబోకులు రావాలన్నా.. సరే మనూర్లో పోరంబోకు భూమి లేదనుకో, మాటవరసకి చెబుతున్నాను.. ఏది రావాలన్నా ముందు ఆపరేషన్ చేసుకుని ఉండాలి. ఉండాలంతే! మీరంతా దీని కోసం గాబరా పడాల్సిన పనిలేదు. రేపు చల్లపల్లి వెళ్లండి. అన్నీ దివ్యంగా జరుగుతాయి. పొద్దు పోయింది. వెళ్ళండి, నిద్ర చేటు, పొండి, పొండి!" అన్నాడు.

"అయ్యా, మమ్మల్ని రానిత్తారా! మీరెవ్వన్నా వత్తారండీ!" అడిగాడు రాఘవయ్య.

"మీరెళ్ళండి, ఏం ఫరవాలేదు. చూద్దాం! నేనో, ప్రెసిడెంటుగారో ఎవరో ఒకరు రాకపోం!" అన్నాడు కరణం.

"నీయమ్మ అందరికీ మనమే తేరగా దొరుకుతున్నాం. కమ్మోరి నుండి కాపుల్నుండి, బేపనోరి నుండి ఒక్కణ్ణెక్కించి కెల్లారంట్రా ఆపిరేసన్‌కి? " వెనక్కి తిరిగి నడుస్తూ అన్నాడు మందిలో ఒకడు.

"ఆల్లకీ మనకీ సాపత్తమేంట్రా" మరొకడు.

"మనయి పేనాలు గాదురా! ఉచ్చోసుకోవాలన్నా ఈల్ల నడగాలి" అని తలో మాటా అనుకుంటూ కరెంటు వెలుగులు దాటి చీకటిలో మాలపల్లి చేరారు.




సాధు, వాళ్ల పెద్దమ్మ ఎప్పుడో కుట్టించిన దాపుడు చొక్కా తీసుకొని వేసుకున్నాడు. నాగేశ్వరమ్మ, వాళ్ళ మేనమామ కుట్టించిన గౌను వేసుకుంది. ప్రసాదు, ఆనందరావు మాష్టారి ఇంటి వైపుకి రెండు మూడుసార్లు వెళ్లి వచ్చాడు. బోడిదాని ఇంట్లో ఇంకా తర్జన భర్జనలవుతున్నాయి. మాదిగోళ్ళ సుందరం, ఉతికిన చొక్కా నిక్కరూ వేసుకుని ఎవరైనా కదులుతారేమోనన్నట్లు చూస్తున్నాడు.

ఈ దేశానికి స్వాతంత్ర్యం వచ్చి ఇరవై ఎనిమిదేళ్ళు నిండాయి. మాల పిల్లలు, మాదిగ పిల్లలు పాలేరుతనానికి కాకుండా, పది పన్నెండేళ్ళ వయసులో తొలిసారిగా పొరుగూరులో హైస్కూలు చదువులకి బయలుదేరుతున్నారు. ఆ పిల్లల్లో భయం, బెరుకు, ఉద్వేగం, ఉత్సాహం అన్నీ కలగలిపినతనం, పట్టరానితనం. అందరూ కాలు కాలిన పిల్లుల్లా అటూ ఇటూ తిరుగుతున్నారు.

అంతకంటే మరీ విచిత్రమైన అనుభవం వాళ్ళ తండ్రులది. పిల్లల్ని చేర్చడానికి

# రచయితలకు సూచనలు



నవ్యనవలా వేదిక 'చతుర'కు రచనలు పంపేవారు ఈ కింది సూచనల్ని గమనించాలి.

★ చతురకు నవలలు పంపేవారు సామాజిక సమస్యలపై దృష్టి పెట్టాలి. హాస్య, వ్యంగ్య తదితర ఏ ఇతివృత్తమైనా ఎంచుకోవచ్చు. ఏ మాండలికమైనా రాయొచ్చు. వైవిధ్య కథా వస్తువులకు ప్రాధాన్యం ఉంటుంది. నవ్యతకే పెద్దపీట.

★ బొమ్మలు, వివిధ శీర్షికలు, ప్రకటనలు పోను 'చతుర' నవల అచ్చులో 80-85 పేజీలు ఉంటుంది. దీన్ని దృష్టిలో పెట్టుకుని రచయితలు తమ నవలల్ని అచ్చులో 85 పేజీలు మించకుండా రాసి పంపాలి.

★ ఒక పాత 'చతుర' సంచిక తీసుకుని అందులో ఉన్న నవలలో ఒకటి లేదా రెండు పూర్తి పేజీలను తమ దస్తూరితో రాసి చూసుకుని ఆ మేరకు తమ నవల రాతప్రతి ఎన్ని పేజీలలో రాయవచ్చో అంచనాకు రావడం సులభం. ఏదేమైనా అచ్చులో 80-85 పేజీలకు మించకుండా లేదా తక్కువ కాకుండా ప్లాన్ చేసుకుని పంపడం మంచి పద్ధతి.

★ ప్రచురణకు స్వీకరించని నవలలు/రచనలు తిప్పిపంపేందుకు వీలుగా స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవరు జతపరచడం మరువకండి. రాతప్రతులు పోస్ట్‌లో పోతే 'చతుర' బాధ్యత వహించబోదు.

★ స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవర్లు జతపరచని వారి రచనలు తిరస్కారానికి గురైతే ట్రాష్‌లోకి వెళ్లిపోతాయి. వాటి గురించి ఉత్తరప్రత్యుత్తరాలకు తావులేదు.

★ సాధారణంగా నవలలు కార్యాలయానికి అందిన 4 - 8 వారాలలోగా పరిశీలించి ప్రచురణార్హమైతే ఆ విషయం తెలియపరుస్తాం. కాకుంటే తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రచురితమైన ప్రతి నవలకు రూ. 6000/- పారితోషికం ఉంటుంది. నవల ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటి వారంలోనే పై మొత్తానికి రచయితకు చెక్కు అందుతుంది.

★ 'కొత్తగాలి' శీర్షికకు చిరుకవితలు పంపేవారు నాలుగు/ఐదు పంక్తులు మించకుండా పంపాలి. స్పార్క్‌కే మార్కు అన్న విషయం గుర్తించాలి.

**చతుర**

చిరునామా :
ఎడిటర్, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్-500082

ఆనందరావు మాష్టారు, వాళ్ళ తండ్రులు కూడా ఉండాలన్నాడు. సుందరం వాళ్ళ నాన్నని, దొర పున్నయ్య పంపడం కుదర దన్నాడు. చివరికి అతి కష్టంమీద పను లన్నీ చూసుకుని, హైస్కూల్‌కి అటునుండి అటే వెళ్ళడానికి అనుమతిచ్చాడు. ఆపాటి దానికే సుందరం నాన్న దొరకి కనీసం పదిసార్లన్నా దండం పెట్టాడు.

ఆనందరావు మాష్టారు కొడుకుని తీసు కుని, అందరి ట్రాన్స్ఫర్ సర్టిఫికెట్లు పట్టు కుని బయలుదేరాడు. ఆయనతోపాటే సాధు, ప్రసాదు, సుందరం, బోడిది (వెంక టేశ్వరమ్మ), నాగేశ్వరమ్మ, వాళ్ళ నాన్నలు బయలుదేరారు. ఇంతమంది ఉన్నంతలో మంచి బట్టలు వేసుకొని ఒక్కసారిగా బయలుదేరడం వాళ్ళకి చిత్రమైన అను భవం.

ఇంట్లోంచి బయటకొచ్చిన పార్వతి, "గంటసాల పెద్దబడ్లోకా!" అంది ప్రశ్నా ఆశ్చర్యమూ కాకుండా.

★ ★ ★

స్కూలు గేటులో నుండి లోపలికి చూడ గానే "అమ్మో! ఎంత పెద్దబడో!" అంది నాగేశ్వరమ్మ. అందరి కళ్ళూ ఆశ్చర్యంతో నిండిపోయాయి. "మాట్టాడబాక" అంది బోడిది మెల్లిగా.

హెడ్మాస్టరు ఈ పిల్లలందర్నీ ఒక్కసారే పిలిచారు. ఆనందరావు వెనక పిల్లలం దరూ చేతులు కట్టుకుని నిలుచున్నారు.

"ఏరా చదువుకుంటారారా సరిగా!" అన్నారు హెడ్మాస్టరు. అందరూ ఆనంద రావు వైపు చూసి బుర్రలూపారు.

"స్కూలు మానకుండా వస్తారు కదా!" మళ్ళీ తలలు ఊపారందరూ.

"హరిజనులకి బోలెడన్ని సౌకర్యాలి స్తోంది గవర్నమెంట్. జాగ్రత్తగా చదువు కోవాలి. ఏమిటి? " అన్నారు గద్దిస్తూ. ఈసారి బిగుసుకుపోయారు పిల్లలందరూ.

ఏసుదాసుని, నాగేశ్వరమ్మని, వెంకటేశ్వ రమ్మని ఆరవతరగతి 'ఎ' సెక్షన్లో వేసారు. మిగిలిన ముగ్గురు మగపిల్లల్ని 'బి' సెక్షన్లో వేసారు. "స్కూలు మానితే ఊరుకోను నేను. వాననీ పననీ మానితే కుదరదు. రేపటి నుండి స్కూలుకి రావాలి. ఇక వెళ్ళండి" అన్నారు హెడ్మాస్టరు. వీళ్ళంతా మరీ భయపడిపోయారు.

అప్లికేషన్ ఫారాల మీద వేలిముద్రలు గుద్దడం మినహా ఈ తండ్రులకు మరో పనేం లేదు. అలా వరండాలంట దూరం దూరంగా నిలబడ్డారు.

అందరూ తిరుగు ముఖం పట్టారు. వీళ్ళతోపాటు ఆ ఊరు నుండి ముగ్గురు బ్రాహ్మల పిల్లలు, ఇద్దరు కమ్మోరి పిల్లలు, ఒక గొల్లపిల్లవాడు, ఒక మంగలి కుర్రాడు, ఇద్దరు కాపుల పిల్లలు కూడా చేరారు. పది హేనుమంది 'పాటిపూడి' పిల్లలే చేరారు. ఘంటశాల హైస్కూలుకి రోజూ రాను పోను మూడున్నర మైళ్ళ నడక.

★ ★ ★

పాలేరుగా మిగిలిపోవలసిన గండం నుంచి బయటపడి ప్రసాదు హైస్కూల్లో చేరాడు.

ప్రసాదుని చదివించాలని వాళ్ళమ్మ మాలచ్చిమికి చెడ్డ పట్టుదల. ప్రసాదు తండ్రి పోతురాజు, దేవినేని గంగాధరరావు ఇంటి దగ్గర ఇంటి మనిషిలాగా చాలా కాలం నుంచి పాలేరుతనం ఉంటున్నాడు.

ఈ మధ్యనే గంగాధరరావు కోళ్ళ ఫార మొకటి పెట్టాడు. వాటికి మేతెయ్యడానికి, పెంటెత్తడానికి, ఫారాన్ని కనిపెట్టుకుని ఉండటానికి, ఓ బుడ్డోడు ఉంటే బావుం డని చూస్తున్నాడు. ఒకరోజు వాళ్ళ నాన్నకి అన్నం తీసుకొచ్చిన ప్రసాదుని చూసాడు.

"పోతుగా, నీ కొడుకేనంట్రా ఆడు? , బాగా పొడుగయ్యాడ్రా!" అన్నాడు గంగాధ

రరావు.

"ఒక్కడే గదుండే, ఆడికి తోడు పుట్టే ఇది లేకుండా అయిపోయింది గదుండే" అన్నాడు భారంగా పోతురాజు.

"ఒరే పోతుగా, ఒకపని జెయ్యరా! ఆడు నీ కళ్ళముందే ఉంటాడు. మన ఫారం దగ్గరెట్టేయ్! తరువాత సూసుకుందాం మనం. ఆలస్సమెందుకూ రేపణ్ణుంచి పంపు ఆణ్ణి"

కొడుక్కి కోళ్ళ ఫారం దగ్గర వెంటనే పని దొరకటం పోతురాజుకి ఆనందంగానే ఉంది. కానీ రేపే పనిలో పెట్టెయ్యడానికి కొంచెం సంశయించాడు.

"ఎంట్రా మాటాడవ్?"

"ఇంటికాడ దానికీ... ఓ మాట సెప్పి... అయినా చిన్నోడు గదుండే"

"ఏంట్రా ఆడదానికి సెప్పేది? నువ్వు ఆడికంటె సిన్నప్పుడు రాలేదంట్రా గొడ్లకాడికి. బేకుగాడి కొడుకు, తొర్రి రాములుగోడు, ఈళ్ళంతా నీ కొడుకు ఈడోళ్ళు కాదంట్రా! ఆళ్ళు చెయ్యట్లా? ఎదవ! బుర్ర గోక్కోటం కాదు రేప్పంపు" అని హుకుం జారీ చేసి వెళ్ళిపోయాడు గంగాధరరావు.

రాత్రికి ఇంటికి కాస్త మందు తోడుగా వచ్చిన పోతురాజు, "పెసాదుని మన దొరగారి కోళ్ళ ఫారం దెగ్గిరెట్టేసానే. నాలాగ్గాదు, నాలుగు సోట్ల తిరగక్కర్లేదు. ఫారం దగ్గిరే పని. ఆయనగోరు చానా ముచ్చటపడ్డాడు ఈణ్ణి సూచి" అన్నాడు.

పుస్తకం ముందు కూర్చున్న ప్రసాదు గతుక్కుమన్నాడు. నిలువు గుడ్లయిపోయాయి వాడికి.

మాలచ్చిమికి కోపం నషాళానికంటింది. "ఇంకేం, ఆడి పాటు కూడా తాగొచ్చు నీ పాటంతా దిగమింగుకున్నది సరిపోలా! ఉప్పుడు పసిబిడ్డ కస్టం కావాల్సొచ్చింది" అంది.

"ఏంటే, నేను తేకుండా అవుతుందా? వాగుతున్నావేంటి? నోరు లెగుత్తోంది

## కొత్తగాలి...



**పేదవాడికి తాయిలాలు**
**రాయితీలు..భేష్**
**పెద్దవాడికి ప్రాజెక్టులు**
**టెండర్లూ శభాష్**
**వధ్యశిలపై మధ్యముడిని**
**పట్టించుకోరేం బాస్?!**

*–గుండాన జోగారావు, సింహాచలం*

లంజకి"

"నా నోరెందుకు లెగుత్తుది, నోట పోసుకొచ్చావుగా నీ నోరు లెగుత్తది. నేనాణ్ణి పాలేరుతనానికి పంపను. ఒక్కగానొక్కడు. పంతులుగోరు పెద్దబళ్ళో చేరత్తామంటన్నారు. ఒత్తే రెండచ్చరం ముక్కలొత్తాయ్, లేదా ఆడి రెక్కలున్నయ్. ఆడి బతుకు ఆడు బతుకుతాడు" అంటూ మొగుడికి నీళ్ళు తోడి "తానం జెయ్యి" అంది.

"ఆఁహా సదువు, సదువుకుని ఊళ్ళేల్తాడు. మొన్న సోగ్గాడికి ఉత్తరమొత్తే సదవటానికి పూటట్టింది ఈ లంజాకొడుక్కి. ఈడికి సదువొత్తదీ? సదువు బేపనోల్లదే, మంది కాదు!..." అంటూ తుండుగుడ్డ తీసుకుని స్నానం చెయ్యడానికి వెళ్ళాడు.

అక్కడినుంచి వేరే మాటలకి వెళ్ళిపోయింది వాళ్ళ సంభాషణ.

ప్రసాదుకి పుస్తకంలో అక్షరాలు కనిపించడం మానేసాయి. బడి మానెయ్యటమంటే వాడేమనుకునేవాడో...! ఏకంగా కోళ్ళ ఫారం దగ్గర పని! అలవాటు లేదు. తెల్లారగానే పనికెళ్ళిపోవాలంటే, గుండె పీచుపీచుమంటోంది వాడికి. వాడీడువాళ్ళు అప్పుడే చిన్న పాలేర్లుగా ఏడాదిగా పనిచేస్తున్నారు. పుస్తకంలో అక్షరాలు మానేసి, పాలేరుతనంలో చెయ్యాల్సిన పనులు

ఊహకి రావడం మొదలుపెట్టాయి.

తెల్లారింది. ప్రసాదు నిద్ర లేచి, కాల వంటే ముందుగా బడిదగ్గరకెళ్ళొచ్చాడు. వాళ్ళ నాన్నకి రాత్రంత విసురు లేదు.

"నేను అక్కడే ఉంటా. నువ్వు అణ్ణి తీసుకురా!" అని పోతురాజు తలగుడ్డ చుట్టుకుని, కర్రబొట్టొడుచుకుంటూ బయలుదేరి పోయాడు.

మొగుడికి సత్తుకారేజిలో అన్నం పెట్టుకుని, కొడుకునెంటబెట్టుకుని బయలుదేరింది మాలచ్చిమి.

మాలచ్చిమిది బందరు దగ్గర చిన్న గ్రామం. ఆ ఊరిలో చదువుకున్నవాళ్ళూ, చదువుకుని ఉద్యోగాలు చేస్తున్న వాళ్ళూ ఉన్నారు. తన బిడ్డల్ని చదివించాలని మొదట్నించీ ఉంది. చిన్నప్పుడు బడికి వెళ్ళింది. ఒకటి అరా అక్షరాలు కూడబలుక్కోగలదు. ఎప్పుడు సమయం వచ్చినా, తను పుట్టినూర్లో చదువుకుని పైకొచ్చిన వాళ్ళ సంగతులు ప్రసాదుకి చెబుతూ ఉండేది.

ముగ్గురూ కోళ్ళఫారం దగ్గర కలిసారు. గంగాధరరావు అక్కడికి రాలేదు. కాసేపు చూసి తట్ట, కొడవలి, కత్తి పట్టుకుని పొలా



లవైపు మాలచ్చిమి, కర్ర పట్టుకుని కాలువ వైపు పోతురాజు బయలుదేరారు. ప్రసాదుని ఇంటికెళ్ళమని చెప్పి పోతురాజు వెనక్కి తిరిగి, "దొరగోరు కనబడితే ఏం జెప్పమంటవే" అన్నాడు.

"ఏం జెపుతవ్, నేను సెప్పాలి నీకు!" అని విసురుగా వెళ్ళిపోయింది మాలచ్చిమి.

సాయంత్రం ప్రసాదు ఇంటి దగ్గర గేదెను కట్టేస్తుంటే, "పెసాదో, మీ యమ్మ గరువుమీద పొలాల్లో ఉంది. మోపేదో ఉందంట, నిన్ను రమ్మంది" అని నెత్తిమీద పుల్లల మోపుతో వెళుతూ చెప్పింది లక్ష్మణ వాళ్ళ అమ్మ.

ప్రసాదు గేదెని కట్టేసి, దాని ముందు నాలుగు గడ్డిపరకలేసి వాళ్ళమ్మ దగ్గర కెళ్ళాడు. ఇద్దరూ చెరో కర్రలమోపు నెత్తిన పెట్టుకుని డొంక గట్టుదాటి ముసలయ్య చేనుకు అడ్డంపడి, మాలపల్లివైపు వచ్చే డొంకని కలవడానికి తాడిచెట్లమదుంలో నుండి వస్తూ ఉంటే గంగాధరరావు ఎదురుపడ్డాడు వీళ్ళకి.

మాలచ్చిమి ఎదరమనిషి కనబడనట్లుగా మోపు కొంచెం కిందికి జరిపి పక్కవారగా నడుస్తోంది. వాళ్ళ అమ్మ వెంట ప్రసాదు. ప్రక్క ఊరు వెళ్ళి వస్తున్న గంగాధరరావు వీళ్ళని గమనించాడు. చూసీచూడనట్లు వెళ్ళడాన్నీ గమనించాడు.

"ఏమే, చెప్పలేదా పోతుగాడు నీకు" అన్నాడు.

"ఏవఁనలేదుండే దొరగారో" అంది చిన్న సందు దొరకడంతో.

"లంజ!, నాకు తెలవదంటే ఆడి సంగతి? ఏం జెప్పలేదు? నీ కొడుకు సంగతి"

"ఆడేం జేసాడు బాబో"

"ఏం జెయ్యడమేంటే, మనం కొత్తగా కోళ్లఫారం పెట్టాంగా! ఈణ్ణి అక్కడ పెట్టమన్నాంగా కోళ్ళు బోళ్ళు చూసుకుంటాడని. పోతుగాడు చెప్పలా? "

మాలచ్చిమి స్థిరంగా నిలబడింది. గుండె నిబ్బరం కోసం, నెత్తిమీద బరువు ఉన్నట్లుగా గట్టిగా గాలి పీల్చింది. నిదానంగా, స్థిరంగా చెప్పింది.

"అయ్యగారో, ఆణ్ణి పనికంపుదామను కోడం లేదు. బడికి పంపిద్దామనుకుంటన్నాం"- అని.

"ఆఁహా! చదివిస్తావన్నమాట! తెలివి మీరి పోతన్నారే! ఆ యవసరం బాబు, ఈ యవసరమని గడిగడికీ వచ్చి, మేమేవో రాసులు పోసుకుకూర్చున్నట్టు అడుక్కెలతారుగా! అప్పుడుండదు బుద్ధి, తీర్చాలని. ఈ నా కొడుకుని పనికి పెట్టమంటే సదివిత్త దంట. సెప్తా పోతుగాడిపని! ఆడేం జెప్పాడో నాకు, నువ్వేం చెబుతున్నావో.." అంటూ తిట్ల పురాణం మొదలెట్టాడు. ప్రసాదు పనిలోకి రాకపోవడం కంటే, వీళ్ళు చూడనట్లు వెళ్ళిపోవడం గంగాధరరావుకి చిర్రెత్తింది.

ప్రసాదు ఈ తిట్లకి భయపడిపోయాడు.

"ఎందుకు బాబూ నోటికొచ్చినట్టంతా మాట్లాడతారు. మారెక్కల కష్టం. పనిజేత్తే ఇత్తారు. ఊరికే ఎవురూ ఇవ్వరు" అని ఇక నిలబడకుండా "పదరా పెసాదో" అని ముందుకు కదిలింది.

గంగాధరరావు ఉడికిపోతూ తన ఇంటి వైపు వెళ్ళిపోయాడు.

★ ★ ★

ఆరోతరగతి పిల్లలకు చాలా కొత్తగా, ఉత్సాహంగా ఉంది. పాటిపూడి పిల్లలంతా మొదటిగంటకి ముందుగానే స్కూల్లోకి చేరారు. పాటిపూడి పెద్దకులాల వాళ్ళ పిల్లలు యాభైమంది వరకూ రోజూ హైస్కూలుకి వెళ్ళేవాళ్ళున్నారు. వాళ్ళతో కలిసి కొత్తగా చేరినవాళ్ళు స్కూలుకి బయ

## కొత్తగాలి...

**సింగారానికి**
**నగలు**
**శృంగారానికి**
**వగలు**

–వసుపులేటి శివ, నెల్లూరు

లుదేరారు.

పాటిపూడి మాల మాదిగ పిల్లలు బడికి వెళ్ళడం తొలిసారి. ఈ దారి వాళ్ళకేం తెలియంది కాదు. చాలాసార్లు నడిచిందే! అదే దారిలో కొత్త జీవితం కోసం, కొత్త జీవిక కోసం. ఇంతకాలం వాళ్ళకి దూరంగా ఉంచిన జ్ఞానంకోసం. బెరుకు బెరుకుగా, ఉద్వేగంగా... కొత్త బడికి.

ఆరోతరగతి 'ఎ' సెక్షన్, 'బి' సెక్షన్, 'సి' సెక్షన్ తరగతి గదులు. ఆరోతరగతి పిల్లలందరూ వాటి దగ్గరికి చేరారు. ముందుగానే చాలామందికి వాళ్ళ సెక్షను తెలుసు కాబట్టి ఆయా సెక్షను తరగతి గదులలోకి వెళ్ళి పోయారు. తెలియనివాళ్ళు ఆ సెక్షన్ల దగ్గరే తచ్చాడుతున్నారు.

మూడో గంట కూడా కొట్టేసారు. సాధు, ప్రసాదు, సుందరం కూడబలుక్కుని 'బి' సెక్షన్‌లోకి వెళ్లారు. అప్పటికే ముందు బెంచీలు నిండిపోయాయి. ఈ నలుగురూ తలా ఒకరు, తలా ఒక బెంచీలో ఖాళీ ఉన్నచోట కూర్చున్నారు.

ఏసుదాసు, నాగేశ్వరమ్మ, వెంకటేశ్వరమ్మ 'ఎ' సెక్షన్‌లోకి వెళ్లారు. ఆ సెక్షన్‌లో ఆడపిల్లలు మొదటి బెంచీలో ముగ్గురు కూర్చున్నారు. దాని వెనక బెంచీలో వీళ్లిద్దరూ కూర్చున్నారు. ముందు బెంచీలో వాళ్ళ ఊరి బ్రాహ్మల అమ్మాయి ఉంది.

సాధుకి, ప్రసాదుకి ఈ స్కూలు వింత లోకంలా ఉంది. పొడుగు బెంచీలు, ముందు పుస్తకాలు పెట్టుకోడానికి డస్కులు. మాలపల్లి మొత్తంలో ఇట్లాంటి బెంచీ ఒక్కటి లేదు. ఇక్కడ మాష్టారు కూర్చునే కుర్చీ, టేబులు కూడా నున్నగా కొత్తగా, సోకుగా ఉన్నాయి వాళ్ళకి. తొలిసారిగా బెంచి మీద కూర్చుని, అటు ఇటు కదలి, సర్దుకుని ఆ ఆనందాన్ని ఆస్వాదిస్తూ కూర్చున్నాడు సాధు. ప్రసాదు, సుందరం వాళ్ళ డస్కులు తడిమి చూసుకున్నారు మిగతా పిల్లల లాగే.

మొదటి రోజు కావడంతో ఆరవ తరగతి పిల్లల్ని మధ్యాహ్నం విడిచి పెట్టేశారు.

★ ★ ★

పుస్తకాలు, క్యారియర్లు పట్టుకుని పిల్లలు నడుస్తున్నారు.

"మా యమ్మ కోతలప్పుడు బడి మానెయ్యమంటాంది" అంది నాగేశ్వరమ్మ.

"రాత్రే మా అమ్మ కూడా అంది" అన్నాడు ప్రసాదు.

"మా చెల్లీ, తమ్ముడూ ఇద్దరూ ఇంటికాడే గదరా మా యమ్మ కూడా కోతకెళ్లిపోతే గేదల్ని నేనే ఊడదియ్యాలి. రెండ్రోజులాగి నేనూ మానేస్తా. కోతలయ్యాక బడికొస్తా" అన్నాడు సాధు.

ఏసుదాసు, సుందరం మినహా అందరి పరిస్థితీ అలాగే ఉంది. ఏసుదాసుకి చదువుకోవడం తప్ప మరోపని లేదు. సుందరం, ఏడుగురు అక్కచెల్లెళ్లు, అన్నదమ్ముల్లో కడసారపువాడు. ఇంటి దగ్గర చూడవలసిన బాధ్యతలేమీ లేవు. మిగతా వాళ్లు, ఏ మాష్టారు ఎలా తిడతారు? ఒప్పుకుంటారా లేదా? హాజరు సరిపోతుందా - ఈ లెక్కల్లో పడ్డారు. మంగలి రాజు కొడుకు, "నేను పొద్దుటొచ్చి మద్దానం మానేస్తా" నన్నాడు.

అంతా చిరుచలిలో చిన్న చిన్న అడుగు

లతో కాస్త తాపీగా నడుచుకుంటూ, "జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, ఘంటశాల" అని ఠీవిగా కనిపించే బోర్డు దగ్గరికి చేరే టప్పటికి రెండో గంట మోగుతోంది.

పెద్ద క్లాసు పిల్లలు కాస్త పెద్దడుగులు వేసుకుంటూ నడుస్తుంటే, చిన్న తరగతి పిల్లలు పరుగులు పెడుతూ వాళ్ల గదు ల్లోకి వెళ్లి పుస్తకాలు, క్యారియర్లు తెచ్చుకునే వాళ్లు క్యారియర్లు అక్కడ పెట్టుకుని, అసెంబ్లీలో వరసగా నిలబడడానికి హడా విడి పడుతున్నారు.

సుందరం, ప్రసాదు, వాళ్ల బెంచీల దగ్గర పుస్తకాలు పెట్టుకుని, క్యారియర్లు బెంచీకి, గోడకి మధ్య పెట్టుకుని, "రారా సాధు! ఏం చూస్తున్నావ్" అన్నారు.

"ఆగండెహె, ఇక్కడెవుడో పుస్తకాలెట్టుకు న్నాడు"

"ఆడే వొచ్చి తీసుకుంటాడు. తొందర మీద పెట్టేసుంటాడేమో లేరా!" అన్నారు.

ఆ ముగ్గురూ, ఇంకా మరో నలుగురు పరుగు పరుగున వెళ్లి లైన్లో వాళ్ల ఎత్తుల వరసలో నిల్చున్నారు.

అసెంబ్లీలో ఎస్.పి.ఎల్. శాల్యూటు, క్లాసు లీడర్ల శాల్యూటు పూర్తయింది. హెడ్మాస్టరు, "ఎవ్వరూ స్కూలుకి ఆల స్యంగా రావడానికి వీలులేదు. రేపణ్ణుంచి స్కూలు గేట్లు వేయించేస్తాను. ఈ నెలలో ఎవ్వరూ స్కూలు మానడానికి వీలులేదు. నేను ప్రతిరోజూ ఎవరొస్తున్నారో, ఎవరు రావడం లేదో అటెండెన్స్ రిజిష్టర్స్ చూస్తాను. ఈసారి మొవ్వ స్కూల్లో సైన్స్ ఫెయిర్ జరుగుతోంది. మన స్కూలు నుండి కూడా పిల్లలు వెళ్లాలి. మీరూ కొన్ని తయారు చెయ్యాలి..." ఇంకా ఒకటి రెండు విషయాలు చెప్పి, డిస్పర్స్ చెప్పే సారు.

నాగేశ్వరమ్మకి, వెంకటేశ్వరమ్మకి గుండెల్లో రాయి పడింది- హెడ్మాస్టరు మాటలు వినేటప్పటికి.

ఎవరి క్లాసులకి వాళ్లు తిన్నగా లైన్లో బయలుదేరారు. క్లాసు దగ్గరకొచ్చేటప్పటికి లైన్లు చెదిరిపోయి ఎవరికి వాళ్ళే చెదిరి పోయి వాళ్ల బెంచీల్లో చతికిలపడుతు న్నారు.

స్కూలులో ఉన్న డస్కు బెంచీలన్నీ చిన్నపిల్లలయితే నలుగురు, పెద్దవాళ్లయితే ముగ్గురు కూర్చోడానికి వీలున్నవి. సాధు కూర్చునే బెంచీలో సాధుతో కూర్చునే వైకుంఠరావు, ధనుంజయరావు, శివరావుతో పాటు అప్పటివరకూ వెనక బెంచీలో కూర్చునే విశ్వేశ్వరరావు వచ్చి కూర్చు న్నాడు.

"నా చోటేది" అన్నాడు సాధు.

"నీ చోటిక్కడే ఉంది, కూచో" అన్నాడు గీరగా వైకుంఠరావు.

"ఏది నా చోటు?"

"ఇదే" బెత్తెడు చూపించాడు.

"నా చోటులో లేరా నువ్వు" అన్నాడు సాధు.

"మాల్నాకొడకా నన్ను ఏరా అంటావురా నువ్వు" అంటూ వైకుంఠరావు సాధు జుత్తు పట్టుకున్నాడు. సాధు వైకుంఠరావుని ఒక్క తోపు తోసి కూర్చున్నాడు.

వైకుంఠరావు, ధనుంజయరావు, శివ రావు, విశ్వేశ్వరరావు నలుగురూ కలిసి సాధుని తొయ్యడం ప్రారంభించారు. సాధు కాళ్లు గోడకి తన్నిపెట్టి కూర్చు న్నాడు.

వైకుంఠరావు, "నన్ను కొడతావురా మాల నాకొడక" అని మళ్లీ కొట్టాడు. సాధు కూడా కలబడ్డాడు వైకుంఠరావుతో. పిల్ల లందరూ వీళ్ల చుట్టూ చేరి చూస్తున్నారు. మాగంటి అంకినీడు మాస్టారు వచ్చీ రావ డమే బెత్తం పట్టుకుని ముందు తలా ఒకటి తగిలించాడు.

"మేష్టారు, ఈడు నన్ను కొట్టాడండే"

అన్నాడు వైకుంఠరావు.

సాధు నోరు తెరవబోయేంతలోనే అంకినీడు మాష్టారు సాధుని చితక్కొట్టడం ప్రారంభించారు. పిల్లలందరూ అలా నిశ్చేష్టులై చూస్తున్నారు.

"పొగర్రా, ఒళ్లు బలిసిపోయింది మీకు, ఎక్కడుండేవాడు అక్కడుండాలి రా!" అంటూ వెనకా ముందూ చూడకుండా కొడుతున్నారు.

అంకినీడు మాష్టారుకి హరిజనుల పిల్లల మీద ప్రత్యేకమైన మంట. ఆయన 'బి' సెక్షన్ వాళ్లకి ఇంగ్లీషు చెబుతాడు. 'పేడ కళ్లు ఎత్తాల్సిన వాళ్లకి స్పెల్లింగులు ఎట్టా వస్తాయిరా' అనో, 'నీకు అక్షరాలు రావు గానీ గేదెల్ని మొల్లెయ్యడానికెల్లరా' అనో, 'పాలికట్టుచ్చుకోవల్సిన చేతులు పెన్ను పట్టుకుంటే రాత ఇట్టాగే తగలడ్డది' అనో ఏదో ఒక పుల్ల విరుపు మాట అంటూనే ఉంటాడు. ఏసుదాసునీ వదలడు. 'నడిపించు నా నావ అని పాస్టరుగా వెళ్లిపోక ఎందుకురా నన్ను చంపుతావు' అని వెటకారపు మాట మాట్లాడుతూనే ఉంటాడు.

ఆయనంటే పిల్లలందరికీ భయం. మాల పిల్లలకి, మాదిగ పిల్లలకి మరీ భయం. ఈ రోజు ఆయన సాధుని విచక్షణారహితంగా కొడుతున్నారు. 'వద్దండే మాష్టారో' అని గావుకేక పెట్టాడు. బెత్తం దెబ్బకి కణతలమీద, బుగ్గ మీద రక్తం చెమర్చడం ప్రారంభించింది.

ఈ కేకకి అటుగా



రౌండ్సుకి వస్తున్న హెడ్మాష్టరు గబగబా ఈ రూమ్‌కి వచ్చారు. దెబ్బ తగిలిన చోట చెయ్యి పట్టుకుని ఏడుస్తున్నాడు సాధు.

"ఈ వెధవ, పక్కన కూర్చున్న వాళ్లని కొడుతున్నాడండీ" అన్నాడు అంకినీడు బెత్తాన్ని టేబుల్ మీద వేస్తూ.

నిలబడ్డ పిల్లలందర్నీ 'కూర్చోండి' అన్నారు హెడ్మాష్టరు. పిల్లలందరూ కూర్చున్నారు. అంకినీడు మాష్టారు నిల బడే ఉన్నాడు. సాధు ఏడుస్తూనే కూర్చు న్నవాడు వెంటనే లేచి నిలబడ్డాడు. చేతులు కట్టుకుని హెడ్మాష్టరు వైపు నడి చాడు. పిల్లలంతా ఆశ్చర్యంగా చూస్తు న్నారు. ప్రసాదు సాధు ధైర్యాన్ని చూస్తు న్నాడు.

"నేను కొట్టలేదండీ, నా చోటులో కూర్చొని వైకుంఠరావే నన్ను కొట్టాడండీ" అన్నాడు ఏడుపుగొంతుతో.

"వెధవ అబద్ధాలాడతావ్" అన్నాడు అంకినీడు మాష్టారు.

"అంకినీడుగారు మీరూరుకోండి" అని సాధువైపు చూసి "ఒరే నువ్వు నా గదికి పదరా" అన్నారు.

సాధు చెంపమీద చెమరుస్తున్న రక్తం హెడ్మాష్టరుకి కనిపిస్తోంది.



"ఎవర్రా వైకుంఠరావు" అన్నారు.

వైకుంఠరావు లేచి నిలబడ్డాడు. వెనక బెంచీవాళ్ళని అడిగారు "ఏం జరిగిందిరా" అని.

"సాధు చోటు ఇదేనండీ. విశ్వేశ్వరరావు కొత్తగా ఈ బెంచిలోకి వచ్చి కూచున్నాడు. విశ్వేశ్వరావు బెంచి వెనకండీ. ఇవాళ ఇక్కడ కుచ్చున్నాడండీ. సాధు లెగిసి పొమ్మంటె ముందు వైకుంఠరావే కొట్టా డండీ".

"అంకినీడుగారు మీరు పాఠం కానీ యండి" అని తన గదివైపు కదిలారు హెడ్మాష్టరు. కాసేపటి తరువాత సాధుని ప్యూను రామయ్య సైకిలెక్కించుకుని బయ టకు తీసుకువెళ్ళడం పిల్లలు చూసారు.

సాధు వెళ్ళాక, అంకినీడు మాష్టారిని హెడ్మాష్టరు రూమ్‌కి రమ్మని అటెండరు వెంకటస్వామి కబురు తెచ్చాడు.

★ ★ ★

పిల్లలంతా తిరుగుముఖం పట్టారు 'పాటిపూడి' వైపుకి. ఆ క్లాసు పిల్లందరికీ సాధుమీద సానుభూతి ఉంది.

"వైకుంఠంగాడికి చాలా గీరరా. తన్నాలొ కసారి నా కొడుకుని. ఆళ్ళన్నయ్యలిద్దరు స్కూల్లో ఉండారని ఆడికి పొగరు" అన్నాడు రాసంసెట్టి నాగేశ్వరరావు.

"పోయిన నెల్లో నన్ను తోసాడ్రా మంగ ల్నాకొడకా అని" అన్నాడు శివకృష్ణ.

వాడిగురించి తలా ఓ మాట మాట్లా డారు. ఆడపిల్లలు వీళ్ళ మాటలు వింటూ వాళ్ళల్లో వాళ్ళు మాట్లాడుకుంటూ కలిసి వస్తున్నారు. సహజంగా ఆడపిల్లలు ఇద్దరు ముగ్గురు జట్టుగా ఎవరి మానాన వాళ్ళు నడవడమే గాని ఒకే క్లాసువాళ్ళు కలిసి రావడం ఉండదు. ఈరోజు కేసు హెడ్మా ష్టరు దగ్గరకు వెళ్ళడంతో అంతా కలిసి వస్తున్నారు.

ఊరువాళ్ళు ఊరివైపు తిరిగాక మాలపల్లిబాట పట్టారు మిగిలిన పిల్లలు. అప్పుడడిగాడు ప్రసాదు సాధుని, "హెడ్మాస్టారు దగ్గరికి అట్టా యెళ్ళి చెప్పేశావ్! బయమెయ్యలేదంట్రా!" అని.

"అంకినీడు మాష్టారు ఊరికే కొట్టాడురా నన్ను! ఉండ్లేపోయాను. చెప్పేయాలనిపించింది. మళ్ళీ నామీదే చెపుతున్నాడు" అన్నాడు సాధు.

హెడ్మాష్టరు మళ్ళీ ఆయన గదిలో ఏమడిగారో, ఏం జరిగిందో చెప్పమన్నారు అందరూ.

"చోటుకోసం గొడవని చెప్పాను, నన్ను మాల లంజాకొడుకా అని తిట్టాడని చెప్పాను, అంకినీడు మాష్టారు నేను చెప్పేది వినకుండా కొట్టారని చెప్పాను" అంటూ కళ్ళవెంట నీళ్ల పెట్టుకున్నాడు సాధు.

"మా క్లాసులోనూ అనుకున్నారు. నువ్వు అట్టా చెప్పడమే మంచిది" అంది నాగేశ్వరమ్మ.

"అమ్మో! బయమెయ్యదూ. నేనైతే చెప్పలేను" అన్నాడు సుందరం.

సాధు భుజం మీద చెయ్యివేసాడు ప్రసాదు. భుజంమీద చెయ్యివేసి సాధుని ఆనుకుని నడుస్తున్నాడు.




**సూ**ర్యుడు తాను కనిపించక పోయినా తన వెలుగుని రేఖలు రేఖలుగా కాకుండా సమానంగా పంచుతున్నాడు. పొద్దు కుంకిందిగానీ వెలుగు తగ్గలేదు. పొలాల్లో ఉండేవాళ్ళంతా ఇంటిముఖం పట్టేశారు. శ్రీరామనవమి దాటిపోయింది. చేలల్లో కూడా చిన్నా చితకా గట్టుపనులే మినహా పెద్దపనులేమీ లేవు. సాయంత్రం వరకూ గేదెల్ని డొంకలంట, చేలవెంట, గట్లవెంట మేపిన ఆడ, మగ కూడా చాలామంది ఇంటికి చేరుకున్నారు. పొలాల నుండి ఇంటిబాట పట్టారు.

నెత్తిమీద జనపమోళ్ళు, చెరుకుమోళ్ళు ఎత్తుగా పేర్చిన గంపతో పొడుగ్గా ఉన్న బరువును బ్యాలన్సు చేసుకుంటూ వస్తున్న వెంకమ్మ పక్కకి తొలగి నిలబడింది. కర్ర భుజం మీద పెట్టుకుని మాలపల్లిలో మాంచి ఠీవిగా నడుస్తున్న రంగడు ఒక్కసారిగా కర్రచేత్తో పట్టుకుని తలగుడ్డ దులిపి నడుముకి కట్టుకుని దారికి ప్రక్కగా నిలబడ్డాడు. చెంబులు పట్టుకువెళుతున్న ఆడవాళ్ళు మరీ వారకి వొదిగిపోయి నిలబడ్డారు. రావిచెట్టు క్రింద చేరిన ముసలీ ముతకా గబగబా లేచి నిలబడ్డారు. రెండు లొట్టులు ఒకప్రక్క, పెద్దకాగు మరోప్రక్క కావడిలో పెట్టుకుని మంచి విసురుమీద వస్తున్న రాముడు ఒక్కసారి ఆగిపోయి ప్రక్కకి తప్పుకుని నిలుచుని తరువాత కదిలాడు. పొయ్యి రాజేస్తున్న పద్మావతి ఊదురుబొంగుతో పొయ్యి ఊదుతోంది. తనపని ఆపేసి లేచి నిలబడింది. పరుగులెత్తుకుంటూ ఆడుకుంటున్న పిల్లలు ఒక్కసారిగా చప్పబడ్డారు. పగలంతా అలిసి సాయంత్రం కాస్త చల్లగాలికి నులక మంచాల మీద చేరినవాళ్ళు గబగబా మంచాల మీద నుంచి లేచి నిలుచోడమే కాదు ఆ మంచాలు కూడా ఎత్తి పెట్టేసారు. కనకయ్య కుట్టిన కొత్తచెప్పులేసుకుని బయటకు బయలుదేరిన సుబ్బాడు, గబగబ చెప్పులు తీసి చేత్తో పట్టుకు

న్నాడు. పొలం నుంచి అప్పుడే వచ్చి వాకిలి తుడుస్తున్న లచ్చమ్మ తుడవడం ఆపేసింది. గంగాధరరావు, శివరావు మాలపల్లి దాటి వెళ్ళిపోయారు. వాళ్ళతో పాటు ఇద్దరు పాలేళ్ళు మరో ఇద్దరు కమ్మ దొరలూ కూడా ఉన్నారు.

"ఏరోరబ్బాయా సంసార్లొత్తన్నారంటే సూసుకోవొద్దా! మీపాటికి మీరట్టా కూకు న్నారు. ఆరుసూత్తే ఏమయ్యేదంటావ్" అంది అక్కడున్న ముసలమ్మ.

ప్రసాదు వాళ్ళ అరుగు దగ్గర కూర్చొని లెక్కలు చేసుకుంటున్నారు సుందరం, సాధు, ప్రసాదు. ఏడోతరగతి పబ్లిక్ పరీక్షలు జరుగుతున్నాయి. రేపే లెక్కల పరీక్ష.

"నీ యమ్మ నీ కంగారు గానీ మేమిటు పక్కగా కూచున్నాం. ఆరికెక్కడ కనపడ తాంలేయే" అన్నాడు సుందరం.

"ఏమే ముసల్దానా, నేనట్టాగే కూచుంటా, లెగను. ఏమంవ్వదే?" అన్నాడు సాధు.

"ఒరే సాధుగా, నీయన్నీ శతుకుతం మాటల్రా, దొరోరొత్తే లెగొద్దంట్రా! పిల్లెద వలు మీకేం తెలుత్తది?" అంది.

"సూళ్ళేదు లెగె పెద్దమ్మా, మేం లెక్కలు సేసుకుంటంన్నాంగా!" అన్నాడు ప్రసాదు.

"అదేనయ్యా నేననేది, పెద్దకులపోళ్ళు వత్తన్నారు సూసుకోవద్దంట్రా!"

"ఓసి నీయమ్మ నీ సోదాపే, మమ్మల్ని లెక్కలు చేసుకోనీ" అన్నాడు సాధు.

ముగ్గురూ వాళ్ళ పనిలో వాళ్ళు పడిపో యారు. శివరావు వీళ్ళని గమనించలేదు గానీ మిగిలిన ముగ్గురు కమ్మదొరలు వీళ్ళని గమనించారు. మెదలకుండా వెళ్ళి పోయారు. దాని గురించి వాళ్ళేమీ ముద లకించుకోలేదుగానీ మనసుల్లో ఉంచుకు న్నారు.

★ ★ ★

ఏడోతరగతి పరీక్షలయిపోయాయి. పాటిపూడి మాలపల్లి నుండి చేరిన పిల్లలం దరూ పరీక్షలైపోగానే ఘంటశాల టూరింగ్ టాకీసులో 'పూలరంగడు' పాత సినిమా వస్తే దానికెళ్ళిపోయారు. 'అడవి రాముడు' అదరగొట్టేస్తోందని విన్నారు గానీ అది చల్లపల్లిలో ఆడుతోందట!

అప్పటికే జనతా ప్రభుత్వం పరిపాలనకి వచ్చింది. ఇందిరమ్మ ఓడిపోయినప్పుడు మాలపల్లి మాలపల్లంతా బాధపడింది- కమ్యూనిస్టుపార్టీ అభిమానులైన చింతయ్య, శ్రీరాములు, సొంగడు మినహా.

వీళ్ళల్లో చింతయ్య కాస్త రాజకీయాలు తెలిసినవాడు. అయితే ఇందిరమ్మ హరిజ నులకి భూమి పంచింది, ఇళ్ళస్థలాలిచ్చింది, గేదెల్ని, రిక్షాల్ని ఇచ్చింది. ఈ మాలపల్లి వాళ్ళలో మొగుడు చచ్చిపోయిన చుక్క మ్మకి, కుంటి కన్నకి గేదెలొచ్చాయి. ఇవి తప్ప ఈ ఊరికి ఇంకేమీ రాకపోయినా చుట్టుపక్కల ఊర్లలో చాలా మందికి ఇచ్చారు. ఈ మాలపల్లిలో ఉన్న మాల మాదిగ జనానికంతటికీ పెద్దోళ్ళని గొట్టి పేదోళ్ళకి పెట్టేది ఇందిరమ్మని గట్టిన మ్మకం. ఈ మాటలన్నీ అడుగుతుంటే చింతయ్య, శ్రీరాములు నీళ్ళు నమిలేవాళ్లు మినహా, సరైన సమాధానం లేదు.

కమ్యూనిస్టు పార్టీ సుందరయ్యగారు, బాపనయ్యగారు, బుచ్చికోటయ్యగారు, మోటూరి హనుమంతరావు గారు, పుట్ట గుంట సుబ్బారావుగారు అంటూ వాళ్ల గొప్పతనం, ఎర్రకోట మీద ఎర్రజెండా ఎగ రడం మినహా వీళ్ళకి తెలిసింది తక్కువ. ముప్పై ఏళ్ళుగా వాళ్ళు కమ్యూనిస్టు పార్టీ అభిమానులు.

వీళ్ళ దొరోర్లు కమ్యూనిస్టు పార్టీ వాళ్ళు. చింతయ్య వాళ్ళ దొర వెంకటేశ్వరరావు తమ్ముడు, 'కామ్రేడ్' భాస్కరరావు మల బారీ పోలీసు యాక్షన్‌లో చచ్చిపోయాడు.

వెంకటేశ్వరరావు దగ్గర చింతయ్యా చాలా కాలం పాలేరుతనం చేసి, ఓపిక తగ్గాకనే, వెంకటేశ్వరరావు "ఒరే చింతా... నీ వల్ల కాదులేరా ఇక ఆగిపొమ్మన్న"దాక పనిచేసాడు.

చిన్నాచితకా పనులు చెయ్యడం, ఏవైనా తోటల దగ్గర కాపలా ఉండడం, ఇంటి దగ్గరున్న కాస్త నేలలో వంగనారో, టమాటా నారో వేసి, దాన్ని సంతకెళ్లి అమ్ముకోవడం ఇలా కాలం వెళ్ళదీస్తున్నాడు చింతయ్య. రాజకీయ చర్చలు, రాజకీయ వివాదాలు రావిచెట్టు కింద నడుపుతుండడం చింతయ్యకి అలవాటు.

వడగాడ్పు ఇంకా వస్తూనే ఉంది. బాగా పొద్దుగుంకి పోయింది. చీకటి చల్లదనం వచ్చినప్పటికీ వడగాడ్పు దాని ప్రతాపం అది చూపిస్తూనే ఉంది. ఊళ్ళోనుంచి వస్తున్నవాళ్ళు ఒకరు అరా చింతయ్య దగ్గర ఆగుతున్నారు. తిరుపతిరావు కొంచెం మందు పుచ్చుకుని వస్తూ రావి చెట్టు దగ్గర ఆగాడు. చింతయ్య పెద్దవేరుకి నడుం ఆనించి కూర్చున్నాడు. ముసలివాళ్ళు ఇద్దరు ముగ్గురు, ఇంటికి అన్నానికి తప్ప వెళ్ళవలసిన పనిలేని వాళ్ళు తుండుగుడ్డ పరుచుకుని ఆ చెట్టుకిందే పడుకున్నారు. అంతా ఒక పదిమంది వరకూ ఉన్నారు- లోకాభిరామాయణం మాట్లాడుతూ.

రావిచెట్టు దగ్గర చింతయ్యని చూసి ఆగాడు తిరుపతిరావు.

"ఏరా చింతా! మన మాలపల్లికి కరంటు వత్తదంటావా ఉప్పుడన్నా?" అన్నాడు.

"ఇన్నేళ్లూ నీ ఇందిరమ్మే గదంట్రా, ఎందుకెయ్యించలేదు? ముందది జెప్పు?" అన్నాడు చింతయ్య.

"నేనడుగుతుందేంటి, నువు మాట్టాడుతుందేంటి? నీ పార్టీవోళ్ళేగా వచ్చిందిప్పుడు. మన మాలపల్లికి కరంటు వత్తదా!"

"ఇది మా పార్టీ కాదు. ఎర్రకోట మీద ఎర్రజెండా ఎగురుద్ది చూడు, అప్పుడడుగు చెపుతా. అయినా జనతాపార్టీ వచ్చాక బియ్యంధర తగ్గలా? నూని ధర తగ్గలా? పంచదారధర తగ్గలా? చేత్తా రొక్కొక్కటే"

తుండుగుడ్డ పరుచుకుని పడుక్కున్న నాగడు, "పంచదార తగ్గిందా, ఎన్నీశలు కొంటన్నావేంటి నువ్వు? పంచదార ధర తగ్గిందంట, ఈడేదో కొని నోట్లో పోసుకుంటన్నట్టు!" అన్నాడు.

"అరే నేనడిగేదేంటి, మీరు మాట్టాడతందేంట్రా? ఊళ్ళోకి కరెంటొచ్చి పదేళ్ళయిపోలా, మాలపల్లికి అసలు మన కొత్తదా, రాదా! అదీ నేనడిగేది" అన్నాడు తిరుపతి.

"మనకి కరంటు రావాలంటే ఊళ్ళోనుంచే లాగాలా! మాలపల్లి దాకా రావాలంటే ఎన్ని తంబాలడతయ్యో తెలుసా నీకు? శానా కష్టంరా బాబూ కూస్తదూరమా కాస్తదూరమా! ఊరుకంటే... పక్కనే సిలకలపూడిదాక కరంటొచ్చింది గాబట్టి లాగారు. లాపోతే దానికి లాగోళ్ళేంటి?" అన్నాడు ఓ తలగుడ్డ.

"ఓర్నీయమ్మ, నువ్విట్టామాట్టాడుతున్నావ్గానీ, మొన్న మా యత్తోరూవెళ్లిన, ఆ ఊరికి ఎంత దూరమనుకుంటన్నవ్. మూడు మైళ్ళుంటది. అక్కడికి కరంటు లాగార్రా! మన దయిద్రం! అడిగే వోడెవుడు, సచ్చేవోడెవుడు?" అన్నాడు మరో తలగుడ్డ.

ఆనందరావు మాష్టారు, ఏడో తరగతి రిజల్ట్సు తెలుసుకుని వస్తానని ఘంటశాల వెళ్లారు. ఇంకా రాలేదని ప్రసాదు, సాధు, సుందరం ఆ రావిచెట్టు దగ్గరే తచ్చాడుతున్నారు వీళ్ళ మాటలు వింటూ.

'అవును, మనూరికి కరంటెందుకు రాదు' అనుకున్నారు ముగ్గురూ మనసులో.

దూరంగా వస్తున్న మనిషిని చూసి ఒక్కసారిగా వీళ్ళ మాటలు పలచబ

డ్డాయి. చెప్పులమోత వినిపిస్తూ, నిండైన విగ్రహం. పంచెకట్టుకుని, మోచేతుల వరకూ ఉన్న చొక్కా తొడుక్కుని టర్కీట వలు భుజాన వేసుకుని పెద్ద పెద్ద అడుగులేసుకుంటూ వీళ్ళని దాటి వెళ్ళిపోయాడు గంగాధరరావు.

గంగాధరరావు, పాపయ్య పెళ్ళాం సుబ్బమ్మకి ఇలాకా పడ్డాడు. వారంలో ఒకటి రెండు సార్లు వచ్చి రాత్రికి ఇక్కడే ఉండి వెళతాడు. గంగాధరరావు వచ్చిన రెండురోజులు పాపయ్య పొలం వెళ్లిపోవడమో గొడ్లసావిట్లోకి చేరడమో చేస్తాడు. ఈ విషయమై సూటిపోటి మాటలో, పుల్లవిరుపు మాటలో విన్నప్పుడు పెళ్ళాన్ని నాలుగు తిడతాడు ఏదో ఓ వంకపెట్టి. మొదట్లో కొట్టేవాడు కానీ ఇప్పుడు కొట్టడానికి ధైర్యం తగ్గిపోయింది.

సుబ్బమ్మకి ఇప్పుడు రెండెకరాల పొలముంది. ఆ మాలమాదిగ కుటుంబాల్లో ఇంటి ముందు వడ్లపుర్రివున్న ఒకే ఒక్క రైతు సుబ్బమ్మ. ఆ రెండెకరాల పొలమూ సుబ్బమ్మ పేరు మీదే ఉంది.

ఆ మాలపల్లి మొత్తంలో ఇటుకరాతి కట్టడాలు రెండే రెండు. ఒకటి రాములోరి గుడి. రెండోది సుబ్బమ్మ ఇల్లు. సుబ్బమ్మ ఇంటికి నాపరాయి కూడా ఉంది. రాములోరి గుడికి కూడా నాపరాయి వెయ్యిద్దామని చాలాసార్లే తీర్మానాలు గుడిముందు రావిచెట్టు ముందు జరిగాయి గానీ పని మాత్రం ముందుకు కదలలేదు.

సుబ్బమ్మకి ఒక ఆరు గేదెలు కూడా ఉన్నాయి. పాపయ్యే గేదెలపని, పాలపని చూస్తాడు. సుబ్బమ్మ ఇంటిపని చూస్తుంది. సుబ్బమ్మ చూపు, నడక, మాట 'నేను మీకంటే గొప్పదాన్నన్నట్లుగా ఉంటుంది. అవసరానికి ఒకమాట, అరమాట మినహా మిగిలినవాళ్ళతో అంతగా మాట్లాడదు. ఈ అలగాముండలతో సుబ్బమ్మకి అంత పట్టదు కూడాను.

రావిచెట్టు కింద ఉన్న మగాళ్ళందరికీ మనసులో కలచివేస్తోంది. బాధలకు, మానసిక గాయాలకు, నీచపు మాటలకు అలవాటుపడ్డ జీవితాలు. అయినా మనుషులు కదా ఎక్కడో ఆత్మాభిమానం కెలుకుతూనే ఉంటుంది. తమ చేతకానితనాన్ని నిలదీస్తూనే ఉంటుంది.

అంతా ఊరికి కరంటు వస్తుందో రాదో ఆలోచించడం మానేసారు. ఎవరికి వాళ్ళే పని ఉన్నట్లుగా ఎవరి తుండుగుడ్డ వాళ్ళు భుజాన వేసుకుని ఒక్కొక్కరుగా ఇంటి ముఖం పట్టారు.

ప్రసాదు వాళ్ళ పెదనాన్న పెళ్ళామే సుబ్బమ్మ. రావిచెట్టు కింద పెద్దవాళ్ళు కదిలిపోతుంటే ఈ పిల్లలు ముగ్గురూ ఎవరి ఇంటిదారి వాళ్ళు పట్టారు.

★ ★ ★

ఇంకొక్క వారం రోజుల్లో స్కూళ్ళు తెరుస్తారనగా మాలపల్లి స్కూలుకి ఆనందరావు మారిపోయి, కొత్త మాష్టారు వస్తున్నట్లుగా కబురొచ్చింది. పిల్లలకి నాలుగక్షరాలు చెప్పడమే కాదు మంచికి, చెడ్డకి పెద్దదిక్కుగా వీళ్ళతో కలిసి ఇక్కడ ఉన్నాడు ఆనందరావు మాష్టారు. తొలిసారిగా ఈ ఊరినుండి పిల్లల్ని హైస్కూలుకి ఆయనే పంపాడు. ఆయన ఆదివారం చర్చి నడపడం కంటే పిల్లలకి పాఠాలు చెప్పడానికే ఎక్కువ ఆసక్తి చూపించాడు. ఆ మాష్టారు ఊరు విడిచి వెళ్ళిపోతున్నారంటే ఊరు ఊరంతా "అయ్యో" అనుకుంది. ఆనందరావు స్థానంలో ఆ స్కూలుకి ఇద్దరు భార్యాభర్తలు టీచర్లుగా వస్తున్నారు. మాలపల్లి నుండి ఎనిమిదవ తరగతికి వెళ్ళే పిల్లల్లో ఏసుదాసు తగ్గిపోయాడు.

★ ★ ★

సాధు కొత్త బట్టలు కుట్టించుకున్నాడు. ప్రసాదుకి ఈసారి మూడు జతల కొత్తబట్టలు ఉన్నాయి. సాధు, ప్రసాదు, వెంకటేశ్వరమ్మ స్కూలుకి బయలుదేరారు. అప్పటికే సెకెండ్‌హాండ్ టెక్స్ట్ పుస్తకాలు సంపాదించారు.

ఈ సంవత్సరం నుండి వాళ్ళు హయ్యర్ క్లాసులకి వెళుతున్నారు. ఈ మాలపల్లి నుండి హైస్కూల్లో చేరే వారందరికీ పెద్దన్నలూ, మార్గదర్శకులూను. ఇప్పటివరకూ వచ్చే మాష్టార్లు కాకుండా వేరే మాష్టార్లు వస్తారు. ఇప్పటివరకూ కూర్చున్న రేకుల షెడ్డులో కాకుండా, లోపలున్న పక్కా భవనంలో కూర్చుంటారు. మంచి ఉత్సాహంగా ఉంది వీళ్ళకి.

కొత్తగా చేరిన పిల్లలు వీళ్ళ వెనక హుషారుగా నడుస్తున్నారు. ఇంతమంది పుస్తకాలు పట్టుకుని బడికి బయలుదేరుతుంటే మాలపల్లి కళకళలాడుతోంది. సాధు వాళ్ళకి చాలా జాగ్రత్తలు చెబుతున్నాడు. కరెంటు స్తంభం దాటి పమిడేశ్వరరావు వీధి అరుగు మీద కూర్చున్న వాళ్ళని చూడగానే ఈ పిల్లలందరూ మాటలు ఆపేసారు.

"శానామంది చేరార్రా ఈ లంజాకొడుకులు" అన్నాడు అక్కడే ఉన్న సాంబయ్య.

"తెలిమి మీరిపోతున్నారు లంజాకొడుకులు! మొన్న వెంకన్నగాడ్ని మీ బుడ్డోణ్ణి గేదెలకాడెట్టరా అంటే ఏమన్నాడో తెలుసా లంజకొడుకు? మేమెట్టాగో పేడ పిసుకుతున్నం, ఆణ్ణన్న సదివిద్దామనండే" అన్నాడు పక్కనున్న సుబ్రహ్మణ్యేశ్వరావుతో.

"చదువొస్తదీ ఈ నా కొడుకులకి? ! నోరు తిరుగదు, ఈ లంజాకొడుకులకి సదువేంట్రా అసలు? " అన్నాడు సుబ్రహ్మణ్యేశ్వరావు.

"ఒరే నువ్విట్రారా" అన్నాడు సాంబయ్య, ఏడో తరగతిలోకి వెళ్ళబోయే బోడోణ్ణి పిలిచి.

"ఎంటండీ" ఒకచేత్తో పుస్తకాలు, మరో చేత్తో క్యారియరు పట్టుకుని దగ్గరకొచ్చి నిలబడ్డాడు బోడోడు.

"ఏంట్రా ఇట్టాగేనా నిలబడేది? చేతులు కట్టుకో!"

పుస్తకాల చెయ్యి అట్లాగే ఉంచి, క్యారి యరు చెయ్యి అడ్డంగా కట్టుకున్నాడు.

"ఎవుడి కొడుకివిరా? "

"రాముడి కొడుకునండే"

"రాముడంటే? తాతబ్బాయి దగ్గర పాలే రుతనం చేస్తాడూ, వాడేనా? "

తలూపాడు బోడోడు.

"ఎందుకురా ఆడితో మాటలు,పోనియ్" అన్నాడు పక్కనున్నవాడు.

వెళ్ళాలో అక్కరలేదో తెలియక అక్కడే నిలబడ్డాడు బోడోడు. వీళ్ళకి కాస్త దూరంగా వీడితో కలిసి బయలుదేరిన పిల్లలంతా నిలబడి ఉన్నారు, పిలిచిన సాంబయ్య అనుమతి కోసం చూస్తూ. పాటిపూడి మాల మాదిగ పిల్లలు అక్కడే నిలబడిపోతే, పాటిపూడి ఊరుపిల్లలు ఎవరి మానాన వాళ్ళు దర్జాగా స్కూలుకి వెళ్ళిపోతున్నారు.

ఈలోపు అక్కడికొచ్చాడు విశ్వనాథశర్మ సైకిలు మీద.

"ఏం పంతులో నాలుగురోజులుగా కన బడ్డంలేదు" అన్నాడు సాంబయ్య.

"పనుండి విజయవాడ వెళ్ళాను" అన్నాడు శర్మ.

"తెలివైనోడివిలే, ఎక్కడో ఒకచోట కోస్తా కొడతావ్? ఏంటంట పని? "

"మా బావగారున్నారు కదా ఆయన దగ్గరికి. విజయవాడ ఏం మారిపోయింద నుకుంటున్నావ్! లీలామహల్లో చూడాల య్యా సినిమా చూస్తే. కళ్ళు తిరిగిపోతా యనుకో. సాయంత్రమైతే కదలడానికి చోటుందీ? ఏమి రద్దీ! సైకిళ్ళు, కార్లు, రిక్షాలు, అమ్మో...." మాటల ప్రవాహం సాగిపోతోంది.

## కొత్తగాలి...

వెండితెర
బుల్లితెర
వెరసి
నా కంటికిపొర

-శైలూషి, అరసవిల్లి

"ఒరే బోడిగా నువ్వు రారా! ఆలిసమైపో తుంది" అన్నాడు సాధు.

"ఏరో, ఇక్కడ మేం మాట్లాడటంలా, కళ్ళు కనబడ్డంలా లంజకొడక! ఈ నాకొ డుకు ఆలిస్సం అయిపోతే అక్కడ కొంప లంటుకు పోతాయిరా? " అన్నాడు సాంబయ్య.

"పనేదన్నా ఉంటే చెప్పండే, ఊరికే ఎందుకట్టా నిలబెడతారు, మాకు ఆలిస్సం అయితే మేష్టార్లు లోపలికి రానియ్యరండే" అన్నాడు సాధు.

ఆ మాటలో కారణం కన్నా తలబిరుసే కనబడింది సాంబయ్యకి. "నువ్విటు రారా లంజాకొడకా" అన్నాడు సాధుని.

"పిల్లలతో ఏమిటి పోనియ్యండ్రా" అన్నాడు అక్కడే నిన్నటి పేపర్ చూస్తూ కూర్చున్న శివరావు. అందరూ పోనియ్యం డనడంతో, పిల్లలు ఘంటశాలవైపు కదిలి పోయారు.

★ ★ ★

డిసెంబరు నెల చలి. ఇంక తొందరలో ఆఫ్ ఇయర్లీ పరీక్షలు వస్తున్నాయి. ఉపా ధ్యాయులంతా, సిలబస్‌లు పూర్తిచేసే తొందరలో ఉన్నారు. పిల్లలు పరీక్షలు, సంక్రాంతి సెలవులు వాటి లెక్కల్లో ఉన్నారు. చదువులు, సిలబస్సులు ఒక వైపు. ఇదే సమయంలో కాస్త కూస్త

పొలం ఉన్న విద్యార్థులు నూర్పులకని, మరో పనికని మధ్యలో ఒకటి రెండు రోజులు బడి మానక తప్పడంలేదు. తొమ్మిది, పది తరగతులు చదివే హరిజనుల పిల్లల్లో చాలామంది బడులకు రావడం లేదు. పనులు దొరికే కాలం! చన్నీళ్లకి వేడినీళ్ళు!

సాధు అంతకుముందు వారం రోజులు బడి మానేసాడు. ప్రసాదు ఈ నెలలో అప్పుడొకరోజు, అప్పుడు రెండురోజులు అలా ఒక వారం బడి మానేసాడు. వెంకటేశ్వరమ్మ ఇంకాస్త ఎక్కువ రోజులే మానేసింది. ఆఫ్ ఇయర్లీ పరీక్షలు, ఎగ్జామినేషన్ టైంటేబుల్ తెలుసుకోడానికి వీలుగా ఉంటుందని ఈ రోజు పిల్లలంతా వచ్చారు.

అప్పటికే మొదటి పిరియడ్ అయిపోయింది. రెండో పిరియడ్ మొదలైంది. హెడ్మాష్టరు రూము నుండి సాధుకి కబురొచ్చింది.

సాధు లేచి నిలబడ్డాడు.

"వెళ్లరా! ఎందుకో పిలిచారు నిన్ను" అన్నారు క్లాసులో ఉన్న తెలుగు మాష్టారు.

వెంకటస్వామి వెంట వెళ్ళాడు సాధు. తనేం తప్పు చెయ్యలేదు. ఏం జరిగిందో, ఎందుకు పిలిచారో పాలుపోలేదు సాధుకి. వెంకటస్వామిని అడిగాడు.

వెంకటస్వామికి కారణం తెలుసు. కానీ, "బెల్లుకొట్టి వస్తున్నాను, నిన్ను తీసుకురమ్మన్నారు" అన్నాడు.

సాధు హెడ్మాష్టరు గది ముందు నిలబడ్డాడు. అక్కడ వెంకటేశ్వరమ్మ వాళ్ళ నాన్న కోటి నిలబడి ఉన్నాడు. కోటి ముఖం దిగులుగా ఉంది. 'వెంకటేశ్వరమ్మకి ఏమైనా అయిందా' అనుకున్నాడు సాధు.

హెడ్మాష్టరు చూసి, "నువ్వేనా సాధు" అన్నారు. హెడ్మాష్టరు నిలబడి ఉన్నారు. చేతులు కట్టుకుని నిలబడ్డాడు సాధు. హెడ్మాష్టరు సాధుని గుర్తు పట్టారు. బ్యాడ్మింటన్ బాలు సీతారామయ్య మాష్టరు గట్టిగా కొడితే, అది రెండో అంతస్థుపైన పడింది. బిల్డింగ్ పైకి ఎక్కడానికి మెట్లు లేవు. 'ఎవరెక్కుతారు' అని చూస్తున్నప్పుడు, ఎవరూ చెప్పకుండానే పైకి ఎక్కేసి బంతి కింద పడేసాడు సాధు. వాడైతే అనాయాసంగా తిరిగి వచ్చాడు గానీ, వాడు దిగి వచ్చేంతవరకూ హెడ్మాష్టరుకి కంగారుగానే ఉంది- ఎక్కడ కాలుజారి పడతాడోనని.

అలా సాధు గుర్తున్నాడు ఆయనకి. ఎలా చదువుతాడని క్లాసు టీచర్లని వాకబు కూడా చేసాడు. వాళ్లు ఫరవాలేదు, పాసైపోతాడు అని చెప్పారు.

హెడ్మాష్టరుకి వాణ్ణి చూస్తే జాలేసింది. సాధుని దగ్గరకి తీసుకుని తల మీద చెయ్యి వేసాడు.

"మీరెంతమంది రా" అని అడిగాడు.

"ముగ్గురమండీ! నేనే పెద్దోణ్ణి. నా తరవాత చెల్లెండి, తమ్ముడండి. మా చెల్లి నాలుగో తరగతండీ, మా తమ్ముడు రెండండి"

"ఇంటి దగ్గర నీకు అర్జంటుగా ఏదో పనుందంట! మీ ఊరేగా, అతను తీసికెళతాడు, వెళ్ళు" అని, "మీ ఊరివాళ్ళు ఇంకెవరున్నారు నీ క్లాసులో? " అన్నాడాయన.

"మా సెక్షనేనండీ ప్రసాదున్నాడు"

"నీ పుస్తకాలు వాడు తీసుకొస్తాడు. నువ్వెళ్ళు." అని,

"నువ్వు తీసికెళ్ళవయ్యా" అని కోటితో చెప్పి పంపించాడు. ప్రసాదుకోసం వెంకటస్వామిని పంపించాడు. స్టాఫ్ రూంలో ఉన్న ఒకరిద్దరు మాష్టార్లకి కూడా ఈ విషయం తెలిసింది.

కోటి గేటుదాక వచ్చాక, సైకిలు తీసి

సైకిలెక్కించుకున్నాడు సాధుని.

"ఏంటి కోటి మాయ్యా? " అన్నాడు సాధు.

ఏడుపొస్తోంది కోటికి, ఏంజెప్పడానికీ.

"ఏం లేదులేరా, మీ నాన్న తొరగా తీసుకు రమ్మన్నాడు"

ఏదో జరిగింది. ఏంటో అంతుబట్టడం లేదు సాధుకి. రాత్రి కుప్పల దగ్గర కాపలా పడుకోడానికి వెళ్ళిన వాడి నాన్న, వాడు బయలుదేరే సమయానికి రాలేదు. సహజంగా వచ్చేస్తాడు. ఎప్పుడైనా రాడు. దాని కోసం సాధు పెద్దగా ఎదురుచూడడం అలవాటు లేదు. ఆ మాలపల్లిలో అందరివీ పని శరీరాలే మినహా పలకరింపుల శరీరాలు కావు. వాళ్లు ప్రేమని పలకరింపు కంటే పని ద్వారానే చెబుతారు.

వాళ్ళ నాన్న ఆలోచన రాగానే సాధులో వాడికి తెలియకుండానే ఒక దిగులు కలిగింది. ఆ దిగులు గుదిబండలా అడుగడుగుకి భారం కావడం ప్రారంభించింది. మళ్లీ, 'కోటి మాయ్యా' అని ఊరుకుండిపోయాడు.

సాధు మాలపల్లి దారి మొగలోకి వచ్చేటప్పటికీ వాళ్ళ ఇంటి దగ్గర వీధిలో చాలా మంది గుమిగూడి ఉన్నారు. సాధు ఇంటి దగ్గరికి వెళ్లేటప్పటికి గొల్లున ఏడుపులు. వాళ్ళ అమ్మ, చెల్లి, నాయనమ్మ, ఇంకా కొంతమంది ఆడవాళ్ళు.

"నీయమ్మ, ఇంత మోసమా, పేనంతీసేత్తారా! నేనొప్పుకోన్రా!" అన్నాడు వీరేశు తమ్ముడు శీను.

"రేయ్ ఏమనుకుంటున్నావ్‌రా, ఈ యవ్వారం శానా దూరమెల్తద్ది, నువ్వు నోరు గట్టిగా మూసుకో" అన్నాడు పెద్ద మాల రాఘవయ్య.

అందరూ గుంపుగుంపులు పడుతున్నారు.

ఉదయం తొమ్మిదిన్నర ప్రాంతంలో మాలపల్లికి కబురొచ్చింది. వీరేసు, శివ

## ఫూలే, అంబేద్కర్ కలలు నిజం కావాలి!



డాక్టర్ చిలుకోటి కూర్మయ్య

ఇది నా తొలి నవల. ఇప్పటికీ నవలల పట్ల పాఠకుల్లో ఆసక్తి ఉందంటే 'చతుర' లాంటి పత్రికలే కారణం. అటువంటి పత్రికలో నా తొలి నవల బహుమతికి నోచుకోవడం నేను కలకాలం జ్ఞాపకం ఉంచుకోదగ్గ ప్రధాన ఘట్టం. ప్రస్తుతం రాజమండ్రి ప్రభుత్వ కళాశాలలో తెలుగు ఉపన్యాసకుడిగా పనిచేస్తున్నాను. చదవడమంటే చాలా ఇష్టం. ఉపాధ్యాయ వృత్తంటే మరీ ఇష్టం. రాయడమంటే బద్ధకం. సొంతూరు కృష్ణాజిల్లా మచిలీపట్టణం దగ్గర చిట్టిగూడూరు గ్రామం. ప్రాథమిక విద్య మా ఊరిలోనే. ఆంధ్ర విశ్వ కళాపరిషత్‌లో ఉన్నత విద్యాభ్యాసం. నాతో జీవితం పంచుకున్న డాక్టర్ పాలంకిశోభారాణి నవలారచనలో చేసిన సహాయం చాలా ఎక్కువ. పిల్లలు, వెన్నెల, అపరంజి, అమ్మ వీరమ్మ, నాన్న రామదాసు... ఇదీ నా కుటుంబం. పూలే, అంబేద్కర్ కలలు గన్న, కులాన్ని అధిగమించే భారతీయ సమాజం రావాలని నా ఆశ.

**చిరునామా:**

డాక్టర్ చిలుకోటి కూర్మయ్య,
తెలుగు ఉపన్యాసకులు, తెలుగు శాఖ,
ప్రభుత్వ డిగ్రీ కళాశాల, రాజమండ్రి-533105
సెల్: 9290263825

## కొత్తగాలి...

పల్లె...
పెరట్లో ముద్దబంతి
పట్నం...
గేట్లో బోగన్ విల్లా!

-రవి:రఫీ, గూడూరు

రావు కుప్పల దగ్గర కాపలా పడుకుని, పురుగు ముట్టి చచ్చిపోయాడని. మరో పది నిముషాల్లో శవం కూడా వచ్చేసింది.

పెద్దమాల రాఘవయ్య, గంగయ్య, మరో పదిమంది శివరావు ఇంటికెళ్ళారు.

వీళ్ళు వస్తున్నారని తెలిసి, అప్పటికే ఊరిలో పెద్దకులాలవారంతా ఇళ్ళ బయటికి చేరుకున్నారు. వీళ్ళు శివరావు ఇంటి దగ్గర వీధిలో నిలబడగానే, అక్కడే ఉన్న రాముడి గుడి దగ్గరికి చేరారు. అక్కడికే మరో పదిమంది గొల్లలు, ఒకళిద్దరు కాపులు కూడా చేరారు.

"ఒరేరాఘవయ్యా, ఇటురండ్రా ఒకసారి" అని పిలిచాడు ప్రెసిడెంటు రామకృష్ణయ్య.

అందరూ గుడి దగ్గరికొచ్చి వీధి మీద నిలబడ్డారు.

"అయిపోయిందేదో అయిపోయింది!

ఏదైనా ఖర్మ! మనమేం చెయ్యలేం. ఎవుడికెంత రాసిపెట్టి ఉంటదో అంతే! ఆళ్ళోళ్ళందరికీ కబుర్లెల్లాయ్యా? " అన్నాడు ప్రెసిడెంటు.

"ఆడి అన్న, తమ్ముడు ఇక్కడే గదుండే! కొడుక్కోసం గంటసాలబడికి పంపిచ్చాం. ఆడి అక్కాయ బందరు దగ్గిర కదండీ కబురెల్లింది" అన్నాడు పెద్దమాల.

"పురుగు ముట్టినోణ్ణి మనమేంచేత్తాం? " అన్నాడు ఊరివాళ్ళవైపు చూసి జనాంతికంగా.

"పాము కరిచినవాడ్ని దహనం చెయ్యాలిరా! అప్పుడే వాడికి సద్గతులు. ఏదో మీ పద్ధతి ప్రకారం పూడ్చి పెట్టెయ్యకండి! పాపం పాము కరిచి పోయాట్టగా!" అని లోకోపకార వాక్యం చెప్పి, సైకిలెక్కి వెళ్ళిపోయాడు విశ్వనాధ శర్మ, ప్రక్క ఊరి పౌరోహిత్యానికి. "అరే, పంతులు కూడా చెప్పాడు గదరా, ముందు ఆ పనేదో చూడండి" అన్నాడు ప్రెసిడెంటు.

మాలపల్లి నుండి వచ్చిన వాళ్ళందరికీ మనసులో అనుమానాలున్నాయి. నోరు మెదిపే ధైర్యమే లేదు. అక్కడే తచ్చట్లాడుతున్నారు.

"శివరావూ" అని రామకృష్ణయ్య పిలిచాడు.

"ఏంటి మావ" అంటూ వచ్చాడు.

"ముందు ఆణ్ణి మట్టి చెయ్యడానికి డబ్బులవీ సరుదు, ఆ తరువాత ఆడికి రావాల, నీకు రావాల లెక్క డొక్క తరవాత చూసుకుందుగాని. చేతులో డబ్బులున్నాయా, పంపనా!"

"ఉన్నాయ్ మాఁవయ్యా"

"పంతులు చెప్పాడు, కాల్చడం మంచిదని. దొడ్లోకెళ్ళి బండి గట్టుకెళ్ళి, ఇటునుంచి ఇటే గంటసాలెల్లి కట్టెలేసుకొచ్చెయ్యండి" అని వీళ్ళతో అని, శివరావు వైపు తిరిగి "ఆళ్ళకేదో ఇచ్చి పంపరా నువ్వు" అన్నాడు రామకృష్ణయ్య.

తీర్పులు పూర్తయ్యాయి. నోరు పెగుల్చుకునే ధైర్యం ఎవరికీ లేదు. తిరుగుముఖం పట్టారు మాలపల్లి వైపు.

"ఏరా బండిదీసికెళ్ళరే ఎవరూనూ కట్టెలకోసం? " అన్నాడు సత్యనారాయణ.

"ఒద్దులే బాబో, మాకు పాతిపెట్టడమే ఆనవాయితీ. మట్టి జేసేత్తం. ఆడెట్టా సచ్చాడో దేవుడికి తెలుసు" అన్నాడు గంగయ్య.

"ఏంట్రా లంజాకొడకా, ఏంటి నీ ఉద్దేశం? దేవుడికి తెలుసంటన్నా, ఇక్కడె

వుడన్నా సంపాదడంటావా ఆణ్ణి. నా కొడకల్లార, సుతీపతీ లేకుండా వాగారంటే, బొక్కలో తొయ్యించేస్తాం నా కొడకల్లార..." అంటూ గయ్యిన లేచాడు సత్యనారాయణ.

వీరేసుని మట్టి చేసేసారు- ఏమి చెయ్యలేని నిస్సహాయంగా.

తన కారణంగా చచ్చిపోయినందుకు వీరేసు గురించి కనీసం కళ్ళనీళ్ళు పెట్టుకునే అవకాశమైనా శివరావు విధవ చెల్లెలికి ఉందో లేదో ఎవరికీ తెలియదు.




**లె**క్కలు డొక్కలు చూస్తే వీరేసుకు రావల్సిందేం మిగల్లేదు. మిగిలింది దినం ఖర్చులకి సరిపోయింది. ఒక్కసారిగా సాధు, చెల్లి, తమ్ముడు, వాళ్ళమ్మ ఒక పెద్ద అండని పోగొట్టుకున్నారు. జీవితమేం శూన్యమైపోలేదు. ఉన్న అందరికీ రెక్కల కష్టం తప్పదు. అయితే ఒక ఆత్మీయత ఆవిరయిపోయింది. ఒక అండ బీటలు వారిపోయింది. రెక్కలు కలిగిన మనిషి, కుటుంబానికి ఇంకా అవసరమున్న మనిషి మధ్యలోనే వెళ్ళిపోయాడు.

పెద్దదినం అయిపోయింది. రెక్కల కష్టం ఉంటేనే నోటికి ముద్ద దిగుతుంది. ఆ నలుగురూ ఎవరి పనుల్లో వాళ్ళు పడిపోయారు.

బడికి వెళుతూనే గేదె బాధ్యతని నెత్తినేసుకున్నారు సాధు చెల్లి, తమ్ముడు- చాలా కాలం క్రితమే. సాధు చెల్లి నరసమ్మకి అంట్లు తోమడం, నీళ్ళు తెచ్చి పొయ్యడం, ఇంటి పనంతా చెయ్యడం వచ్చేసింది- అన్నం వండడం మినహా.

సాధు స్కూలు మానేసాడు. సుబ్రహ్మణ్యశాస్త్రి దగ్గర పాలేరుతనం చేరాడు. చదువులో నుంచి పాలేరుతనంలోకి రావడానికి సాధులో ఘర్షణ ఏమీ లేదు. అంతా తేటతెల్లం. ఏది చెయ్యాలో, ఏది మానాలో, ఎలా ఉండాలో, ఎలా ఉండకూడదో ఈ సమాజం వాళ్ళకి కటువుగా నేర్పుతుంది. జీవితంలో ఎదురుదెబ్బల్ని కూడా పెద్ద ఉత్పాతం లేకుండానే సాధారణంగా తీసుకునే ఆత్మిక శక్తిని అలవరుస్తుంది.

ఘంటశాల హైస్కూల్లో స్వాతంత్ర్య దినోత్సవానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి. పోల్ బార్ మీద విన్యాసాలు, పిరమిడ్లు, అన్నింటినీ సాయంత్రం పూట డ్రిల్ మాష్టారు జాన్‌గారు ప్రాక్టీసు చేయిస్తున్నాడు. అంతర పల్టీలు, నిప్పుల్లో నుండి మొగ్గలు వెయ్యడం, పిల్లలకి పదిహేను రోజుల ముందుగానే అలవాటు చేయిస్తున్నారు. ప్రసాదు ఈ ఆటల్లో ఉన్నాడు. దానితో ఇంటికి రావడానికి పొద్దుపోతోంది. మంగలి రాజు కొడుకు శివకృష్ణ కూడా వీటిలో ఉన్నాడు.

శివకృష్ణ సైకిలు మీద పాటిపూడి ఊరు వరకూ వచ్చి, కరంటు స్తంభం దగ్గర దిగి, చీకట్లో నడుచుకుంటూ అలవాటుపడ్డ ఆ బాటవెంట చిన్న కూనిరాగాలు తీసుకుంటూ వస్తున్నాడు ప్రసాదు. సాధు వాళ్ళ నాన్న పాముకరిచి చచ్చిపోలేదని తెలిసినా చీకట్లో పాముంటుందేమో అనే భయం మాత్రం పట్టుకుంది ప్రసాదుకి. అందుకే చిన్న కూనిరాగాలు తీసుకుంటూ నడుస్తున్నాడు. అలికిడికి అవి దూరంగా పోతాయని.

దారిలో సాధు చెల్లి నరసమ్మ తగిలింది. "ఏంటే నరసా, ఇప్పుడొత్తన్నావ్?" అని పలకరించాడు.

"కోంటి కొట్టుకెలొత్తన్నా నన్నయా!"

"ఆడికి చెప్పకపోయా? వచ్చేటప్పుడు కాళీ చేతులేగా, తెత్తాడు!"

"ఉప్పుడవసరం వొచ్చిందన్నయ్యా"

వాళ్ళకి గంగులు తగిలాడు. ముగ్గురూ మాట్లాడుకుంటూ మాలపల్లి చేరారు.

ప్రసాదు ఇంటికి చేరేటప్పటికి కిరసనాయిలు దీపాల ముందు కూర్చొని పిల్లలంతా గణగణ చదువుతున్నారు. ప్రసాదు స్నానం చేసి, అన్నం తిని పుస్తకాలు ముందేసుకు కూర్చున్నాడు.

ఈమధ్య పోతురాజు కాస్త ఆలస్యంగా రావడం ప్రారంభించాడు. అప్పుడప్పుడు కాస్త మందు పుచ్చుకుని వస్తున్నాడు.

ప్రసాదు కూర్చొని సైన్సు చదువుతున్నాడు.

"ఏమే, నీళ్ళేడి గున్నయా?" అన్నాడు పోతురాజు వస్తూనే. కాస్త గదమాయించే మాట నోటంట వచ్చిందంటే, పోతురాజు వొంట్లో పైవాడు ఉన్నట్లే లెక్క.

"అందరూ పెందలకాడే వచ్చేత్తన్నారు. ఉప్పుడు దాకా ఏం పాటక్కడ?" అంది మాలచ్చిమి నీళ్లు పడుతూ.

"ఆс పాటు. నీయమ్మ, నీకు చెప్పాల న్నీని"

"నీ పాటు చెప్పొద్దులె, నోటినిండా పోసుకొత్తన్నావుగా ఆటికి డబ్బులెక్కడ నుండి వత్తన్నాయో చెప్పు"

"నీ బాబిత్తన్నాడే, నీ బాబిత్తంటే తీసుకుని పోసుకొత్తన్నా"

"నా బాబిత్తే నువ్వు ఇట్టా ఎట్ట మాటాడతావ్? నీ తాగుడు చూత్తంటే, మరీ ఎక్కువయిపోయిందీ మద్దె. ఎవడి దగ్గిర అప్పిచ్చుకొస్తన్నావో చెప్పు. నువ్విట్టాగే తాగొత్తూ ఉండు, ఇల్లు గుణ్ణమైపోద్ది" అంటూ అన్నానికి కంచము, గ్లాసు కడుగుతోంది.

"నీ సంపాదనంతా గుణ్ణం జేసేత్తన్నాన్నేను. ఇంటికొత్తే ఇంటికాడ కాసేపు కూకోబుద్దెయ్యాని య్యటం లేదు నువ్వు. తలి సిక దరగ! ఇట్టాగే వాగతా వుండు, నీ పీక పిసికి సంపేత్త"

ప్రసాదుకి తండ్రి తాగి రావడం, వచ్చి రభస చెయ్యడం నచ్చడం లేదు. కాసేపు పుస్తకం మూసేసి కూర్చున్నాడు.

"రా! అన్నానికి తగలడు" అంది మాలచ్చిమి మొగుణ్ణి.

"తగలడతానే, నువ్వు చూత్తున్నదందుకేగా నేనెప్పుడు తగలడతాననీ" అంటూ గిన్నె దగ్గర కూర్చున్నాడు.

"వొంకాయ కూర! ఊ వొంకాయ, ఇదొక కూర! తెత్ నీయమ్మ" గిన్నె ముందుకు తోసాడు. మళ్ళీ దగ్గరికి లాక్కుని తినడం

## పోలీసు చతురోక్తులు

**వృత్తులపరమైన చతురోక్తులలో భాగంగా ఈ నెల పోలీసు వృత్తికి సంబంధించిన గిలిగింతలు కొన్ని..**

### భలే కోరిక

ముగ్గురు పోలీసాఫీసర్లు మాదకద్రవ్యాల స్మగ్లర్లతో జరిగిన ఎన్‌కౌంటర్లో చనిపోయారు. స్వర్గంలో దేవుడు వాళ్లతో 'మీ శవసంస్కారానికి వచ్చిన బంధువులు మీ గురించి ఏం మాట్లాడాలనివుందో కోరుకోండి' అన్నాడు. ఒక ఆఫీసరేమో, 'మొత్తం పోలీసుల్లోనే అత్యంత ధైర్యశాలినని నన్ను కీర్తించాలి' అన్నాడు. మరో ఆఫీసరేమో, 'కర్తవ్య నిర్వహణలో నేలకొరిగానని చెప్పుకోవాలి' అన్నాడు. ఆఖరి ఆఫీసర్ మాత్రం, 'శవ పేటికలోని శవం కదులుతోంది' అని అందరూ అరవాలి అన్నాడు.



మొదలెట్టాడు.

ఒకప్పుడు పోతురాజు తాగితే, వచ్చి మెదలకుండా పడుకునేవాడు. క్రమంగా మాటలు, ఆ తరువాత దారిలో వెళ్ళే వాళ్ళతో పెద్దపెద్దగా మాటలు, ఇక ఇంటి దగ్గర మాలచ్చిమి మీద కేకలెయ్యడం ప్రారంభించాడు. అయితే పోతురాజుకి కొడుకుమీద మమకారం. వాడు చదువు కుంటున్నాడని గౌరవం. తాగకపోతే పోతురాజు శరీరానికి చెప్పినపని చెయ్యడం మినహా మరొకటి తెలియదు. తాగకపోతే వాడు ఆ ఊరి పరిభాషలో 'పిచ్చగొడ్డు'. పోతురాజు అన్నం తినడం పూర్తయింది. చేతులు కడుక్కుని వసార్లోకి నులక మంచం వాల్చుకుని మంచం మీద నడుం వాల్చడానికి కూర్చున్నాడు.

ప్రసాదు పోతురాజు దగ్గరకొచ్చాడు.

"ఏంట్రా" అన్నాడు కంగారుగా పోతు రాజు.

"నువ్వు తాగి ఇట్టా మాట్టాడబాక. బాగుండటం లేదు" అన్నాడు ప్రసాదు.

అప్పుడే మూతి మీద మీసపు ఛాయ లొస్తూ పచ్చివాసం ముక్కలా ఉన్న కొడు కుని చూశాడు. మరో రెండేళ్లు పోతే నన్ను మించిపోతాడు అనుకున్నాడు మనసులో. మరింకేమీ మాట్లాడకుండా మంచంమీద పడుకుండిపోయాడు.

ప్రసాదు పదో తరగతి సైన్సు పుస్తకం తీసి చదువుకుంటూ ఉన్నాడు. పోతురాజు గుర్రు పెట్టేస్తున్నాడు.

ఆ తరువాత పోతురాజు తాగి రావడం మానలేదు. తాగనప్పుడులాగానే ఉండడం మాత్రం ప్రారంభించాడు.

★ ★ ★

ఎర్రకోట మీది నుండి చరణ్‌సింగ్ ఉప న్యాసం. జనానికేం ఆసక్తి లేదు. ఒక అని శ్చిత ప్రధాని ఉపన్యాసం!. కానీ దేశాధినే తగా, రైతు నాయకుడిగా తొణకకుండా స్థిరంగా ఉపన్యసించారాయన.

ప్రసాదు ఊరిలోకి వచ్చి కరంటు స్తంభం దాటి పమిడేశ్వరరావు వీధి అరుగు దగ్గర శివకృష్ణ కోసం నిల్చు న్నాడు. పంచాయితీ రేడియోనుండి చరణ్ సింగ్ ఉపన్యాసం వినపడుతోంది.

"ఒరే ప్రెసాదో, శివకృష్ణగాడు ఇంకా బయలుదేర్లా. ఆళ్ల నాన్న సైకిలేసుకు కోసూరెళ్లాడంట!" అంటూ సైకిలు తొక్కు కుంటూ వెళ్లిపోయాడు- తొమ్మిదో తరగతి చదివే సత్యనారాయణ కొడుకు సూర్యప్ర కాష్.

ప్రసాదు స్కూలుకి తొందరగా వెళ్లాలి. మధ్య మధ్యలో చిన్న గునుకు తీస్తూ నడక సాగించాడు.

"ఒరే ప్రెసాదో" అని శివకృష్ణ పెద్ద కేక పెట్టాడు- సైకిల్ వేగంగా తొక్కుతూ. ప్రసాదు ఆగాడు.

"ఆడు సూర్యప్రకాషు, నువ్వు ఆలిస్యం అవుతావు. సైకిలు మీ నాన్న తీసుకెళ్ళా డని చెప్పాడు? !" అన్నాడు ప్రసాదు- సైకిలు క్యారియర్ మీద కూర్చుంటూ.

"యెదవ రా ఆడు! ఏమనలేం, నిక్కు" అన్నాడు శివకృష్ణ.

స్కూలు రంగు రంగుల కాగితపు జెండా లతో అలంకరించి ఉంది. పిల్లలంతా నిన్ననే వాళ్ల వాళ్ల క్లాసు రూములన్నీ కడిగి శుభ్రం చేసుకున్నారు. తలో పావలా, అర్ధ రూపాయి పోగుచేసి వాళ్ల రూములని అలంకరించుకున్నారు.

ఘంటశాల నుండి ఇదే స్కూల్లో చదువు కుని అమెరికా వెళ్లిన వేమూరి ప్రకాశరా వుని ఈ స్వతంత్ర దినోత్సవానికి ముఖ్య అతిథిగా స్కూలుకి పిలిచారు. దానితో పిల్లలకి కూడా కాస్త ఉత్సాహంగా ఉంది.

తొమ్మిది గంటలకి స్వతంత్ర దినోత్సవ వేడుక ప్రారంభమయింది. పతాకావిష్క రణ హెడ్మాష్టరు చేసారు. వేదికకి తెరలు

కట్టారు. పిల్లలందర్నీ గ్రౌండు వైపు వర సగా తీసుకుని వెళ్ళి అక్కడ కూర్చోబె ట్టారు. హెడ్మాష్టారు, డా॥ వేమూరి ప్రకా శరావు, స్వతంత్ర సమరయోధుడు నర సయ్య, పెద్ద హిందీ మేష్టారు వేదికమీద కూర్చున్నారు.

ముందుగా హెడ్మాష్టరు మాట్లాడారు. పిల్లలందర్నీ డా॥ ప్రకాశరావు అంతటి వారు కావాలని దీవించారు. డా॥ వేమూరి ప్రకాశరావు, తను ఇక్కడ చదువు కున్నప్పటి అనుభవాలు చెప్పారు.

ప్రసాదు, ఇంకా డ్రిల్ విన్యాసాలు చెయ్యవలసిన విద్యార్థులు, స్టేజికింద ఒక పక్కగా నిల్చున్నారు. ప్రసాదు, వేమూరి ప్రకాశరావుని జాగ్రత్తగా గమనిస్తున్నాడు. పిల్లలందరూ ముందు ఆసక్తిగా విని తరు వాత ఏమేమి పెడతారో గుసగుసలాడు కుంటున్నారు కొందరు. వేమూరి ప్రకాశ రావు స్కూలుకి ఒక టైపు మిషను బహూ కరించాడు. హోరెత్తేటట్టు చప్పట్లు చరి చారు పిల్లలందరూ. ఆ తరువాత హిందీ మాష్టారు పిల్లలచేత రెండు దేశభక్తి గీతాల్ని పాడించారు.

బందరు నుండి వచ్చిన స్వతంత్ర సమ రయోధుడు నరసయ్య, భారత స్వాతంత్ర్య సంగ్రామం, గాంధీమహాత్ముడు, నెహ్రూ, గోఖలే, తిలక్ మొదలైన వాళ్ల కృషివల్ల స్వరాజ్యం ఎలా వచ్చింది. ఆంగ్లేయులు ఎంతగా మనల్ని మోసం చేశారో పిల్లల్ని ఆకట్టుకునే విధంగా చెప్పారు.

"పిల్లలూ, మీరెవ్వరూ అంటరానితనం పాటించకూడదు. అంటరానివాళ్లలోంచి వచ్చిన అంబేద్కరు మన భారత రాజ్యాంగ రచనలో పాలు పంచుకున్నారు. హరిజనుల పిల్లలు మన స్కూల్లో చాలా మంది ఉన్నారు. బాగా చదువుకోవాలి" అని చెప్పి ముగించారు నరసయ్య.

డ్రిల్ మాష్టారు జాన్, తెల్లటి నిక్కరు తెల్లటి బనియను వేసుకుని వచ్చారు. పిల్ల లచేత పిరమిడ్లు ఒకదాని తరువాత ఒకటి వేయించారు. పిల్లలందరూ ఆశ్చర్యపోతూ చప్పట్లు కొట్టారు.

ఆ తరువాత లాంగ్‌పోలు మీద విన్యా సాలు. అందరూ వొంటికి పట్టి ఉండే డ్రాయర్లు వేసుకుని విన్యాసాలు ప్రారంభిం చారు.

ప్రసాదు ముందు గబగబా పాక్కుంటూ వెళ్ళి, నాలుగు మీటర్ల ఎత్తు ఉండే ఆ పోల్ బుడిపెమీద పొట్ట పెట్టి, కాళ్ళు చేతులు తిన్నగా చాపాడు. పిల్లలందరూ చప్పట్లు కొట్టారు. ఒక కాలు మడతవేసి పట్టుకుని ఆ కాలు ఆధారంతో పోలుపై నిలబడ్డాడు. ఒకరి ఆసరాతో ఒకరు, ఒకరి ఆసరాతో మరొకరు పోలు ఆధారంగా చేతులు, కాళ్ళు వేలాడదీస్తూ బొమ్మల్లా వివిధ భంగిమల్లో నిలబడ్డారు. కిందివాళ్లు సరిగా నిలబడ్డ తరువాత, ఒక్క కాలు పట్టుతో నిలబడి, రెండు చేతులతో తిన్నగా దణ్ణం పెట్టాడు.

కింద ఆసరాగా కృష్ణప్రసాదు ఉన్నాడు. కొంతమంది టీచర్లు అందుబాటులో ఉన్నారు. చప్పట్లు పూర్తయ్యాక ఒక్కొక్కరే దిగారు. దిగుతున్న వాళ్ళల్లో కొందర్ని భుజంమీద ఆపి కిందికి దించాడు కృష్ణప్ర సాదు.

"బాగా ఆపుతున్నావురా" అని కృష్ణప్రసా దుని మాష్టార్లు అందరూ అభినందిం చారు.

ఆ తరువాత నేలమీద మొగ్గల విన్యా సాలు చేసారు.

రింగ్‌కి గుడ్డ చుట్టి కిరోసిన్‌లో ముంచి సిద్ధంగా ఉంచారు. దానికి నిప్పంటిం చారు. రింగ్ భగభగ మండుతోంది. అక్కడే రెండు బకెట్లతో ఇసుక, మరో రెండు బకెట్లతో నీళ్ళు పట్టుకుని నలుగురు విద్యార్థులు సిద్ధంగా ఉన్నారు.

"అమ్మో! ఇందులో నుండి దూకుతారా" అనుకుంటూ ఉత్కంఠగా చూస్తున్నారు చిన్న తరగతుల పిల్లలు.

ముందుగా ఏడో తరగతి నాంచారయ్య దూకాడు. తరువాత గొల్ల గోవిందు దూకాడు. ప్రసాదు దూకాడు. ప్రసాదు మిగతా వాళ్ళలా కాకుండా చేపపిల్ల నీటిలో నుండి పైకొచ్చి తిన్నగా ముందుకు దూకినట్లు దూకి, తన కాళ్ళమీద తానే నిలబడ్డాడు. పిల్లలంతా చప్పట్లు కొట్టారు. మాష్టార్లూ చప్పట్లు కొట్టారు.

మిఠాయిల పంపకాలు అయిపో యాయి. పిల్లలు ఎవరిదారిన వాళ్లు వెళ్లి పోతున్నారు. ప్రసాదు, మరికొంతమంది పిల్లలు ఉండి సర్దవలసినవి సర్దుతున్నారు.

గొల్లగోవిందు, శివకృష్ణ ఒక టేబులు పట్టి స్టాఫ్‌రూమ్‌లోకి తీసుకెళుతున్నారు. కృష్ణప్రసాదు ఏది ఎక్కడ పెట్టాలో వాళ్ళకి సూచనలిస్తున్నాడు.

"కృష్ణ! ఈ టేబులు పట్రా మనిద్దరం తీసుకెళదాం!" అని పిలిచాడు ప్రసాద్ కృష్ణప్రసాదుని.

"అరే గోవిందు, ఆ టేబులంట వాడికి సాయం పట్రా" అన్నాడు కృష్ణప్రసాదు.

"వాడింకోటి చేస్తున్నాడుగా, నువ్వు పట్టొచ్చుగా!" అన్నాడు ప్రసాదు.

"ఇక్కడివన్నీ చూడొద్దూ? " అన్నాడు కృష్ణప్రసాదు.

"ఆళ్ళున్నారుగా!"

"ఒరే రాధాకృష్ణ, ఆ టేబులు హెడ్మాష్టారి రూమ్‌కి సాయం పట్టరా ప్రసాదుగాకి" అని మరో పక్కకి వెళ్ళిపోయాడు కృష్ణప్రసాదు.

కృష్ణప్రసాదుని సాయం పట్టమని ప్రసాదు మామూలుగానే అడిగాడు. తరువాత అర్థమయింది ఎందుకెళ్లిపోయాడో!

రాధాకృష్ణ, ప్రసాదు కలిసి టేబుల్‌ని హెడ్మాష్టారి రూమ్‌కి తీసుకుని వెళ్ళి పెట్టేసారు.

నిప్పుల్లో దూకడం, బార్ విన్యాసాలు ప్రసాద్‌కి స్కూల్లో అంతకుముందు లేని గుర్తింపు తెచ్చాయి.

★ ★ ★

మాలచ్చిమి, కబురు వచ్చిన నాలుగు రోజుల నుండి బావని చూసి రావడానికి వెళదామనే అనుకుంటోంది. ఈ రోజుకి తీరింది.

ఈ మధ్య పాటిపూడి ఊరు మీదుగా సిటీ బస్సేసారు. అదెక్కి మొవ్వ వెళ్ళిపోతే, అక్కడి నుండి పామర్రు వెళ్ళడం దగ్గర. పామర్రు నుంచి కురుమద్దాలి వెళ్ళొచ్చు. తన అక్క భర్తకి కొంచెం ఒంట్లో బాగుండలేదని, ఆసుపత్రిలో చేర్చారని కబురొచ్చింది. మాలపల్లి నుండి మాలచ్చిమి బయలుదేరింది. వైరు బ్యాగు చేత్తో పట్టుకుంది. చాలాకాలం, చెక్కపెట్టెలోపలే ఉంచడంతో కొత్తగానే ఉంది. వీధిదాటి డొంక పట్టుకొని ప్రకాశరావు చేనుగట్టుమీద నుండి మళ్ళీ ఊర్లో కెళ్ళే దారివరకూ నడిచింది. ఊరి కరంటు స్తంభం కాస్త దూరంగా ఉండగానే రబ్బరు చెప్పులు తీసివేసి కనబడకుండా గుడ్డ కప్పేసింది. వాలుజడని ముడిపెట్టేసింది. కొత్తగా కుచ్చిళ్ళు విరబోసి కట్టుకున్న చీరని కాళ్ళు కనిపించేటట్లు మడిచి జాగ్రత్తగా బొడ్లోకి దోపింది. ఈ వైరు బ్యాగుని ఇలాగే పట్టుకోవాలో, చంకలో పెట్టుకోవాలో తెలీక ప్రయాణపు ముస్తాబు చెడకుండా, ముస్తాబు విషయంలో ఊర్లో మాట పడకుండా ఉండడానికి అవస్థ పడుతోంది. ఈ వైరుబ్యాగుని ఎలా పట్టుకోవాలో తెలియడంలేదు. చివరికి అటూ ఇటూ కాకుండా పట్టుకుని తలదించుకుని, పమిడేశ్వరరావు అరుగుల దగ్గర నుండి, కోసూరి వైపు వెళ్ళేదారికి తిరిగింది. రోడ్డు పక్కనుండి తలవంచుకుని నడుస్తోంది.



బిక్కచచ్చిపోయింది మాలచ్చిమి.

మరికాస్త దూరం వెళితే, వీధి అరుగుమీద కూర్చున్న ప్రభావతమ్మ, "ఏమే, ఎవరి పెళ్ళానివి నువ్వు? " అంది.

"పాలేరు పోతురాజు పెల్లాన్నండి" చెప్పింది.

"ఎక్కడికేంటే ఇప్పుడు? "

"పామఱ్ఱు దగ్గిర కురుమద్దాలిలో మా అప్పనిచ్చారండి. మా బావకి బాగుండలేదు. ఒకపాలి సూసొద్దామని... మనూరి మీదుగా బస్సొస్త న్నాది కదమ్మగారో!"

"ఆc ఆc వస్తుందే. అటు ముందుకెళ్లి నుంచో. పైకెళ్లింది, ఇంకా సేపటిలో రావొచ్చు"

"ఎల్తానమ్మ" కదిలింది మాలచ్చిమి.

రామకృష్ణయ్య అరుగులమీద కూర్చున్న నలుగురిలో ఒకరు,

"ఎవతిరా ఇది? మాలపల్లి గదూ" అన్నాడు.

"అదేరా, పోతురాజుగోడి పెళ్ళం"

"అబ్బో, ఇట్టుంటదేంటిది!" అన్నాడు మరొకడు.

తను కట్టుకున్న మంచి బట్టల్తో ఇబ్బంది ఇబ్బందిగా, ఆ రోడ్డు వెంట కుంచించుకుపోతూ సిగ్గుపడుతూ... ఎవరేమనుకుంటారోనని భయపడుతూ బస్‌స్టాప్ దగ్గరకెళ్ళి నిల్చుంది. అప్పటికే అక్కడ కొంతమంది ఉన్నారు. వాళ్ళకు కాస్త దూరంగా వెళ్ళి ఎండలో నిల్చుంది.

★ ★ ★

ప్రసాదు వాళ్ళ స్కూల్లో సాయంత్రం పూట కూడా ఉంచి చదివిస్తున్నారు. నిరుడు టెన్త్ పాస్ పెర్సెంటేజి తగ్గింది. ఈ సంవత్సరం అలా కాకూడదని మాష్టార్లు కష్టపడుతున్నారు. ప్రసాదు ఘంటశాలలో బయలుదేరేప్పటికి పొద్దుపోయింది. పాటిపూడి చేరేటప్పటికి చీకటి పడింది. శివకృష్ణ అటు వెళ్ళిపోయాడు. సాధు కనిపించాడు.

"సాధు, నువ్వొస్తావంట్రా, ఆలిస్యం వుందా?" అని అడిగాడు ప్రసాదు సాధుని.

"గేదెల ముందు గడ్డేసి వొచ్చెయ్యడమే!" అన్నాడు సాధు.

"ఇక్కడే నుంచుంటా, నువ్వొచ్చెయ్" అన్నాడు.

సాధు వస్తూ వస్తూ కోమటి కొట్టు నుండి రెండు జంతికలు కొనుక్కొచ్చాడు. ఒకటి ప్రసాదుకి ఇచ్చాడు. సాధు, ప్రసాదు భుజంమీద చెయ్యివేసి నడుస్తున్నాడు.

"ఎట్టా వుందిరా పని?" అన్నాడు ప్రసాదు.

"మనపని మనం చేసుకుపోతాం. అరుస్తారు తప్పితే మురికితిట్లు తిట్టర్రా బాపనోల్లు! సాయంత్రం పాలు నేనే తీత్తాన్రా! అయ్యక్కడెట్టాలి. కాసిని నీళ్ళు జల్లుకుని తీసుకుంటారు. ఆ నీళ్ళు జల్లకుంటే ఏమైపోద్దో తెలవదురా" అని పెద్దగా నవ్వాడు సాధు.

కాసేపాగి,

"అవునూ, పేసవుతావా?" అన్నాడు.

"చదువుతున్నాన్రా, పేసవుతాననే అనుకుంటున్నా!"

"నీకు చెప్పలేదు కదరా! మొన్న బుజ్జిగోరి ట్రాక్టరు, రాయుడిగారి డొంక నుంచి రావిచెట్టు వరకూ తోలుకెల్లిపోయారా!"

"అయితే తొందర్లోనే నీకు ట్రాక్టరు తోలడం వచ్చేస్తదన్నమాట"

"తొర్లో ఎంట్రా? వొచ్చేసింది" అన్నాడు నమ్మకంగా. ఏ పనైనా చూసి వెంటనే గ్రహించడం సాధుకి అలవాటు.

ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ ఇంటికొచ్చేసారు.

★ ★ ★

ప్రసాదుకి పదో తరగతి పరీక్షలు అయిపోయాయి. పరీక్షలు అయిపోగానే చాలా పెద్దభారం దిగినట్లుగా అనిపించింది. ఏమవుతుందో రిజల్టు తెలియదు. రెండో రోజునే గేదెని తిప్పుకురావడానికి బయలుదేరాడు.

ప్రసాదు ఎప్పుడైనా వాళ్ళ అమ్మ పెట్టమంటే యథాలాపంగా దేవుడికి దణ్ణం పెట్టడమే కానీ తనంత తానుగా మనస్ఫూర్తిగా దేవుడికి దణ్ణం పెట్టలేదు ఎప్పుడూ. కానీ పదో తరగతి పరీక్షలకి వెళ్ళే ముందు, వాళ్ళింట్లో ఉన్న శివుడు, రాముడు క్యాలెండరు ఫొటోలకి దణ్ణం పెట్టుకుని బయలుదేరాడు.

ఇంకా ఊర్లో ఉన్న ఎలిమెంటరీ స్కూలుకి సెలవులు ఇవ్వలేదు. ఏడవ తరగతి కామన్ పరీక్షలు జరుగుతున్నాయి. సాధు చెల్లెలు నరసమ్మ ప్రసాదు దగ్గరికి వచ్చింది.

"రేపు ఇంగ్లీషు పరీక్షన్నయ్యా, ఇంపార్టెంటు చెపుతావా" అని అడిగింది.

ప్రసాదు నవ్వి "ఇంపార్టెంటు చెప్పలేనే, నీకు ఏది తెలవలేదో చెప్పు, నాకు తెలిస్తే చెప్తాను" అన్నాడు. ఏడవ తరగతి ఇంగ్లీషు పరీక్షకి ఏదో బండగుర్తులు తనకి తోచినవి చెప్పాడు. మర్నాడు, నరసమ్మ దాని క్లాసు పిల్లలు మరో నలుగురు లెక్కలు చెప్పమని వచ్చారు.

సైన్సులో ఇంపార్టెంటు అనుకున్నవి, ముఖ్యమైన బొమ్మలు చెపుతుంటే, పోతురాజు ఇంటికి వచ్చాడు. తన కొడుకు దగ్గరకి నలుగురు వచ్చి నేర్చుకోవడం...

గుండె పొంగింది. 'ఆడెట్టా చదువుతాడు, ఇదెట్టా చదువుద్దని' కొన్ని ఆరాలు తీసి స్నానానికెళ్ళిపోయాడు.

చిన్నగా నాటకంలోని రాగం తీస్తూ స్నానానికొచ్చాడు. అన్నానికి కూర్చుంటూ, "పెసాదో, మినుము కొద్దికొద్దిగా నూరుతున్నాం గదా మన దొరగోరిది! ఆరికి సెప్పాను. రేపణ్ణుంచి నువ్వు కూడా పనికొచ్చెయ్. ఆడు పొద్దుటే వొచ్చేత్తాడు. గేదని నువ్వు అటే తోలకొచ్చెయ్" అన్నాడు పోతురాజు.

మినుప నూర్పిళ్ళు, గట్లు వెయ్యడాలు, నీళ్ళు పెట్టడాలు ఏదో ఓ పనికి నాగా లేకుండా వెళుతూనే ఉన్నాడు ప్రసాదు.

★ ★ ★

ప్రసాదు వాళ్ళ పెదనాన్న పోయినట్లు కురుమద్దాలి నుంచి కబురొచ్చింది. మాలచ్చిమి, పోతురాజు బయలుదేరి వెళ్ళారు.

ప్రసాదు ఇంటి దగ్గర ఉన్నాడు. చచ్చిన గొడ్డు ఆచూకీ రాబందుకు తెలిసింది. ఆ సాయంత్రమే పోతురాజు వాళ్ళ దొర గంగాధరరావు నుండి ప్రసాదుకి కబురొచ్చింది- 'రేప్పొద్దునే మీ దొర ఒకపాలి రమ్మంటన్నారని'

ప్రసాదు మొహం కడుక్కుని, గేదెల దగ్గర బాగుచేసి, వాటిని బయటకట్టేసి, కాస్త గడ్డి వాటి ముందువేసి, చద్దన్నం తిని గంగాధర్రావు ఇంటికెళ్ళాడు.

గంగాధరరావు బయట నిలబడి ఉన్నాడు.

"ఏరా, పొద్దునే రమ్మంటే ఇప్పుడా వచ్చేది? పొద్దునంటే ఇదా? " అని కసిరాడు.

"ఇంటి దగ్గరి ఎవరూ లేరుగదండే, గేదెల్ని కట్టేసి, వెంటనే వొచ్చేనండే" అన్నాడు ప్రసాదు.

"ఎదవకి ఎదురు సమాధానమొకటి! యెనక్కెళ్ళు. మీ అమ్మగారు పిలుస్తున్నారు" అని విసుక్కున్నాడు.

"ఏరా నిన్ననగా కబురు చేస్తే ఇప్పుడా వొచ్చేది? రా! రా! పనంతా అట్టా దిగడి పోయింది. ముందు కుడితి తొట్లో తవుడు కలుపు. ఆ మూడు తోటల్లోనూ కలిపెయ్యరా. మర్చేపొయ్యాను. కోళ్ళగాబులు లేపేసి, ఆ మూలన నూకలున్నాయి, ఆటి కెయ్యి. నీళ్ళు తోడి తొట్టెల్లో నింపేసి... పాడి గేదలు తెలుసా? "

"తెలవదండమ్మగారు"

"చిప్పి కొమ్ములుది, మాళీగేద చెవ్వు తెగింది, ఆ పక్కయి రెండు.. ఆటికీ కుడితినీళ్ళు పెట్టు. మిగతా వాటికి తొట్లో నీళ్ళు తాగించెయ్యి. అరే, నువ్వెప్పుడు దొడ్లోకొచ్చి పనిచెయ్యలేదుగా!"

"లేదండీ"

"నేను చూసుకుంటూ ఉంటాన్లే, ముందా పనులు కానియ్" అని, ఇంటి ముందు చిన్నపాలేరు చేత కళ్ళాపి చల్లిస్తోంది గంగాధరరావు భార్య.

"మీ అయ్యగారు పిలిచారురా. అటు వెళ్ళు" అంది అమ్మగారు.

చెప్పిన పనులన్నీ చేసుకొని ప్రసాదు ఇంటి ముందు వాకిట్లోకొచ్చాడు. అప్పటికే బారెడు పొద్దెక్కింది.

"అరేయ్, ఆ రెండు ఎండిన కొబ్బరి గెలలు జాగ్రత్తగా దించాలిరా. విత్తనం వెయ్యాలవి. నువ్వు బాగా చెట్లెక్కుతావన్నాడురా మీ బాబు! ఒరే బుడ్డోడా, కత్తిని సన్నమోకు పట్టుకురారా" అన్నాడు గంగాధరరావు ప్రసాదుని చూసి.

ప్రసాదు ధ్యాసంతా ఇంటి దగ్గర ఎండలో మాడుతున్న గేదెల మీద ఉంది. తాడు తీసుకుని బంధం ముడేసుకున్నాడు. మోకు చంకకి తగిలించుకుని నోటితో కమ్మకత్తి పట్టుకుని గబగబ కొబ్బరిచెట్టు ఎక్కేసాడు. మొవ్వు దగ్గర మట్ట పట్టుకుని, మొవ్వులోకి వెళ్ళి కూర్చుని తాడు తీసి

గెలకి కట్టి కత్తి పట్టుకొని ఒక్క వేటుతో ఎండిన గెల బోద నరికేసాడు. తాడుని నిదానంగా వదులుతూ గెల కిందికి దింపేసాడు.

"నువ్వు మంచి పనోడివిరా! మీ నాన్న చెపుతుంటే ఏమిటో అనుకున్నా గానీ సులువు తెలిసినోడివే" అన్నాడు గంగాధరరావు.

మరో చెట్టు గెల నరకడానికి ఎక్కే ముందు, "అయ్యగారో! గేదెల్ని బయట కట్టేసొచ్చాను. ఎండలో ఉంటాయి. ఒక గేదకి పాలు తియ్యాలి. ఒక్కసారి ఇంటికెల్లొత్తాను" అన్నాడు ప్రసాదు.

ఈ మాటల్లో గంగాధరానికి ఏదో తేడా వినిపించింది.

"అవున్రా, ఏం జదువుతున్నావు నువ్వు? " అని అడిగాడు గంగాధరరావు.

"పది పరీక్షలు రాసానండి"

గెలలు దించి, గెలల్ని ఇంటి వసరాలో జాగ్రత్తగా ఓ మూలనబెట్టి,

"ఇక నేనెల్లొత్తానండీ" అన్నాడు ప్రసాదు.

"ఒక పన్జెయ్యర ఎల్లేతప్పుడు. గరువు మీద సేనుకెల్లి... గంగరావిచెట్టు కాడ చెరుకు చేనుంది గదా, దానికి నీళ్ళెట్టాలి .చేలోకి గండికొట్టి మట్టి బోదుకి అడ్డమేసీ, వెళ్ళి నీ గేదెల పన్జూసుకుని మళ్ళీ రా"

ప్రసాదు మర్యాదగాను, స్థిరంగానే చెప్పాడు

"అటంతా తిరిగెళ్ళేతప్పటికి బోల్డుసేపు పడద్దయ్యగారు! గేదలు ఇంటిదగ్గర డొక్క లెగరేస్తూ ఉంటాయి. పాలు కేంద్రానికి తీసికెల్లాలి. ఆ పన్నైపోయాక గండి కొడతానండి" అన్నాడు ప్రసాదు.

అప్పుడే పాలవాడు వచ్చి పాలు పితుకుతున్నాడు గేదెలకి. తీసినపాలు కేంద్రానికి తీసికెళుతున్నారు ఇంట్లోంచి. తనెప్పుడెళ్లాలి, ఎప్పుడు కేంద్రానికి పాలుపొయ్యాలి- కంగారుగా ఉంది ప్రసాదుకి.

"ఆ గండి ఏసెల్లరా! సాయంత్రం నీళ్ళెట్టాలి!" అన్నాడు గంగాధరరావు.

మోటారు ఈ పక్క తడుపుకొచ్చేటప్పటికి సాయంత్రమవుతుందో, రెండ్రోజులౌతుందో ప్రసాదుకి తెలియనిది కాదు.

"నేను ఇంటికెల్లొచ్చి ఆపని జేత్తానండి" అని బయలుదేరిపోయాడు ప్రసాదు.

"ఎంట్రట్టా నీ మానాన నువ్వెల్లిపోతావ్? వినపట్టలా? లంజాకొడక!... వెళ్ళెళ్ళు- మళ్ళొస్తావుగా- ఎంత లెక్కలేనితనం, చెప్తా" అనుకున్నాడు మనసులో.

దారిలో లచ్చన కనిపించాడు ప్రసాదుకి. "ఎంట్రా కేకలేత్తన్నాడు మీ దొర" అన్నాడు.

"ఇంటి దగ్గిరెవుళూ లేర్రా! గేదెల్ని బయటకట్టేసాను. లోపల కట్టేసొస్తానంటే... పని తరవాత పని! సత్తానంటే కూడా ఈ పనిసేసి సావమంటార్రా బాబు" అంటూ పరుగులా నడుస్తున్నాడు ప్రసాదు.

## 5

**"పో**తురాజుని ఊళ్ళో గుడికాడ కట్టేసారంట" అనే కబురందగానే, మాలపల్లిలో చాలామంది కంగారుపడ్డారు. మొగుణ్ణి కట్టేసారని తెలియగానే మాలచ్చిమి ఎక్కడి పని అక్కడే విడిచిపెట్టి కొడుకు కోసం కబురెట్టింది.

ఈ సంగతి తెలుసుకొని పెద్దమాల రాఘవయ్య, మరో నలుగురు ఊర్లోకి బయల్దేరారు.

ఊర్లో రాముడి గుడి ముందు, నెత్తిమీద చేతులు పెట్టుకుని గొంతికి కూచున్నాడు పోతురాజు. ముఖంలో నెత్తురు చుక్క లేదు. ఎందుకు బతికున్నానా అన్నట్లు కూర్చునున్నాడు. శివరావు వాడిని ఒక్క తన్ను తన్ని, "నా కొడక, ఎప్పుణ్ణుంచి



సాగుతోందిరా ఈ యవ్వారం" అన్నాడు.

"ఆ లంజాకొడుకు అట్టా సెప్పండ్రా ! ఆ నా కొడుక్కి వాతలెట్టాలి. అప్పుడు బయటకొస్తదంతా" అన్నాడు అక్కడే అరుగు మీద కూర్చున్న తాతబ్బాయి.

అప్పటివరకూ తిట్టి తిట్టి వగరుస్తూ కూర్చున్నాడు గంగాధరరావు.

"అమ్మో! అమ్మో! ఎంత నమ్మానీ నా కొడుకుని. సొంత మనిషిలా చూసుకున్నాను. ఇంత ద్రోహమా!" అని మళ్ళీ లేచొచ్చి ఒక్క తన్ను తన్నాడు.

"అసలు ఆ నా కొడుకు చేతులు నరికి పారెయ్యండ్రా! మిగతా లంజాకొడుకులకి బుద్దొస్తది" అన్నాడు అటుగా వెళుతూ శ్రీరాములు.

ఎండిపోయిన బుగ్గలపైన, కణతల మీద నుండి చిన్నగా రక్తం చెమరుస్తోంది పోతురాజుకి. చెయ్యిమీద కఱ్ఱదెబ్బల కణుతులు తేలి కనిపిస్తున్నాయి.

వాణ్ణి ఇంకా చితకకొట్టేసేవాళ్ళే! రామకృష్ణయ్య, గంగాధరరావుని ఇంటికి పిలి



వాడి సంగతి ఊరందరికీ తెలుసు. ఎవరెవరికి తాటికింద కల్లు పోసాడో కూడా చిన్నకి తెలియదు. కానీ వాడి పెళ్లాం నాగరత్నం ఘటికురాలు.

పోతురాజు ఎన్ని కొట్టినా, "బుద్ధిలేక తీసాను. తప్పయ్యింది, నన్ను క్షమించండి" - అంటాడు గాని ఎందుకు తీసాడో చెప్పడు. ఎన్నిసార్లు తీసాడో చెప్పడు. ఎవరికి అమ్మాడో చెప్పడు. ఇవి కక్కించడానికి వాణ్ణి చావచితకకొట్టి ఉండేవాళ్లే! రామకృష్ణయ్య మాటలతో కాస్త ఆగారు.

గమళ్ల చిన్నోడి పెళ్లాం నాగరత్నం, మాలచ్చిమి గుడి దగ్గరికి ఒకేసారి చేరారు. బిక్కచచ్చిపోయి కూచున్న మొగుణ్ణి చూసి మాలచ్చిమి బావురుమంది. 'నీకీ దరిద్రబుద్ధి ఎప్పణ్ణుంచయ్యో' అని నోట్లో గుడ్డలు కుక్కుకుంది. ప్రసాదు బిక్కచచ్చిపోయి చూస్తున్నాడు. వాడికి తల కొట్టేసినట్లుగా ఉంది.

అప్పటికే రాఘవయ్యతో పాటు మాలపల్లి నుండి పదిమంది మగవాళ్లు చేరారు.

'మాలచ్చిమీ నువ్వెళ్లిపోయే, నువ్వెందుకిక్కడా' అని చిన్నగా చెప్పారు ఆమెతో. ప్రసాదు అక్కడ నిలబడలేక దూరంగా వెళ్లి నిల్చొన్నాడు.

"ఏమే నాగరత్నం! చెప్పు ఈ నా కొడుకు ఎన్నిసార్లు నీ దగ్గర ఇట్టా తాగడం మొదలెట్టాడు. చెప్పు లంజ, లేదంటే నిన్నూ కట్టేస్తామిక్కడ" అన్నాడు సత్యనారాయణ.

నాగరత్నం ఏమీ మాట్లాడలేదు.

"ఏంటే నోరు మెదపవు లంజ. ఎంతకాలం నుండి సాగుతోందిది" అన్నాడు మళ్లీ.

"లంజ గింజ అనబాకండి. మీ పెళ్లాలననుకోండి. నన్నుకాదు" అంది కరుగ్గా.

కరుగ్గా వస్తున్న ఆడమనిషి మాటలు

పించి- "పిచ్చి లంజాకొడకల్లారా, ఆడు పుటుక్కున సస్తే ప్రాణాల మీదకొస్తదిరా! ఇదివరకు రోజులు కాదు. ఆళ్ళు సంగాలెట్టేస్తన్నారు. ఎవుడో కదిపాడంటే లేనిపోని తలనెప్పులు. ఇష్టమొచ్చినట్టు కొట్టబాకండి. అదీ వీధిలో పట్టుకుని" అని చెప్పాడు.

అప్పటికే కోమటింటివాళ్ళని అడిగేశారు- వడ్లుగాని, ఇంకేమైనా గాని పోతురాజు మీకు అమ్మాడా అని.

గురవయ్య సెట్టి, "ప్రాణం మీది కొచ్చినపుడు అబద్ధమెందుకు చెబుతాను. నాకు ఆడేమీ అమ్మలేదు. ఆడికి సుట్ట, బీడీ అలవాటులేదు. ఎప్పుడన్న ఒక పావలిచ్చి చిరుతిండి కొంటాడంతే" అని చెప్పాడు.

దానితో వీళ్ళకి వెంటనే మరో అనుమానం వచ్చింది. 'గమళ్ల చిన్నోడ్ని పిలవండ్రా' అన్నారు. గమళ్ల చిన్నోడొచ్చాడు.

"అయ్యా! గీసుకొచ్చి అక్కడ పడెయ్యటమే! నా కరుసులకి ఇంతని పుచ్చుకోవటమే తప్ప అదే సూత్తదండి" అన్నాడు గమళ్ల చిన్న.

దూరంగా నిలబడ్డ ప్రసాద్‌కి వినిపించి ఇటువైపు తిరిగాడు. గమళ్ల నాగరత్నం!

ఆ మాట తీరుకి, ఆ సమాధానానికి వెంటనే నోరు పెగుల్చుకోలేకపోయారు. అప్పుడే ప్రెసిడెంట్ రామకృష్ణయ్య ఇంట్లోనుండి వీధిలోకి వచ్చాడు. అతని రాకకి అనుగుణంగా జనం సర్దుకున్నారు. కరణం కూడా అక్కడికి వచ్చాడు.

"నాగరత్నం! అసలేం జరిగింది చెప్పవే" అన్నాడాయన.

"అప్పుడప్పుడు నా దగ్గరికి తాగడానికి వస్తాడు. అరువోత్తాను. పాపం పున్యం నేనెందుకు దాచుకోవాలి? ఒకసారి చిన్న వడ్లమూటిచ్చాడు.

మొన్నీమద్దెనే రెండు మరకాలు మినుములిచ్చాడు. అంతే బాబు" అని దండం పెట్టి వెళ్లిపోయింది నాగరత్నం.

"ఏంరా నువ్వు జెప్పు" అన్నాడు రామకృష్ణయ్య. అది చెప్పిందంతా నిజమేనన్నట్లు తలాడించాడు పోతురాజు.

పెద్దమాల రాఘవయ్య కలగజేసుకున్నాడు.

"చచ్చిన పాముని ఏం చంపుతారు బాబూ. తాగుడికి కక్కుత్తి పడ్డాడు. యెదవ నా కొడుకు! చిన్నప్పుడు నుంచి మీరు సూత్తన్నదే ఆణ్ణి. ఈ మద్దెనే ఎట్టా అలవాటయ్యిందో అలవాటయ్యింది. బాబూ మరి మీ దయ" అన్నాడు.

"రాఘవయ్యా! నేను పోలీసులకి రాసేనంటే ఏం జరుగుతుందో నీకు తెలుసు. వీణ్ణిగాని వదిలేసామంటే ఇక రైతులం, నాలుగెకరాల నేలున్న వాళ్లం బతగ్గలమా! ఇవన్నీ కాదు, ముందు పోలీసులకి అప్పచెప్పేయండి. వాళ్లు చూసుకుంటారు" అన్నాడు కరణం.

"అయ్యా! పెద్దోళ్లు తమరు. కనికరించాలి. ఆడేమో నలుగురు బిడ్డలున్నోడు కూడా గాదు. అడెట్టాటోడో తమకి తెలియంది కాదు. మీ కాళ్లట్టుకుంటాం ఆణ్ణి వొదిలెయ్యండి" అని ప్రాధేయపడ్డాడు పెద్దమాల రాఘవయ్య.

ఈ గొడవలో రాసంసెట్టివాళ్ల కుటుంబం జోక్యం చేసుకోలేదు. గొల్లలు నలుగురైదుగురు వచ్చినా, చూసి 'ఏదో కక్కుర్తి పడ్డాడు లేరా' అనుకుని వెళ్లిపోయారు.

సుబ్రమణ్యశాస్త్రి సైకిల్ మీద వెళుతూ విషయం తెలుసుకొని వెళ్లిపోయాడు. మాలపల్లి నుండి ఒక్కొక్కరే పోగవుతున్నారు. మాదిగలూ నలుగురైదుగురు చేరారు.

"ఎంత జరిగిందో, ఎప్పట్నుంచీ జరుగుతందో మనకి తెలవదు. ఇవ్వాళ బైటపడిందిగాబట్టి ఇది చెప్పుకుంటన్నాం. ఆడు సూత్తే నోరు మెదపడంలేదు. కరణంగారు చెప్పినట్టు పోలీసులు తీసికెళ్లడమే మంచిది" అన్నాడు శివరావు.

బ్రతిమిలాటలు, బామాలడాలు, కాళ్ళ మీద పడడాలు, కన్నీళ్ళు అయ్యాక వెయ్యి రూపాయల తప్పు కట్టేటట్లుగాను, పోలీసు కేసు పెట్టకుండాను మాట్లాడుకుని పోతురాజుని తీసుకొచ్చేసారు.

నడిచొస్తున్న పోతురాజు, గేదెనమ్మితే ఎంతొస్తుందో ఆలోచిస్తున్నాడు.

ప్రసాదు వేసవిలో చేసిన పనికి కూలి, మాలచ్చిమి గంగాధరరావు చేలో చేసిన పనికి కూలీ దొంగతనంలో కలిసిపోయాయి.

★ ★ ★

ప్రసాదు పదో తరగతి సెకండ్‌క్లాసులో పాసయ్యాడు. సుందరం కూడా సెకండ్ క్లాసులో పాసయ్యాడు. శివకృష్ణ థర్డుక్లాసులో పాసయ్యాడు. వెంకటేశ్వరమ్మ పాసయ్యింది. రాసంసెట్టి నాగేశ్వరరావు తప్పాడు. గాయత్రి ఫస్టు క్లాసులో పాసయింది. ఊరంతా, మాలపల్లి అంతా పదో

తరగతి కలకలం. పోతురాజు ఇంట్లో అవమాన భారం.

ప్రసాదుకి పాసయ్యానన్న ఊసులేదు. ధ్యాసాలేదు. బజారులో వాళ్ళ నాన్న తిన్న తిట్లు, కాచిన దెబ్బలు ఇంకా పచ్చిగానే ఉన్నాయి. ఆ పచ్చితనంలో ఈ పాస్ పాసే కాకుండా పోయింది. తండ్రిని ద్వేషించనూ లేడు. అవమానపడడం మాననూ లేడు.

★ ★ ★

ప్రసాదు పామర్రులో ఇంటర్మీడియట్‌లో చేరాడు. పెద్దమ్మ దగ్గర ఉండి సైకిలు మీద కాలేజికి వెళ్ళి వస్తున్నాడు.

పిల్లలెవరూ తన దగ్గరుండకపోవడం, తను ఒంటరిగా ఉండవలసి రావడంతో, దమయంతమ్మ ప్రసాదుని చదివిస్తానని తెచ్చి పామర్రులో చేర్చింది.

దమయంతమ్మ పెద్దకొడుకు బి.ఎస్.ఆర్.బి. పాసై ఎస్.బి.ఐ.లో క్లర్కుగా ఆదిలాబాద్‌లో చేరాడు. రెండోవాడికి సెకండరీ గ్రేడ్ ట్రైనింగు పూర్తయి, తిరువూరు వైపు ఎలిమెంటరీ స్కూల్లో చేరి అక్కడే ఉంటున్నాడు. కూతురు బియస్సీ నోబుల్ కాలేజిలో హాస్టల్లో ఉండి చదువుకుంటోంది బందర్లో. దీనితో దమయంతమ్మకి ఒక ఆసరా అవసరం అనిపించింది.

పదో తరగతి పాసైన ప్రసాదుని ఇంకా చదివించాలని ఉంది మాలచ్చిమికి. ఎక్కడికి పంపాలి, ఎంత ఖర్చవుతుంది అనే ఆలోచనలో ఉంది. పోతురాజు ఎప్పటిలాగే ఎదుటివాళ్ళు ఇచ్చిన సందేశాలకి అనుగుణంగానే శరీరాన్ని పనిచేయిస్తున్నాడు. కొడుకుని ఏం చెయ్యాలనేది అతనికి పట్టని విషయం. ఇక్కడే కూలి చేసుకుని బ్రతుకుతాడు. లేదూ ఏదో చేస్తాడు. కనీసం అటు వైపుగా ఆలోచన కూడా లేదు పోతురాజుకి. అక్క దగ్గర పెట్టాలనే ఉద్దేశం మాలచ్చిమికి లేదు. పైసా పైసా కూడబెట్టినదంతా దొంగతనం

## కొత్తగాలి...

**కంప్యూటర్‌లో తల**
**ఏం జరుగుతుందో ఇవతల**
**కళ్ళు బయటకు తీస్తే**
**చీకటి వల!**

*–డాక్టర్ ఎం. విజయగోపాల్, విశాఖపట్టణం*

తప్పుకింద కట్టేసింది. కాస్త తక్కువైతే చెవికమ్మలు తాకట్టు పెట్టింది. కొడుకుని చదివించడానికి డబ్బు సమస్య. ఎంతవుతుందో తెలియదు. దమయంతమ్మే ఈ ప్రస్తావన తేవడంతో మరోమాట లేకుండా ప్రసాదుని పంపింది.

ప్రసాదు, వాళ్ళ పెద్దనాన్న సైకిలు వేసుకుని పామర్రు వెళ్ళి వస్తున్నాడు.

పోతురాజు దొంగతనం గొడవ తరువాత, వారం రోజులు ఇంట్లో నుంచి బయటకు రాలేదు. ఆ తరువాత గేదెల్ని ఊడదీయడం ప్రారంభించాడు. తాగుడు కోసం, పొట్టులో రెండు మూటలు కప్పిపెట్టడం, గంగాధరరావు దాన్ని బజారులో పెట్టడం, ముల్లు గుచ్చుకుంటున్నట్టుగా ఉంది. ఉదయం నుండి సాయంత్రం వరకూ గేదెల్ని మేపుకు రావడంలోనే గడిపేసేవాడు.

మాలచ్చిమి చాలాసార్లు నిలదీసింది- తాగడానికి డబ్బులెక్కడి నుంచి వస్తున్నాయని. అప్పుడప్పుడు దాని కూలి డబ్బులు తీసుకున్నా అదెంతో దానికి తెలుసు. ఇవాళ ఈ రకంగా బయటపడడంతో ఊరిలో కంటే ఇంటి దగ్గర తలెత్తుకోవడం మరీ కష్టంగా ఉంది. ఒకరోజు పెళ్ళామూ, కొడుకూ తిట్టేస్తే పోతురాజు బాధ కొంత తీరిపోను. కానీ వీళ్ళు కూడా ఈ పని

## కొత్తగాలి...

**సిరా ఉత్తుత్తిగా స్రవిస్తే**
**వేల కవితలు**
**విద్యుత్‌లా ప్రవహిస్తే**
**మేలు కవితలు**

-వై.కె. మూర్తి, విజయవాడ

చెయ్యలేదు.

ఆ రోజు వస్తూ వస్తూ రాఘవయ్య అన్న మాటొక్కటే పోతురాజుకి ఊరటనిచ్చింది. "ఒరే నీ కష్టమంతా ఆ కొంప మొకాన్నెట్టావురా! ఆ మాత్తరం దానికి నిన్ను ఒక మాటనుకుని ఊరుకోలేక పోయార్రా! రెండు మరకాల మినుములకి ఇంత చెయ్యాల్ర? ! పగలనక, రాత్రనక చేత్తాం, ఆ మాత్రం లేదా మనకి! పోనీరా ఆడి పాపాన ఆడేపోతాడు. అయినా, పిచ్చి లంజాకొడక దీనికెట్టా అలవాటు పడ్డావురా!"- అన్నాడు రాఘవయ్య.

పోతురాజు, ఆ ఇంటికోసం ఎంత కష్టపడ్డాడో తలుచుకుని బాధపడ్డాడు. ఆ గేదెలు, వాలుకొమ్ములెద్దు, రోజూ తన దగ్గరకొచ్చి చెయ్యి నాకే కోడెగిత్త, తనచేత గంగడోలు దువ్వించుకునే దోరెద్దు ఆ పెరట్లో ఉన్న ప్రతి అంగుళం, అన్నీ గుర్తొచ్చాయి వాడికి. ఒకసారి వెళదామా అని కూడా అనిపించింది.

ఈ విషయంలో పెళ్ళాం ఏమీ అనకపోవడం పోతురాజుకి మాలచ్చిమి మీద మరింత అభిమానం పెరిగింది. అది ఏది చెబితే అది చెయ్యాలనుకున్నాడు.

గంగాధరరావుకి ఒక్కసారిగా కాళ్ళూ చేతులు ఆడనట్లుగా ఉంది. గాలితో కబురంపితే కళ్ళతో చేసుకొచ్చేవాడు పోతురాజు. ప్రస్తుతం గంగాధరరావుకి అంతా అడ్డంగానే ఉంది. ఉన్న బుడ్డోడికి ఈ పనులు చెయ్యడంరాదు. వెంటనే పాలేరు దొరకడు. గంగాధరరావు పని చెప్పగలడు గాని పనేం చెయ్యగలడు? కూలికి మనుషులని పిలుస్తున్నాడు. కాసేపు ఉండండ్రా అంటే పొద్దు పోయిందంటారు వాళ్ళు. చాలా చిక్కుగా ఉంది. ఒక నెల గడిచింది.

ఇక ఒకరోజు తిరుపతితో కబురంపాడు గంగాధరరావు, పోతురాజుని రమ్మని.

"ఎందుకంట"? అన్నాడు పోతురాజు.

"నాకేం తెలుసురా? రమ్మని చెప్పమన్నాడు" అని వెళ్ళి పోయాడు తిరుపతి.

దొర కబురు పెడితే వెళ్ళకుండా ఉండడం సాధ్యం కాదు. ప్రాణమంతా కూడ దీసుకుని బయలు దేరాడు చేతి కర్ర తీసుకుని పోతురాజు.

ఈ నెల రోజులుగా వాడు ఊర్లో అడుగు పెట్టింది లేదు. కొడుకు పామర్రులో చేరడానికి, సర్టిఫికెట్లకి ప్రసాదు, మాలచ్చిమే తిరిగారు. మాలచ్చిమే వెళ్ళి, పామర్రులో చేర్చి వచ్చింది. తాను చిన్నప్పటి నుండి తిరిగిన దారి, అణకువగా ఒదిగి ఒదిగి నడిచిన దారి, ఈసారి గంగాధరరావు ఇల్లు చేరడానికి కొత్తగా అనిపిస్తోంది. ప్రాణం బిక్కచచ్చిపోయింది. గుమ్మంలోకి వెళ్ళకుండా, తన వచ్చినట్లు కనపడేటట్లుగా వీధిలో గుమ్మం ముందు నిల్చున్నాడు.

అమ్మగారు చూసింది. "ఏరా పోతూ! కొత్తోడిలా బయట నిలబడతావేంట్రా? లోపలికిరా!" అంది.

"ఏడీ ఆడొచ్చాడా? " అంటూ బయటకొచ్చాడు గంగాధరరావు. "ఒరే, చేసిందేదో చేసావు! పోనీయ్ అది. ఇవ్వాళ నుంచి నీపని నువ్వు చేసుకో! రా! యెదవ! ఏదో నాలుగు చుక్కల కోసం కక్కుర్తి పడ్డావ్. ఇక ఎప్పుడైనా కావాలంటే నన్నొక రూపాయడిగి తీసుకో! నీ సంగతి నాకు తెలవదంట్రా!" అన్నాడు.

పెరట్లోకెళ్లి ఎద్దుల్ని, చప్పికొమ్ముల గేదెని చూడాలనిపించింది. పోతురాజుకి. ఇక్కడ ఏదీ తనది కాదు.

పిలిచిన వెంటనే పోతురాజు వచ్చి నందుకు గంగాధరరావుకి, తన ఆలోచన మీద నమ్మకం కుదిరింది. 'రాక ఎక్కడికె ళతాడు లంజాకొడుకు? , కడుపు మాడదూ అందుకైనా వస్తాడు' అనుకున్నాడు.

తలకి చుట్టుకున్న తుండుగుడ్డ తీసి భుజంమీద వేసుకున్నాడు పోతురాజు. "పనిలోకి రానండే, ఇక పాలేరుతనం సెయ్యను" అని ఆలస్యం లేకుండా వెనక్కి తిరిగాడు. ఈసారి గుమ్మం దాటుతుంటే పోతురాజుకి ఏ బరువూ భారమూ లేదు. ఇన్నేళ్ళుగా ఈ వీధి గుమ్మం దాటుతున్న పుడు, చెవులు, ఆ ఇంటికే అప్పజెప్పి కదిలేది శరీరం - ఏదైనా పనిమాట విన బడుతుందా అన్నట్లు. ఈసారి ఆ భారా లేమీ లేవు. స్థిరంగా వీధిలోకి వచ్చాడు.

మాలచ్చిమికిక్కడ ఒళ్ళు ఒళ్ళులో లేదు. కనీసం తనతో మాట కూడా చెప్పకుండా కదిలిన మొగుణ్ణిచూసి, ఒళ్ళంతా చీమలు, జెర్రులు పాకినట్లుంది. ఈ ముండా కొడు కెందుకెళ్ళాడని కుతకుతలాడిపోతోంది.

భారం దిగిపోయిన మనిషిలా వస్తు న్నాడు పోతురాజు. ఈ మధ్యకాలంలో ఎప్పుడూ అంత దిలాసాగా లేడతను. అతన్ని చూస్తుంటే ఈసారి మాలచ్చిమి ఒంట్లో కంపరం పుట్టడం లేదు.

దిలాసాగా కర్రక్కడ పడేసాడు పోతు రాజు.

"నాపని నేను జేసుకోవాలంటే! నీయమ్మ! పాతికి బస్తాలు అపరాలు నూర్చాను ఈ చేత్తో! దోసిడెట్టాడా ఎత్తికెల్ల మని? ! కల్లంమీద రెండో దులుపుకొచ్చిన మినుములు పట్టుకుని ఎన్ని మాటలన్నాడే నన్ను! చెప్పా, నీ కొంపలో అడుగెట్టనని చెప్పా! నాపని నేను జేసుకోవాలంట! ఆలీ బిడ్డంతా కష్టపడ్డాం. ఒక్కరూపాయి కూలి చ్చాడూ? చెప్పా! అందుకే రానని చెప్పా! తెగేసి చెప్పా!" అన్న మెట్టవే గేదల్ని తో లుకెల్తా" అన్నాడు.

మొగుడి మీద పిచ్చి ఇష్టం కలిగింది మాలచ్చిమికి. అన్నమెట్టవే అని తొలిసా రిగా అడిగినట్టుంది. ఆ రాత్రి పోతురాజు దగ్గరకెళ్ళి పడుకుంది మాలచ్చిమి.

★ ★ ★

ప్రసాదుకి, వాళ్ళ నాన్నని మళ్ళీ పాలేరు తనానికి రమ్మని పిలిచారనీ, పోతురాజు రానని చెప్పాడనీ తెలిసినప్పుడు ఇంతవ రకూ ఉన్న దిగులు పోయింది. ఏదో సాధించినట్లుగా ఉంది. పాటిపూడిలో ఉన్నపుడు క్లాసు పుస్తకాలు మినహా మరో పుస్తకం ప్రసాదుకి తెలీదు. పెద్దమ్మవాళ్ల ఇంటిదగ్గర ఇంకా చాలా పుస్తకాలున్నాయి. ఒక్కొక్క పుస్తకమే చూస్తూ వాటిని చద వడం ప్రారంభించాడు. అర్ధమయినంత అర్ధమవుతోంది.

ఆదివారం. వాళ్ళ పెద్దమ్మతోకలిసి పొలం చూడడానికి వెళ్ళాడు. పీతకన్నా లుంటే తొక్కేసాడు. చిన్న చిన్న గండ్లు, పెద్దమ్మ చెప్పకుండానే కట్టేసాడు. నీళ్ళు కింద కొచ్చేగండి, నీళ్ళు వచ్చే బోదు చూసు కున్నాడు.

ప్రసాదుకి కావలసిన పుస్తకాలు, బట్టలు దమయంతమ్మే కొంది. రెండెకరాల ఆసా మికి, ఇద్దరు ఉద్యోగస్తుల తల్లికి ఇది కష్ట మైన పని కాదు.

ఇపుడు ప్రసాదుకి చదువుకోడానికి బోలె డంత సమయం. కొత్త ఊరు కావడంతో పరిచయాలు కూడా అంతగా లేవు. కురు మద్దాలి నుంచి హైస్కూలు చదువుకి పామర్రు వెళ్ళేవాళ్ళు ఎక్కువ. ఇంటర్మీడి యట్‌కి ఎక్కువమంది బందరు వెళ్ళిపో తారు. ఒక ఇద్దరున్నా, వాళ్ళతో ప్రసాదుకి ఇంకా పరిచయం పెరగలేదు.

ప్రసాదు పెద్దమ్మ ఇంట్లో ఉన్న పుస్తకాలు చూస్తున్నాడు. ఒకరోజు జి.వి.కృష్ణారావు నవల 'పాపికొండలు' కనిపించింది. టెక్స్టు పుస్తకాలు తప్ప మరొకటి చదవడం తెలియని ప్రసాదు తొలిసారిగా ఒక నవల చదవడం ప్రారంభించాడు. ముందు నవల కదలలేదు. తరువాత వదలలేదు. కొత్తలోకంలోకి వెళుతున్నట్లుగా అనిపించింది. ఆ నవలంతా పూర్తిగా చదివాడు.

నవల పూర్తయ్యాక ఇలాంటివి ఇంకా చదవాలనిపించింది. ఆ నవల కవర్ పేజీ తరువాత ఒక కాగితం అంటించి ఉంది. 'జిల్లా కేంద్ర గ్రంథాలయ సంస్థ, మచిలీపట్నం, కృష్ణాజిల్లా' అని రాసి ఉంది. దాని మీద కురుమద్దాలి గ్రామ పంచాయతీ స్టాంపు వేసి వుంది. 'పుస్తకం ఇచ్చిన తేదీ', 'తిరిగి చేరవలసిన తేదీ' అని రాసి ఉంది.

"పెద్దమ్మా ఈ పుస్తకం ఎవరిది? దీని మీద లైబ్రరీ ముద్ర ఉంది" అని చూపించి అడిగాడు తెల్లారి లేచాక.

"నువ్వు పాలు పొయ్యటానికి ఎల్తావు కదయ్యా! అక్కడ పంచాయతీ ఆఫీసుంది. అక్కణ్ణుంచి అప్పుడప్పుడు పుస్తకాలు తెచ్చుకుని రాత్రిళ్ళు చదువుకునేవోడయ్యా మీ పెదనాన. అక్కడదనుకుంటా!" అంది దమయంతి.

హైస్కూల్లో చదువుకునేటప్పుడు కూడా "లైబ్రరీ ఉంది. దాన్ని ఉపయోగించుకోండి" అని హెడ్మాస్టారు చెబుతూ ఉండేవాడు. కానీ, ప్రసాదు గానీ అతనితో తిరిగే విద్యార్థులు గానీ ఎప్పుడూ ఆ ప్రయత్నం చెయ్యలేదు.

★ ★ ★

ఒక విలువగా జ్ఞానద్వారాలు మూసేసిన ఈ దేశపు అమానవీయ వారసత్వంలో- జ్ఞానద్వారాలు తెరుచుకుని శతాబ్ది దాటిన తరువాత- చట్టం ఎపుడో తనకి ద్వారాలు తెరిచినా, మూసిన సంప్రదాయపు తలుపులు తోసుకుంటూ- ఒక జ్ఞానభాండాగారంలోకి... తనంత తానుగా కేవలం తృష్ణతో, జ్ఞానతృష్ణతో, నల్లగా నిగనిగలాడుతున్న నూనుగు మీసాల నూత్న యవ్వనుడు అయిన ప్రసాదు అడుగు పెట్టాడు.

పంచాయతీ ఆఫీసులో ఉన్న గ్రంథాలయంలోకి అడుగు పెట్టాడు ప్రసాదు. అక్కడ ఓ పదిమంది వరకూ కూర్చుని పేపర్లు చదువుతున్నారు. అక్కడున్న మూడు అద్దాల బీరువాల్లో పుస్తకాలున్నాయి. అక్కడ ఎవర్ని అడగాలో ప్రసాదుకి తెలియదు. పంచాయతీ గుమస్తానా! లైబ్రేరియన్ ఉంటాడా! కరణం గారినా! ప్రసాదుకి తెలియదు.

ప్రసాదుకి పేపర్ చదవడం ఎప్పుడూ అలవాటు లేదు. తొలిసారిగా, టేబుల్ మీద ఉన్న పేపరు, నల్లని అక్షరాలతో 'ఆంధ్రపత్రిక' తీసుకుని చదవడం మొదలెట్టాడు. మెయిన్ హెడ్డింగ్- 'ముఖ్యమంత్రిగా టి. అంజయ్య ప్రమాణ స్వీకారం' అని రాసి ఉంది. ముఖ్యమంత్రి చెన్నారెడ్డి కాదు. ఇప్పుడు మన ముఖ్యమంత్రి అంజయ్య అనుకున్నాడు. కొంచెంసేపు చూసి, 'ఈనాడు' దినపత్రిక తీశాడు. నల్లటి అక్షరాలలో గీతలు గీతలు. కొత్తగా ఉంది. ఎడమచేతివైపు కాలమ్‌లో 'టూకీగా' అని హెడ్డింగ్ ఉంది. ఆసక్తిగా చదివాడు.

అక్కడ ఒక కుర్చీ, టేబులు ఉన్నాయి. ఆ కుర్చీలోకి ఎవరైనా వస్తారేమోనని, మధ్య మధ్యలో అటు చూస్తూ కూర్చున్నాడు.

అక్కడ- ఊర్లో నడుస్తున్నప్పుడు, బెరుకుగా భయంగా ఏమైనా తప్పు చేస్తున్నామేమో, ఎవరైనా మనల్ని ఏమైనా అనుకుంటారేమో, ఇంకెవరైనా 'ఒరే' అని

పిలుస్తారేమోనని అనుమానం అనుమానంగా నడవవలసి వచ్చేది. ఇక్కడి మాలపల్లి జనంలో ఆ బెరుకు కనిపించ లేదు ప్రసాదుకి. కొద్దికొద్దిగా తనూ బెరుకు పోగొట్టుకుంటున్నాడు.

★ ★ ★

ఉత్తరం చూసుకుని పాటిపూడి బయలు దేరాడు ప్రసాదు- గొంతానమ్మ పండుగకి. పెద్దమ్మని కూడా రమ్మని పట్టుబట్టాడు గానీ, "గేదెలు ఇవన్నీ ఉన్నయ్ కదయ్యా, నువ్వెళ్ళి రా"అంది. ప్రసాదు, దసరా సెలవులకి కూడా వెళ్లలేదు. వాళ్లమ్మ రెండుసార్లు, నాన్న ఒకసారి వచ్చి వెళ్లారు.

ఈసారి ఇన్ని రోజుల తరువాత ఊరికెళుతుంటే ప్రసాదుకి చాలా ఉత్సాహంగా ఉంది. జీవితంలో తొలిసారిగా ఊరెళ్లడంలో మజ్జా అనుభవిస్తున్నాడు. ఒకటి రెండుసార్లు పెద్దమ్మ దగ్గరికి ఇదే ఊరు వాళ్లమ్మతో కలిసి వచ్చాడు. అంతకు మించి ఎపుడూ దూరపు ఊర్లు వెళ్లి రెండు రోజులుండి వచ్చింది లేదు. వాడికే కాదు, ఆ మాలపల్లిలో చాలామంది పరిస్థితి అదే. అందుకే ప్రసాదుకి చాలా ఉత్సాహంగా ఉంది. ఎప్పుడు తెల్లారుతుందా అని ఎదురు చూసాడు.

ఇంటిదగ్గర పనులు చకచకా చేశాడు. పొలంకి వెళ్లి వచ్చాడు. భోజనం చేసి తయారయ్యాడు. పెద్దమ్మ వాడి జేబులో ముప్పై రూపాయలు పెట్టింది. "మీ అమ్మనొక జాకెట్టు గుడ్డ కొనుక్కోమనరా" అని చెప్పింది.

ప్రసాదు బారులాగు తొడుక్కుని మొదటిసారిగా సొంత ఊరు వస్తున్నాడు. కాళ్లకి రెక్సిన్ కవర్‌తో ఉన్న చెప్పులు. ప్లాస్టిక్ క్లాత్‌తో కుట్టిన హేండిల్ ఉన్న సంచి చేత్తో పట్టుకున్నాడు. మొవ్వలో బస్సు దిగాడు. ఒక డజను అరటి పళ్లు కొన్నాడు. పది చక్కిడాయలు వాళ్ల నాన్న కోసం కొన్నాడు. ఫ్యాన్సీ షాపులో వాళ్ళమ్మకి తిలకం సీసా కొన్నాడు. 'పాటిపూడి బస్సు వస్తుందా?' అని అక్కడ రిక్షాలవాళ్లనడిగాడు. 'కాసేపట్లో వస్తుందని' చెప్పారు వాళ్లు. అంతలో బస్సు రానేవచ్చింది. ఎక్కి కూర్చున్నాడు. బస్సు ఊరి పొలిమేరల దగ్గరకొచ్చేటప్పటికి ప్రసాదులో మళ్లీ 'మాలజంకు' వచ్చేసింది. మధ్యాహ్నాపుటెండ. బస్సు దిగాడు. కొత్త బట్టలు. ఇదువరటికంటే కాస్త పొడుగనిపిస్తున్నాడు. జుత్తు పెరిగింది. కొత్తరకం క్రాప్ వేయించుకున్నాడు. ఎవరైనా ఉన్నారేమో అని కాస్త ఆరాగా చూసి కిందికి దిగాడు. ఆ బస్సులో తన ఊరివాళ్ళు ఎవ్వరూ లేక పోవడం అదృష్టం అనుకున్నాడు.

చెప్పుల్ని తీసెయ్యాలా ఉంచాలా- సంది

## తేడా ఏమిటో?

ఓ చోట రెడ్ సిగ్నల్ ఉన్నా కూడా కారుడ్రైవర్ ఆపినట్లు ఆపి నిదానంగా వెళ్లిపోయాడు. కొద్ది దూరం పోయిన తర్వాత ఓ పోలీసు వెంటాడి ఆ కారును ఆపేశాడు. తననెందుకు ఆపారని డ్రైవర్ అడిగాడు. సిగ్నల్ పడ్డప్పుడు ఆపకుండా ఎందుకువచ్చావని ప్రశ్నించాడు. 'నిదానంగా కారును ముందుకు నడుపుకుంటూ రావడానికీ, ఆపడానికీ పెద్ద తేడాలేదు కదా?' అన్నాడు డ్రైవర్. వెంటనే ఆ పోలీసు లాఠీతో డ్రైవర్ తలమీద నెమ్మదిగా బాదడం ప్రారంభించాడు. తర్వాత కొట్టడం ఆపేశాడు. 'నెమ్మదిగా బాదడానికీ, బాదుడు ఆపడానికీ తేడా ఉందో లేదో తెల్సింది కదా?' అన్నాడు.



గ్దంలో పడ్డాడు. వీధిలో ఎవ్వరూ కనిపించడం లేదు. బెరుకు బెరుకుగానే గబగబ నడవడం ప్రారంభించాడు. రామాలయం దగ్గర ఒకరిద్దరు తాళ్లు పేనుకుంటూ కూర్చున్నారు. ఒకరిద్దరు గుమ్మాల్లోంచి చూసారు కానీ ఎవరూ పట్టించుకోలేదు. పమిడేశ్వరరావు ఇంటివైపు మలుపు తిరుగుతాడనే లోపు,

"ఎవరింటికి బాబూ" అన్నాడు కాశీరావు- పేపరు చదువుతూ.

ప్రసాదు ఒక్కసారి కంగారు పడ్డాడు.

"పోతురాజింటికండి" అని నాలుక కరుచుకున్నాడు.

"పోతుగాడింటికా ఎందుకు? ఆహాఁ మాలోళ్ల పండగ్గా!" అని యధాలాపంగా అంటూ చూసి, "ఒరే నువ్వు పోతుగాడి కొడుకువి కదూ! లంజాకొడక, నీ పేరు చెప్పొచ్చుగా! ఏంట్రో! కాళ్లకి చెప్పులు, పొడుగు లాగు, చాలా వచ్చిందే యవ్వారం!"

ఈ మాటల తర్వాత భయం పోయింది ప్రసాదుకి. "ఎల్తన్నానండే" అని అతని మాట కోసం చూడకుండా నడక సాగించాడు.

సుబ్రహ్మణ్యశాస్త్రి సైకిలేసుకొస్తూ ఎదురు పడ్డాడు. "ప్రసాదువి కదూ" అన్నాడు.

"అవునండీ!"

"ఇంటర్మీడియట్‌లో చేరావటగదా! ఎలా ఉందేవిఁటి చదువక్కడ!"

"బానే ఉందండి"

"ఏం గ్రూపు తీసావేమిటి? !"

"హెచ్.ఇ.సి"

"అదే మెరుగులే నీలాంటి వాళ్లకి. ఇంటర్మీడియట్‌లో పాఠాలు తెలుస్తున్నాయా నీకు? !"

"తెలుస్తున్నయ్యండి"

"చదువుకుంటున్నావు గానీ వాక్శుద్ధి రాలా! అది జన్మతః రావాలి. పో, పో, గవర్నమెంటు అంతా మీకేగా!" అని వెళ్లి పోయాడు.

ప్రసాదుకి పామర్రులో బయలుదేరినప్పటి ఉత్సాహం ఇక్కడ లేదు. పమిడేశ్వరరావు ఇంటి మలుపు తిరిగి కరంటు స్తంభం దాటి మాలపల్లి డొంకలో అడుగు పెట్టేంత వరకూ ప్రసాదు మనసు కుదుట పడలేదు.

కాస్త రెండడుగులు వెయ్యగానే, లయబద్ధంగా డప్పుదరువు వినిపిస్తోంది. ఊరు తననే ఆహ్వానిస్తున్నట్లుగా ఉంది ఆ దరువు. ఆ వాయిద్యపు సౌరు ప్రసాదు అవమానపు హోరుని మరిపించింది.



'నిమ్నజాతుల వైతాళికుడు, హరిజనోద్ధారకుడు, భారత రాజ్యాంగ నిర్మాత, అభినవ మనువు, ప్రపంచ మేధావి డా॥ బి.ఆర్. అంబేద్కర్, ఎమ్.ఎ., పిహెచ్.డి., డి.లిట్, డి.ఎస్.సి, జె.పి. బారెట్లా గారి 24వ వర్ధంతి సభ పామర్రు సెంటరులో తేదీ 6.12.1980న జరుపబడును'- ఈ కరపత్రాన్ని జాగ్రత్తగా జేబులో పెట్టుకున్నాడు ప్రసాద్.

ప్రసాదు అంబేద్కర్ పేరు విన్నాడు. ఆయన హరిజనుడని విన్నాడు. అంతకు మించి అంబేద్కర్ గురించి ప్రసాదుకి ఏమీ తెలియదు.

కాలేజికి వెళ్ళాక అదే కరపత్రం

పట్టుకున్న తన క్లాసుమేటు మోహనరావుని అడిగాడు ప్రసాదు.

"అంబేద్కరేం చేశాడు? " అని.

మోహనరావు చాలా విచిత్రంగా చూశాడు ప్రసాదు వంక.

"నీకు అంబేద్కరేం చేశాడో కూడా తెల వదా? ... ఒరే నువ్వు, నేను ఈ క్లాసులో కూర్చుని పాఠం వింటున్నామంటే అది అంబేద్కర్ చలవేరా? " అన్నాడు విసురుగా.

ప్రసాదు "ఇందిరమ్మ కదా!" అన్నాడు బెక్కుతూ.

"యెహ, ఇందిరమ్మేంటి? అంబేద్కర్ రా! ఎల్లుండి అంబేద్కర్ వర్ధంతి జరుగుతుంది. నువ్వు రా. అక్కడ బోలెడన్ని విషయాలు తెలుస్తాయి. రా తప్పకుండా"

పెద్దమ్మతో చెప్పి మీటింగుకి తప్పనిసరిగా వెళ్లాలని నిశ్చయించుకున్నాడు ప్రసాదు. అంబేద్కర్ ఏం చేశాడో తెలియదన్నందుకు ఇంత విసిరేస్తూ మోహనరావు మాట్లాడాడంటే, అంబేద్కర్ గురించి తప్పనిసరిగా తెలుసుకోవాలనుకున్నాడు ప్రసాదు.

సాయంత్రం ఇంటికి వెళ్లాక, పెద్దమ్మని అడిగాడు "అంబేద్కరంటే నీకు తెలుసా పెద్దమ్మా!" అని.

"ఎందుకు తెలవదురా? " అని దణ్ణం పెట్టింది.

"ఆయన పెట్టిన దానివల్లే, అదేదో... అంటారయ్యా, మీ అన్నయ్యలిద్దరికీ ఉద్యోగాలొచ్చాయి. మీ పెదనానకయితే చానా విసయాలు తెలుసయ్యా ఆయన గురించి. నాకంతగా తెలవదు. మనూరులోను ఆయన విగ్రహం పెడతారంట" అంది.

ఆ సమావేశం ప్రసాదుకి చాలా గొప్పగా ఏమీ అనిపించలేదు. వేదిక మీద చాలామంది నిండిపోయారు. అయితే ఒక్కటి మాత్రం అతనికి తెలిసింది- బాగా చదవాలని, అంబేద్కర్ గురించి తెలుసుకోవాలని.

★ ★ ★

పెద్దమ్మ దగ్గర ఉండి, ఆమె పొలం పనులన్నీ తానై చేశాడు ప్రసాదు. దమయంతమ్మకి చెల్లి కొడుకుని తెచ్చి పెట్టుకున్నందుకు ఎప్పుడూ వీడేమిటి అనుకోవాల్సిన పరిస్థితి రాలేదు సరికదా, ప్రసాదు అన్ని రకాలుగా ఆమెకి ఆసరాగా ఉన్నాడు. ఆదివారం వచ్చినా, కాలేజికి సెలవు వచ్చినా ప్రసాదు చెప్పకుండానే గేదెల్ని ఊడదీసుకుని వెళ్ళేవాడు. ప్రసాదు ఉండడం ఆమెకి అన్ని రకాలుగా చేదోడుగా ఉంది.

ప్రసాదు కళ్ళం కోసి నూర్పిడికి సిద్ధం చేస్తూ, ఆ గట్టు వెంట వెళుతున్న బృందావనం కృష్ణమాచార్యులిని చూశాడు. కృష్ణమాచార్యులు తెల్లలుంగీ కట్టుకుని చేత్తో మూరెడు కర్రపుల్ల పట్టుకుని ఆ పొలం గట్టు వెంట వెళ్తున్నాడు. అతను బక్కగా చువ్వలా ఉంటాడు. ఎమ్.పి.సి. గ్రూపు. ప్రసాదు, కృష్ణమాచార్యులు ఒకే కాలేజి. ఇద్దరూ ఒకరికొకరు తెలుసు- ఒకే ఊరి నుంచి వస్తున్నాం అని. సైకిలు వేసుకుని వెళ్ళేటప్పుడో వచ్చేటప్పుడో కలుస్తూ ఉంటారు గాని ఎప్పుడూ పలకరించుకునే ప్రయత్నం గానీ మాట్లాడుకునే ప్రయత్నం కానీ చెయ్యలేదు.

చేలలో దూరం దూరంగా అక్కడొకరు అక్కడొకరు పనిచేస్తున్నారు.

ప్రసాదు, కృష్ణమాచార్యులు ఒకరినొకరు చూసుకున్నారు. ప్రసాద్‌ని చూసి కృష్ణమాచార్యులు చిరునవ్వు నవ్వాడు. ప్రసాదు కూడా నవ్వాడు. కృష్ణమాచార్యులు గట్టు వెంట తమ పొలాలవైపు వెళ్ళిపోయాడు.

ప్రసాదు తనపనిలో తాను పడిపోయాడు. ఒక అరగంటకి కృష్ణమాచార్యులు తిరిగి వచ్చాడు. మళ్ళీ ఇద్దరూ కాస్త పరి

చయంగా పలకరించుకోవాలన్నట్లు నవ్వుకున్నారు.

"మీ చేలెక్కడ?" అని అడిగాడు ప్రసాదు.

"అదుగో దూరంగా ఆ పెద్దకుప్ప కనిపిస్తోందిగా అదే. అటువైపుకి కూడా మా పొలం ఉంది. ఇటు గట్టు బావుంటుంది కదా. ఎప్పుడైనా ఇటు వస్తూ ఉంటాను. అవునూ, ఇది మీ పొలమా?" అన్నాడు కృష్ణమాచార్యులు.

"కాదు. మా పెద్దమ్మ వాళ్ళది. నేను మా పెద్దమ్మ దగ్గరుండి చదువుకుంటున్నాను"

"మరి నువ్వు చేస్తున్నావ్, పొలంపనంతా వచ్చా నీకు!"

"రావడానికేముంది? పనేకదా?"

"ఎంతసేపటి నుంచి కోస్తున్నావీ మోడులు?"

"మధ్యాహ్నం నుంచి కోస్తున్నాను. మరి కాసేపటికి అయిపోతుంది, ఆ కురదలా కోసేస్తే"

కాసేపు మాట్లాడి కృష్ణమాచార్యులు వెళ్ళిపోయాడు. ప్రసాదు పని పూర్తిచేసుకుని ఇంటికి వచ్చాడు.

రాత్రి భోజనమయ్యాక పుస్తకం తీసుకుని కాసేపు ఇంగ్లీషు చదివాడు. పెద్దమ్మ ఇంట్లో ఇంగ్లీషు డిక్షనరీ ఉంది. అది అట్ట చిరిగిపోయి, కొన్ని కాగితాలు ఊడిపోయి ఉంది. ఇంకా మరికొన్ని కాగితాలు ఊడిపోకుండా ఉండటానికి జిగురుగంజితో కాగితాలు అంటించాడు. ప్రసాదుకి డిక్షనరీ ఎలా ఉంటుందనేదికానీ, డిక్షనరీ చూడడం గానీ తెలియదు. పెద్దమ్మవాళ్ళ ఇంటి కొచ్చాక డిక్షనరీ చూసాడు. రాజ్యం అక్కని అడిగి చూడడం తెలుసుకున్నాడు. ఇప్పుడు ఇంగ్లీషు టెక్ట్సుబుక్‌లో తెలియని పదాలకి అర్థం చూడడం అలవాటు చేసుకున్నాడు. తెలిసిన పదాలు మరొకసారి చూసుకుంటున్నాడు. అది శంకరనారాయణ నిఘంటువు.

ఇంగ్లీషు చదివిన తరువాత, లైబ్రరీ నుంచి తెచ్చుకున్న పుస్తకం, చలసాని ప్రసాదరావు రాసిన "రాజుల బూజు" చదువుతూ నిద్రలోకి వెళ్ళిపోయాడు.

★ ★ ★

మట్టిరోడ్డు నుండి మెయిన్‌రోడ్డులో కలిసేచోట, ముందు సైకిలు మీద వెళుతున్న ప్రసాదుని 'ప్రసాదూ' అని పిలిచాడు కృష్ణమాచార్యులు. ప్రసాదు వెనక్కి తిరిగి చూసాడు. ఇద్దరూ కలిసి కబుర్లతో సైకిళ్ళని ముందుకు కదిపారు.

కాలేజీలోకి వెళ్ళేటప్పటికి, విద్యార్థులంతా గుంపులు గుంపులుగా మాట్లాడుకుంటున్నారు. ప్రసాదు, కృష్ణమాచార్యులు సైకిల్ స్టాండులో సైకిళ్ళు పెట్టి మాట్లాడుకునే విద్యార్థుల దగ్గరకెళ్లారు.

కాలేజి యానివర్సరీకి ఆటలు, వ్యాసరచన మొదలైన పోటీలు నిర్వహిస్తారు. ఆసక్తి ఉన్న విద్యార్థులు ఆటలకైతే పి.డి. గారికి, వ్యాసరచన, వక్తృత్వం మొదలైన వాటికి తెలుగు లెక్చరర్ శ్రీపాదరావు గారికి పేర్లు ఇవ్వవలసిందిగా నోటీసు బోర్డులో ఉంది.

కృష్ణమాచార్యులు వ్యాసరచన, వక్తృత్వం, క్విజ్, పాటలు, చెస్‌కి పేరు ఇచ్చాడు. ప్రసాదు ఆటల్లో పేరు ఇవ్వడానికి పి.డి. గారి దగ్గరకెళ్ళాడు. "స్పోర్ట్స్ అన్నీ ఈరోజు, రేపు సాయంత్రం జరుగుతాయి. గ్రౌండులోకి వచ్చెయండ్రా, పేర్లక్కర లేదు" అన్నాడాయన.

ఆటల్లో బాల్ బ్యాడ్మింటన్, వాలీబాల్, కబడ్డీ ఉంటాయి. అది సెక్షన్ వైజ్‌గా జరుగుతాయి. క్లాసులో విద్యార్థులు జట్టుగా పేర్లు ఇవ్వవలసి ఉంటుంది. హెచ్.ఇ.సి విద్యార్థులందరూ టీమ్‌ల కోసం గుంపులు చింపులు పడుతున్నారు.

ప్రసాదుకి టీమ్‌లో ఉండాలని ఉంది. కాని చొరవ చేసి అడిగే ధైర్యం లేదు.

"అరే, మీరు గుంజులాడుకోవడమే గాని, సెకండ్ సి.ఇ.సి వాళ్ళదే రా, ఫస్టు. ఈ సంవత్సరం గూడా!" అంటున్నాడు- కృష్ణ మూర్తి.

"సరేలేరా ఎవడో ఒకడు గెలుస్తాడు! మన క్లాసు ఆడాలి కదా!... ఇంతకు ముందు ఆటలు ఆడినవాళ్ళెవరో చెప్పండి" అన్నాడు మోహనరావు.

"సెకండ్ సి.ఇ.సి. వాళ్ళు రోజూ ప్రాక్టీసు చేస్తున్నార్రా! ఎందుకు వాళ్ళతో మొకాలు పగలగొట్టించుకోవడం? " అన్నాడు మళ్ళీ కృష్ణమూర్తి.

కృష్ణమూర్తి ఈ మాట అనేటప్పటికి ఒకొక్కరే జారుకోవడం మొదలెట్టారు- ముందు పదిమంది వరకూ పేర్లు ఇచ్చారు వాలీబాల్ కి. బ్యాడ్మింటన్ టీమ్‌కి ఆరుగు రున్నారు.

వ్యాసరచన పోటీ జరిగింది. వక్తృత్వ పోటీని ప్రసాదు జాగ్రత్తగా గమనించాడు.

ఆటల కోసం మూడు గంటలకే క్లాసులు విడిచి పెట్టేసారు. ఆటలంటే ఆసక్తి లేని వాళ్ళు ఇంటిదారి పట్టేసారు.

వాలీబాల్ కోర్టు. వాలీబాల్ మొదటి రౌండు, ఫస్ట్ హెచ్.ఇ.సికి, నిరుటి విజే తలు సెకండ్ సి.ఇ.సి.కి పడింది. సెకండ్ సి.ఇ.సి. వాళ్ళు కోర్టులో దిగి టచ్‌గేమ్ ఆడుతున్నారు. ఫస్ట్ హెచ్.ఇ.సి. టీమ్‌లో ఐదుగురే ఉన్నారు. ఆరో వ్యక్తిగా అడ్డం నిలబడడానికి బతిమిలాట కార్యక్రమం మొదలయింది. ప్రసాదు ముందుకొ చ్చాడు.

ఆట ప్రారంభమయింది. అప్పుడే సెకండ్ సి.ఇ.సి. వాళ్ళు ఎనిమిది పాయింట్లు సంపాదించేసారు. సర్వీసు ప్రసాదు చేతికొచ్చింది.

ఆటగాడి తీరు ఆటలోకి వచ్చాక గానీ తెలియదు. ప్రసాదు బ్యాక్‌లైన్ వెనక

## కొత్తగాలి...

**వినోదంలో మనసు**
**తుంటరి**
**విషాదంలో మాత్రం**
**ఒంటరి**

**–బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి**

నుండి బంతిపైకి ఎగరవేసాడు. 'వీడికి ఆట అలవాటున్నట్లుందే' అనుకున్నారు పి.డి.గారు. మొదటి పాయింటు వచ్చింది. రెండో పాయింటు, అవతలి ప్లేయరు అవుట్ కొట్టడంతో వచ్చింది. మూడో సర్వీసు క్లియర్ ప్లేస్ ఫస్ట్ హెచ్.ఇ.సి. వాళ్ళకి ఉత్సాహం వచ్చింది. వాళ్ళు ప్రసా దుని అనుసరించడం ప్రారంభించారు.

ఫస్టు హెచ్.ఇ.సి. టీమ్ గెలిపించింది. తరువాత ఆ టీమే విన్నర్ అయింది. ఈ ఏటి విజేత. కబాడీ టీమ్‌లో ప్రసాదు పేరు మొదటి పేరు అయింది. "బ్యాడ్మిం టన్ ఆడతావా ప్రసాదు? " అని బ్యాడ్మిం టన్ టీమ్‌లో ఉన్న మహేష్ వచ్చి అడి గాడు. "రాదు. ఆడలేను" అన్నాడు ప్రసాదు.

ప్రసాదుకి బ్యాట్ కొనుక్కోవాలనే ఆలో చన రాలేదు. స్కూల్లో ఎప్పుడూ ఎవరి బ్యాటూ తీసుకుని ఆడే ప్రయత్నమూ చెయ్యలేదు. బ్యాటు డబ్బులతో కొనాలి. ఆటకి డబ్బులు ముడిపెడితే ఆడే ఆలోచన కలగదు ఈ దేశంలో చాలా మందికి. వాళ్ళలో ప్రసాదు ఒకడు.

ప్రసాదుని అందరూ అభినందించారు. కృష్ణమాచార్యులు "బాగా ఆడావోయ్" అన్నాడు అభిమానంగా.

హైజంప్ పోటీ జరుగుతోంది. టీచర్లు కూడా అక్కడ కుర్చీలు వేసుకుని కూర్చు

న్నారు.

నాలుగడుగుల ఎనిమిది అంగుళాలు ఏడుగురు క్లియర్ చేసారు. మరొక రెండం గుళాలు పెరిగింది. ముగ్గురే మిగిలారు. ఐదడుగులు ప్రసాదొక్కడే పూర్తి చేసాడు. 'ప్రాక్టీస్ ఇస్తే వీడు మంచి జంపర్ అవు తాడు' అనుకున్నాడు పి.డి.

"ఒరే, నీ పేరేంట్రా? " అడిగాడు ప్రసా దుని.

"ప్రసాదండి"

"కాలేజి రికార్డు రాస్తాన్రా! మరో రెండం గుళాలు దూకగలవా!"

తలాడించాడు ప్రసాదు.

ఎత్తు సరిచేస్తున్నారు. మూవ్‌మెంట్ తీసుకోవడానికి వెనక్కి వచ్చాడు ప్రసాదు. ఎకనమిక్స్ లెక్చరర్ పూర్ణ చంద్రరావు, తెలుగు లెక్చరర్ శ్రీపాదరావు, ఫిజిక్స్ లెక్చ రర్ కుటుంబ శాస్త్రి అక్కడ కుర్చీలు వేసు కుని కూర్చుని మాట్లాడుకుంటున్నారు.

"ఇలాంటి పోటీలుంటేనే పిల్లల్లో టాలెంట్ తెలుస్తుంది. చూడండి ఆ హైజంప్ చేస్తున్న కుర్రాడు వాలీబాల్ చాలా బాగా ఆడాడండి!" అన్నాడు కుటుంబ శాస్త్రి.

"ఎస్.సి. కుర్రాడండీ వాడు! ఈ వెధ వలు ఆటలు బానే ఆడతారు. బుర్రే ఉండదు" అన్నాడు పూర్ణచంద్రరావు.

"నేను గమనిస్తున్నాను కదండీ! ఒక్క వెధవకీ వత్తులు పెట్టడంరాదు. తప్పుల్లే కుండా రాయడం రాదు. ఏమిటి చదివేది వాళ్ళ ముఖం! ఏదో గవర్నమెంటు స్కాల ర్‌షిప్పులనీ, హాస్టళ్ళనీ ఉండడంతో కాలే జీల కొస్తున్నారు కానీ వీళ్ళకి చదువెందు కండీ? " అన్నాడు శ్రీపాదరావు.

ప్రతి మాటా ప్రసాదు వీపు నుంచి గుండెకి తగులుతూంది. ఇవన్నీ అలవాటు పడ్డ మాటలే. అది గాయం కాదు కర్మ అనుకుంటే ఆ దారి వేరు. అది కర్మకాదు గాయం! రేగుతున్నకొద్దీ మాన్చుకోవాలనే కసి పెరుగుతుంది. ఆ కసితో కాలు ముందుకు దువ్వాడు ప్రసాదు.

★ ★ ★

పాలేరుతనం మానేసాక పోతురాజు తాగుడు ఇంచుమించుగా మానేసాడు. ఏదైనా పండుగ పూట కొద్దిగా పుచ్చుకో వడం మినహా తాగుడులేదు. వేసవికే రెండు గేదెలు వట్టిపోయాయి. పని కూడా ఏమీలేదు. పాలేరుతనం ఉన్నపుడు ఇంట్లో బియ్యానికి తడుము కోవలసిన పరిస్థితి లేదు. కానీ ఇప్పుడు దానికి కాస్త కష్టంగానే ఉంది. పని ఎద్దడి లేనపుడు పొలాల్లో ఉండే చిన్నా చితకా పనులు, అందరికీ సరి పడా దొరకదు పని.

పాటిపూడి మాలపల్లిలో ఒక పది కుటుంబాలు మినహా ఒక కొంద్రనేల ఉన్న వాళ్ళు ఎవరూ లేరు. పస్తు లేకుండా సంవ త్సరం గడవకపోవడం ఒక సాధారణ విషయం. దానితో అప్పుడప్పుడు నిలవకూ లీలుగా వెళ్ళడం పరిపాటి.

పాటిపూడిలో కాలువలు కాస్త ఆల స్యంగా వస్తాయి. నిడుమోలు దగ్గర మంత్రి పొలానికి నిలవకూలీలుగా వచ్చారు పోతురాజు, మాలచ్చిమి. ఒక అరవైమంది పాటిపూడి మాలపల్లి నుండి మంత్రిపాలెం నిలవకూలికి వచ్చారు.

ఇంకా మరో ఐదారు రోజులు పనుం టుంది. ఇవాళ కాలువవైపు పొలంలో మిగిలున్న కురదలా ముందుగా అయిపో వడంతో కొడుకుని చూసొద్దామని పామర్రు వచ్చారు మాలచ్చిమి, పోతురాజు.

"మా నానొచ్చాడు, నువ్వు పద" అన్నాడు ప్రసాదు, కృష్ణమాచార్యులతో. ప్రసాదు వాళ్ళనాన్నను చూస్తూ సైకిలు తొక్కుకుంటూ వెళ్ళిపోయాడు కృష్ణమాచా ర్యులు.

"మీ అమ్మ కూడా వచ్చిందిరా!" అన్నాడు పోతురాజు, దగ్గరకొస్తున్న కొడుకుని ఆప్యాయంగా చూస్తూ.

"ఏదీ" అన్నాడు ప్రసాదు.

"అక్కడ కూరలు కొంటంది. మంత్రిపాలెంలో వండుకోటానికి కూర దొరకట్లేదురా!"

"పద ఎల్దాం" అని ముందుకి కదిలాడు ప్రసాదు. పోతురాజు, కొడుకు సైకిలు మీద చెయ్యివేసి నడుస్తున్నాడు.

ఉల్లిపాయలు, దొండకాయలు, బంగాళాదుంపలు, చేమదుంపలు, వంకాయలు సంచిలో వేసుకుని ప్రసాదుని అపేక్షగ చూసి నవ్వింది మాలచ్చిమి. ప్రసాదు ఇంటి దగ్గర నుంచి ఇక్కడి కొచ్చి ఇంకా నెల కాలేదు. వేసవి సెలవులకి ప్రసాదు పాటిపూడిలోనే ఉన్నాడు. చెయ్యెత్తి అందుకునేంత ఎత్తు పెరుగుతున్న కొడుకు తల మీద చెయ్యివేసి నిమిరింది.

ఆ తరువాత ముగ్గురూ కలిసి మాట్లాడుకుంటూ వంతెనవైపు నడుస్తున్నారు.

"బోడిగోడు బందర్లో అదేదో కాలేజంటయ్యా అక్కడ జేరేడు. నీకు తెలుసుగా!" అంది మాలచ్చిమి.

"నేనుండప్పుడే అనుకున్నాం గామ్మా"

"నీకు సదువది బాగానే ఉందిగా" అంది.

"ఇక్కడ బాగానే చెపుతున్నారమ్మా"

"అయ్యా, మన సాదు సేస్తాడు గదా ఆళ్ళ దొరగోరి కొడుకులు పెద్ద సదువులు సదువుకున్నారు గదయ్యా, ఆళ్ళేమో మేం ఇక్కడికి రాలేము, ఇక్కడెందుకు వచ్చెయ్యమంటన్నారంట ఈళ్ళని. ఈళ్ళెల్లిపోతే సాదుకి పాలేరుతనం పోద్ది. ఉప్పుడు సాదు ఏ టాక్టరైనా నడిపేత్తన్నాడయ్యా! మొన్న నేను సూత్తుండగానే తాతబ్బాయి గోరి టాక్టరు కాలవలోంచి బయ్యమని పైకెక్కించు కొచ్చాడయ్యా! ఆడు మొండిగటం" అంది.

"సాధు ట్రాక్టరు నడపడానికి లైసెన్సు తీసుకుంటానని నాతో చెప్పేడమ్మా. బుజ్జిగారి డ్రైవర్ని అడిగాం. వయసుండాలి. ఇంకో ఐదారు నెలలు ఆగాలని చెప్పాడు" అన్నాడు ప్రసాదు.

"సాదు సానా బాగా తోల్తన్నాడ్రా! పోయినసారి కుప్పలకెల్లినపుడు గంటసేపు గడ్డి ఆడే తొక్కించాడ్రా. అయినా మనిసి కూడా పుట్టకలు గలోడులే" అన్నాడు పోతురాజు.

హల్వా పొట్లం తీసి కొడుకు చేతికిచ్చింది మాలచ్చిమి. "మీరేం కొనుక్కున్నారు? " అన్నాడు ప్రసాదు.

"కొనుక్కున్నాం లేరా!" అన్నాడు పోతురాజు.

"మేము నిడుమోలు దిగి సీకట్లోపడి నడిసెల్లాలి" అని ఆగి "నువ్వెల్లిరా నీకు పొద్దోది" అంది మాలచ్చిమి.

"నేనిక్కడేగా! మిమ్మల్ని బస్సెక్కించి వెళతాను? " అన్నాడు ప్రసాదు.

వంతెన దగ్గర- కాస్త బురదంటుకున్న బట్టలతో పోతురాజు, గోచిపెట్టిన చీరని మాములుగా చేసిన నలిగిన చీరతో మాలచ్చిమి. మధ్యన ప్రసాదు నిలబడి ఉన్నాడు. పోతురాజు కంటె ఒక్క రవ్వ పొడుగుతో, కార్బన్‌కాపీలా ఉన్నాడు.

కాలేజి విడిచి పెట్టేసాక చాలా మంది విద్యార్థులు వంతెనదాటి ఊరిలోకి వెళుతూ, బందరువైపు బస్సులు ఆగేచోట నిలుచున్న ఈ ముగ్గుర్ని చూసే వెళుతున్నారు.

ప్రసాదు సెకండియరు వాళ్ళకందరికీ తెలుసు. అతను ఆ కాలేజికి గత సంవత్సరపు ఛాంపియన్.

★ ★ ★

హుందాగా, ఠీవిగా, బ్రిటిష్ కళాత్మకతకి నిదర్శనంగా నోబుల్ కళాశాల. చెక్క

మెట్లు, పెంకునేసిన వాలుకట్టడాలు, ఉన్నత చారిత్రక నేపథ్యం పునాదిగా నిటారుగా ఎత్తుగా ఉన్న తెల్లటి గోడలు, చెరొకవైపు పెద్ద చెట్లున్న వేదిక... నిండుగా నిల్చున్న ఆ కళాశాలలోకి అడుగు పెడుతున్నపుడు ప్రసాదుకి ఆనందరావు మాష్టారే గుర్తొచ్చారు.

ఒకే తాటిబొండు మీద జారే మట్టికాళ్ళతో పడిపోతామనే భయం లేకుండా నడిచిన ఇరుకుబాటలోంచి... రొమ్ము వరకూ పడకమంచంలా కత్తిరించిన క్రోటను మొక్కల స్వాగతాలందుకుంటూ, ఉదాత్త కళాశాలలోకి ఉన్నత విద్య కోసం. ఇదంతా ఆనందరావు మాష్టారి చలవే అనిపించింది ప్రసాద్‌కి.

పంచె చెంగు ఎడమచేతి మీద వేసుకుని, తమ ఆరుగురినీ ఘంటశాల హైస్కూలుకి తీసుకుని వెళుతున్న అనుభూతి మనసులో కదిలింది.

బందరు నోబుల్ కాలేజిలో చేరాక ప్రసాదు, ఆనందరావు మాష్టారి ఇల్లు వెతుక్కుని వెళ్ళి కలిసాడు. బి.ఎ.లో చేరిన ప్రసాదుని చూసి ఆనందరావు మాష్టారు చాలా సంతోషించాడు. ఏసుదాసుతో, "ప్రసాదురా, మన పాటిపూడి ప్రసాదు!" అన్నాడు. "ప్రసాదువా!" అన్నాడు ఏసుదాసు. ఆ పలకరింపులో ఏ ఆప్యాయతా కనిపించలేదు.

ఏసుదాసు నడక, మాటతీరు అన్నీ మారిపోయాయి. చక్కగా టక్ చేసుకున్నాడు. కుర్చీ మీద కూర్చుని బూట్లు మరొక్కసారి బ్రష్ చేసుకుని తొడుక్కున్నాడు. ప్రసాదు కూర్చొని, ఏసుదాసుని గమనిస్తూ, ఆనందరావు మాష్టారు పాటిపూడి వివరాలు అడుగుతుంటే, అవి చెబుతున్నాడు.

"డాడీ, నేను బయటకెళ్ళొస్తాను" అని లేచి, ప్రసాదు వంక ఏదీ కాని చూపు చూసి, స్టైల్‌గా తల విసిరి వెళ్ళిపోయాడు ఏసుదాసు.

**కొత్తగాలి...**

**ఎన్నికలు వస్తే వల**
**గెలిచాక కనిపిస్తారనుకుంటే కల**
**నాయకులంతా ఉంటారు ఇలా**

*–పట్ల యాదయ్య యాదవ్,*
*గుండాల, నల్లగొండ జిల్లా*

ఆనందరావు మాష్టారు చాలా అభిమానంగా మాట్లాడాడు ప్రసాదుతో. తను పెంచిన మొక్క తనని వెదుక్కుంటూ వచ్చింది. ప్రసాదు తనని కలవడానికి వచ్చినందుకు ఒక ఉపాధ్యాయుడిగా ఆనందరావు ఎంతో ఆనందపడ్డాడు.

"ప్రసాదూ, హాస్టల్లో ఉంటున్నావా? " అని అడిగాడు ఆనందరావు మాష్టారు.

"లేదండీ. పామర్రులో మా పెద్దమ్మ ఉంది. ఇంటర్మీడియట్ అక్కడే చదువుకున్నాను. తనొక్కతే ఉంటుంది ఇంటి దగ్గర. బస్‌పాస్ తీసుకుని రోజూ వెళ్ళి వస్తున్నానండి"

"బాగా దూరం కదా! ప్రయాణానికి బోలెడు టైమ్ పోదా!"

"అవునండీ!"

"అయినా అదే కొంత మెరుగులే...! ఇక్కడ హాస్టల్స్‌లో పిల్లలు సరిగా చదవడంలేదు. నానా అలవాట్లు! హాస్టల్ వాతావరణం కూడా అంతగా బావుండడం లేదు" అని "ఏసుదాసుకి ఇంజనీరింగ్ సీటు వస్తుంది ప్రసాద్. రెండోవాడిని మిషన్ హాస్టల్లో చేర్చాను. వాడి వ్యవహారం వాళ్ళే చూస్తారు. మూడోవాడు మా దగ్గరున్నాడు. ఈ సంవత్సరమే హైస్కూలుకి వచ్చాడు" అని తన కుటుంబ వివరాలు చెప్పాడు.

ఆనందరావు మాష్టారి భార్య, పంతు

లమ్మ "నీది పాటిపూడి కదూ" అని పలక రించింది ప్రసాదుని చూస్తూనే.

"అదేనే మాలచ్చిమి కొడుకు. ప్రసాదు" అన్నాడు ఆనందరావు.

"ఆ ఊరిలో ఉన్న రోజులే వేరు. నన్నొక్క పని ముట్టుకోనిచ్చేవాళ్ళా! ఇక్కడే ముందయ్యా, ఒకొళ్ళకొకళ్ళకి ఏమీ సంబంధం ఉండదు. ఎవరి తీరు వాళ్ళది" అని లోపలికెళ్ళి మంచినీళ్ళు తీసుకొని వచ్చి ఇచ్చింది.

భార్యాభర్తలిద్దరూ కూడా, 'ఏ అవసర మున్నా వస్తూ ఉండు ప్రసాదు' అని చెప్పారు.

ఆనందరావు మాష్టారికి దండం పెట్టి బయలుదేరాడు.

అప్పుడప్పుడు ప్రసాదుకి ఆనందరావు మాష్టారు కనిపిస్తూ ఉండేవారు. ఆప్యా యంగా పలకరించేవారు.

ప్రసాదు, మొదటి సంవత్సరమంతా పామర్రునుంచి బస్సుమీద వచ్చి వెళ్ళాడు. బందరులో ఉండి చదువుకోవడమే మంచి దన్న ఆలోచన వచ్చింది. చాలా సమయం కలిసివస్తుందనిపించింది. నోబుల్ కాలేజి పి. డి. గారు కూడా హాస్టల్‌లో ఉండమని బలవంతం చేసారు. "రోజూ ఉదయం, సాయంత్రం ప్రాక్టీసుకి రావోయ్! కాలేజి వాలీబాల్ టీమ్‌కి సెలక్ట్ అవుతావు" అన్నారాయన.

దమయంతమ్మకి ప్రసాదుని వదులుకో వడం ఇష్టం లేకపోయినా, ప్రసాదు భవి ష్యత్తుకి వాడు హాస్టల్లో ఉండటం మంచి దని ఆమె పెద్దకొడుకు కూడా చెప్పడంతో ఒప్పుకుంది.

ప్రసాదు బి. ఎ. సెకండియర్‌లో సోషల్ వెల్ ఫేర్ మెయిన్ కాలేజి హాస్టల్లో చేరాడు. పెద్దమ్మ, 'సైకిలు నువ్వు తీసుకెళ్ళి పోరా' అని ఇచ్చింది. బందరు దూరాలు భారం కాకుండా. ఆ సైకిలు ప్రసాదుని ఆదుకుంది. ఉదయం, సాయంత్రం వాలీబాల్ ప్రాక్టీసుకి, జిల్లా గ్రంథాలయానికి, ఎప్పుడైనా సినిమాకి సైకిలు సమయాన్ని తగ్గించే మంచి మిత్రు డయింది.




"ప్రసాదు నీ కోసం ఎవరో వచ్చారు" అన్నాడు జగన్‌మోహన్.

వాలీబాల్ ప్రాక్టీసు చేస్తున్న ప్రసాదు, తన చేతికొచ్చిన బంతిని పక్కనున్న కృష్ణకి అందించి పక్కకి చూసాడు.

నవ్వుతూ ఆనందరావు మాష్టారు నిల బడి ఉన్నారు. "మాష్టారూ, మీరా!" అని గబగబా దగ్గరికి వెళ్ళాడు.

"నీకో చిన్న విషయం చెప్పి వెళదామని వచ్చాను ప్రసాదు! మీ పంతులమ్మకి ఒంట్లో బావుండలేదు. పెద్దాసుపత్రిలో చేర్చాను. రాత్రికి నేనక్కడుండాలి. నువ్వు భోజనం చేసొచ్చాక, రాత్రికి మా యింటి దగ్గర పడుకో. చిన్నవాడు ఒక్కడే ఇంటిద గ్గర ఉంటాడు. వాడికి తోడుగా ఉంటా వని, ఫరవాలేదు కదా!"

"అదేంటి మాష్టారూ, నేను తప్పనిసరిగా వస్తాను. పంతులమ్మ గారికెట్లా వుంది? " అన్నాడు ప్రసాదు.

"హాస్పటల్‌లో నాలుగు రోజులుండాలి. ఫరవాలేదిప్పుడు. సరే, నేను వెళతాను! తొందరేమీలేదు, తొమ్మిది అలా వచ్చి పడుకుంటే చాలు" అన్నాడానందరావు

మాష్టారు.

"ఇంకా ముందే ఉంటానండీ" అన్నాడు ప్రసాదు- ఆనందరావు మాష్టారిని సాగనం పుతూ.

★ ★ ★

రాత్రి హాస్టల్‌లో భోంచేసి, ఓ రెండు పుస్తకాలు సైకిల్ క్యారియర్ మీద పెట్టు కుని ఎనిమిది కాకుండానే ఆనందరావు ఇంటికి చేరాడు ప్రసాదు.

"వచ్చేసావా ప్రసాద్" అని సంచి సర్దు కుని హాస్పటల్‌కి బయలుదేరాడు ఆనంద రావు.

"నువ్వు తెల్లారగానే వెళ్ళిపో ప్రసాదు. నా కోసం చూడొద్దు. నీకు ప్రాక్టీసుంది గదా! జాగ్రత్త ప్రసాదు" అని వెళ్ళిపోయా డాయన.

ఆనందరావు మాష్టారి కొడుకు డేని యల్ విజయవాడ రేడియోస్టేషనులో పాటలు పెట్టుకుని, "ప్రసాదూ ఆ మంచం వేసుకుని పడుకో! నేను నీ పక్కనే మరో మంచం వేసుకుంటాను" అన్నాడు.

"సరే కానీ, నేను కాసేపు చదువుకుం టాను. నువ్వు చదువుకోవా డేనియల్?" అడిగాడు ప్రసాదు.

"నాకు పాటాలొచ్చేసాయి"

గోడకి ఉన్న అలమరలో వరసగా పెట్టి ఉన్న పుస్తకాలు ఒక్కొక్కటే చూసాడు ప్రసాదు. ఆ పుస్తకాల్లో "డా॥ బి.ఆర్.అం బేద్కర్ జీవిత చరిత్ర" కనపడింది. పుస్తకం బైండు చేసి ఉంది. లోపల 'ఆంగ్ల మూలం: ధనుంజయకీర్. అనువాదం ఎండ్లూరి చిన్నయ్య' అని ఉంది. ప్రసాదు చాలా ఆసక్తిగా ఆ పుస్తకం తీసాడు.

"ఈ పుస్తకం నేను చదువుతాను!" అని డేనియల్‌కి చూపించాడు. డేనియల్ తల ఊపాడు.

ప్రసాదు పుస్తకం చదవడం ప్రారంభిం చాడు. డేనియల్ తలుపులన్నీ గడియలు పెట్టి, అనవసరమైన లైట్లు ఆర్పి, తన మంచంమీద దుప్పటి పరుచుకుని నిద్ర కుపక్రమించాడు.

ప్రసాదు పేజి వెంట పేజి ముందుకు వెళుతున్నాడు. ఒక సమాజ జీవితాన్ని ముందుకు నడిపించే వ్యక్తి అతని కళ్ళ ముందు ఉద్యమంలా కదలడం ప్రారంభిం చాడు. కళ్ళు కాస్త మంటపుట్టినట్లు అని పిస్తే టైమ్ చూసాడు. అప్పటికే ఒంటిగం టన్నర! ప్రసాదు ఎప్పుడూ అంతసేపు చద వలేదు. ప్రసాదు లైట్లు తీసేస్తూ 'అంబే ద్కర్ ఇలాంటి రాత్రులెన్ని గడిపాడో' అను కుంటూ నిద్రపోయాడు.

ఆ పుస్తకం కోసమే ఆబగా, మరింత పెందలకడ ఆనందరావు మాష్టారింటికి వచ్చాడు మర్నాడు. ఒకటికి రెండుసార్లు ఆ పుస్తకాన్ని చదివాడు. మూడోరోజున "మాష్టారూ అంబేద్కర్ పుస్తకాలు ఇంకా ఏమన్నా ఉన్నాయా?" అని అడిగాడు.

"జీవితచరిత్ర చదివినట్లు ఉన్నావుకదా! కులనిర్మూలన ఉంది. అది కూడా చదువు" అన్నాడు ఆనందరావు. ప్రసాదు అదీ చది వాడు. 'కులనిర్మూలన' పుస్తకం ప్రసాదుకి పూర్తిగా అర్థం కాలేదు. కాని కొన్ని అంశాలు అతని మనసు లోతుల్లోకి అత నికి తెలియకుండానే ఇంకిపోయాయి.

ఇప్పటివరకూ అతను చదువుకుంటున్న హిస్టరీ, ఎకనమిక్సు, పోలిటిక్సు కంటే భిన్న మైన భారతీయ వాస్తవికతని, హక్కుల స్వభావాన్ని అతని మనసు గుర్తుపట్టింది.

ఆనందరావు పంతులుగారి భార్యకి బావుండలేదని తెలిసి, పాటిపూడి నుండి ఓ నలుగురైదుగురు వచ్చి పలకరించి వెళ్ళారు. పంతులమ్మకి కుదుటపడ్డాక హాస్పటల్ నుండి ఇంటికి తీసుకొచ్చారు. రోజూ సాయంత్రం వెళ్ళి ఆమెని పలక రించి, ఏదైనా పని ఉంటే చెప్పమని అడి గేవాడు ప్రసాదు.

"నువ్వు రోజూ రావడమెందుకు ప్రసాద్! ఏదైనా అవసరం వుంటే నేనే వస్తాను. మొన్న రాలేదా నీ దగ్గరికి? నువ్వెందుకు రోజూ శ్రమ పడడం?" అన్నాడు ఆనంద రావు మాష్టారు.

★ ★ ★

ప్రసాదు స్నానంచేసి, టవల్, డ్రాయరు ఉతుక్కుని, జాడించిన లుంగీ భుజం మీద వేసుకుని వచ్చేటప్పటికి ఎదురుగా సాధు.

"ఎప్పుడొచ్చావురా" అని భుజం మీద చెయ్యివేసాడు ప్రసాదు. ఇద్దరూ ప్రసాదు గదిలోకి వెళ్లారు. రూమ్‌లో కబుర్లు చెప్పు కుంటూ కూర్చున్న రాజారావుకి, పర్ణశాల రామచంద్రరావుకి సాధుని పరిచయం చేసాడు.

"మా ఊరే! ఈడు మధ్యలో చదువా పాల్సి వచ్చింది గాని, బలే లెక్కలు చేసే వోడ్రా!" అన్నాడు ప్రసాదు మిత్రుడిని పరి చయం చేస్తూ.

సాధు కాస్త మొహమాటంగా నిలబ డ్డాడు.

"సాధూ, ఆ పెట్టెమీద కూర్చోరా! నేను ఈ తడి బట్టలు ఆరేసి వస్తాను" అని తన చెక్కపెట్టె చూపించి బయటకెళ్ళాడు.

వెహికిల్ జిడ్డు మరకల్తో ఉన్న ఖాకీ ప్యాంటు, సాదా చారల చొక్కా, పైన పాత టర్కీటవల్ వేసుకుని సాధు నిల్చుని ఉన్నాడు.

"కూచో బ్రెదరూ, పాటిపూడేనా!"

అన్నాడు రామచంద్రరావు. తలూపి, కూర్చున్నాడు సాధు.

ఆ సోషల్ వెల్ఫేర్ కాలేజీ హాస్టల్లో కుర్చీలు, టేబుళ్ళు లాంటివి ఉండవు. పెట్టె గట్టిగా ఉంటే దానిమీద కూర్చోవడం, లేదా చాపమీద చతికిలబడటం!

సాధుకి ఆ రూము చాలా నచ్చింది. తెల్లగా నున్నటి గోడలు. చక్కటి గచ్చు. ఇంత మంచి గదిలో ప్రసాదు చదువు కుంటున్నందుకు సాధుకి ఆనందమనిపించింది. ప్ర సాదుని చూసి అసూయ పడడానికి అతనికేమీ లేదు. తానెందుకు చదువు మానేసాడో అతనికి తెలుసు.

కొడుకుల దగ్గరికి వెళ్ళి పోతూ సుబ్రహ్మణ్యశాస్త్రి, పాటిపూడిలో ఉన్న తన పంట భూములని కౌలుకిచ్చాడు. తలా ఒక ఎకరం, రెండెకరాల చొప్పున ఆ ఊరి మాలలకే కౌలుకిచ్చి వెళ్లిపోయాడు. పాలే రుతనం పోయిన సాధు, దొరదగ్గర ఓ మూడెకరాలు కౌలుకి తీసుకున్నాడు. పోతురాజు రెండెకరాలు తీసుకున్నాడు.

సాధు పెదబుజ్జి ట్రాక్టరుకి డ్రైవరుగా చేరాడు. అయితే వీళ్ళకి పొలం కౌలుకొచ్చి నంత తేలికగా వ్యవసాయం అయిపో లేదు.

బట్టలారవేసి ప్రసాదు వచ్చాడు. "ఎట్లా

## హమ్మయ్య

ఇష్టమొచ్చినట్లు కారు నడుపుతున్న తాగుబోతుని పోలీసులు బయటికి దింపేశారు. అంతలోనే దగ్గర్లోని ఓ అపార్టుమెంటులో దోపిడీ జరుగుతోందని వైర్‌లెస్‌లో సమాచారం అందింది. తామొచ్చేంతవరకూ అక్కడే బుద్ధిగా ఉండమని అతడికి చెప్పివె ళ్లారు. తర్వాత ఆ తాగుబోతు ఇంటికెళ్లిపోయాడు. ఎవరన్నా అడిగితే జ్వరంరావడంతో విశ్రాంతి తీసుకుంటున్నానని భార్యను చెప్పమన్నాడు.



ఇంతలో పోలీసులు తలుపుతట్టి, కారునొకసారి చూడాలన్నారు. పార్కింగ్ షెడ్‌ను చూపించిందామె. లోపల వెలుగుతున్న రెడ్‌లైట్లతో పోలీసుకారును చూసి హమ్మయ్య అ ని ఊపిరి పీల్చుకున్నారు పోలీసులు.

తెలిసిందిరా సాధు" అని అడిగాడు.

"మొన్నొచ్చినపుడు చెప్పావు గదరా! నేనూ, మా వోనరూ ట్రాక్టరేసుకొచ్చాం. ట్రాక్టరు అల్లరి పెడుతోంది గదా, ఇప్పుడె ట్టాగూ పనులు లేవు. బోరు కిద్దామని వచ్చాం. రెండురోజులు పడద్దన్నాడు. మా వోనరు దగ్గరుండి చూసుకుంటానన్నాడు. ఇంటికెల్లిపోదామనుకున్నాను. నువు గుర్తొచ్చావు. సరే, చూసి పోయినట్టుంటదని ఇటొచ్చా"

"మంచి పన్జేశావురా! రేపు సెలవు మాకు. హాయిగా కాసేపు తిరుగుదాం. సెంకడ్‌షో సినిమాకెళదాం"

"నీ ఇష్టంరా! ఈ బొంది నీ మీదప డేసా"

'ప్రసాదూ, మీ ఫ్రెండు మంచి మాటకా రయ్యా" అన్నాడు రాజారావు నవ్వుతూ.

"మావాడు మాటకారే కాదు, మాట గూడా పడడు!" అన్నాడు ప్రసాదు.

"మంచి సినిమాలంటే... ప్రేమాభిషేకం ఆడుతోంది. వేటగాడు ఉంది. వీటన్నిటి కంటే మిధున్ చక్రవర్తి డిస్కోడాన్సర్ వచ్చింది. అదిరిపోద్ది" అని సినిమా వివ రాలిచ్చేసాడు రామచంద్రరావు.

ప్రసాదు సాధుకి లుంగీ ఇచ్చి స్నానానికి తీసుకుని వెళ్లాడు.

సాధు స్నానం చేసి వచ్చేటప్పటికి, రామ చంద్రరావు, రాజారావు ప్లేటులో అన్నం తెచ్చి రూమ్‌లో ఉంచారు. సాధు రూమ్‌లో భోజనం చేసాడు. రూమ్‌లో ఉన్న ఈ ముగ్గురూ డైనింగ్ హాల్‌కి భోజ నానికి వెళ్లారు.

"మీరు సినిమాకి వెళ్ళిరండి గురూ! నేను రికార్డు రాసుకోవాలి. లేకపోతే ప్రఫుల్ల చంపుకు తింటాడు రేపు!" అన్నాడు బి.ఎస్సీ చదివే రాజారావు.

"నాకు పనుంది లే. వేరే చోటికెళ్లాలి" అన్నాడు రామచంద్రరావు.

సాధు, ప్రసాదు సైకిల్‌మీద ఆనంద రావు మాష్టార్ని కలిసి, రామకృష్ణా థియే టర్‌కి డిస్కోడాన్సర్ సినిమాకి బయలుదే రారు.

"నువ్వెప్పుడొస్తావురా మళ్ళీ మనూరు? " అని అడిగాడు సాధు.

"దసరా సెలవులకి! మరో ఇరవై రోజుల్లో సెలవు లిచ్చేస్తారు. అప్పుడొ స్తాను. మా పెద్దమ్మ దగ్గరకెళ్ళి రెండ్రోజు లుండి, అటొస్తాను. ఇంకేట్రా, చేలెట్లా ఉన్నాయి? "

"చేలకేముందిరా బానే ఉన్నయ్. పోయి నసారి మూడురూపాయల వడ్డీకి తెచ్చి ఊడ్చిన. అప్పు తీరిపోయింది. ఈ సంవ త్సరం పెద్దగ అప్పు జెయ్యల. మా వోనరు దగ్గరే తీసుకున్నా. జీతంలో తెగ్గోసుకుంట న్నాడు. ఇంకా రెండు నెలల్లో తీరిపోద్ది. ఇప్పుడు పంట చేతికొస్తే పరవాలేదు, గట్టె క్కేస్తాం"

"మా చేలెట్టా ఉన్నాయిరా సాదూ? "

"మీ బాబు ఆ చేలమీదే పడుంటన్నాడ్రా బాబో! ఆ పెద్ద గట్టుమీద బెండ, బీర, గోంగూర, చిక్కుడు శానా పండిస్తన్నాడ్రా! ఇదంతా అట్టా పెట్టు. మనం ఆ చేలంట ఎల్లడానికీల్లేదని, గట్టులు తొక్కేస్తన్నారని, బండెళ్ళగూడదని కేకలేస్తన్నాడు."

సినిమాహాలు దగ్గర కొచ్చింది. సాధు డబ్బులు తీసాడు. కానీ ప్రసాదు టికెట్లు తీసుకున్నాడు- బెంచీ క్లాసుకి.

★ ★ ★

లేత రంగు చొక్కామీద పల్చటి చారలు. బాబీ కాలరు. ఒక మాదిరి బెల్‌బాటమ్ ప్యాంటు. నల్లటి రెక్సిన్‌తో కుట్టిన చెప్పులు, ఎర్రరెక్సిన్ బ్యాగు భుజానికి తగి లించుకుని ప్రసాద్ బస్సు దిగాడు. పల్చటి ఉంగరాల జుత్తు, ధృడమైన భుజాలు, ఐద డుగుల తొమ్మిది అంగుళాల ఎత్తు! గబ గబా, నిలకడగా, కాస్త తల వొంచి పాటి

పూడి ఊళ్లో నడుస్తూ వెళుతున్నాడు.

అప్పటికే వీధిలో ఉన్నవాళ్ళు 'ఎవరా' అని పరికించి చూస్తున్నారు. "ఎవఁడ్రా" అన్నాడు తాతబ్బాయి.

"ఆడూ, ఆడు...పోతుగోడి కొడుక్కదూ" అన్నాడు శివరావు.

"అంతయ్యాడా ఆడు" అన్నాడు సాంబయ్య.

"అమ్మ లంజాకొడుకు, ఆడా!" అన్నాడు గంగాధరరావు.

"లంజాకొడుకు బయమూ బెరుకూ లేకుండా చెప్పులేసుకెలతన్నాడే!" అన్నాడు శివరావు.

ఒక్కసారిగా అందరి గుండెలూ భగ్గున మండిపోయాయి.

"ఆపంద్రాణ్ణి" అన్నాడు శివరావు. అయితే శివరావు పిలుపందుకుని ఆపడానికి ఆ మధ్యాహ్నాం రెండున్నర గంటల ఎండలో కదలగలిగే వాళ్ళు ఎవ్వరూ లేరక్కడ- కదలమని చెప్పగలిగే వాళ్ళే మినహా. మాలపల్లివాడొకడు అలా చెప్పులతో వెళ్ళిపోతుంటే గుండెకి గసికి తగిలినట్లుగా ఉంది అందరికీ.

"రెండు ముక్కలు సదువుకునేటప్పటికి ఎంత పొగరు! ఎట్టా ఎళతన్నాడో చూసావా!" అన్నాడు సాంబయ్య.

"అసలాడు ముందు ఎవుడో అనుకున్నాన్రా! లేకపోతే ఇక్కడే నిలెయ్యను? " అన్నాడు శివరావు.

ఒక మనిషి వీధిలో నుండి నడిచి వెళుతుంటే, మనుషులుగా పుట్టిన'వాళ్ళు' ఆగ్రహంతో ఊగిపోతున్నారు. ఆ మనిషి అడుగులు, వాళ్ళ మనసుల మీద దౌర్జన్యం జరిపినట్లుంది వాళ్ళకి. ఒక వ్యక్తి తన మానాన తాను వెళ్ళిపోతుంటే వాడు తమందరినీ అవమానపరిచినట్లుగా "ఆరి లంజాకొడుకు ఎలా ఎల్లి పోతున్నాడో!" అనుకున్నారు.

ప్రసాదు, పమిడేశ్వరరావు వీధి అరుగు మలుపు తిరిగి కరంటు స్తంభం దాటి, కరంటుస్తంభాల్లేని మాలపల్లి బాటపట్టాడు.

శేషమ్మ తమ్ముడి కూతురు చిన చిట్టి, ఇద్దరాడపిల్లల్ని వెంట బెట్టుకుని వస్తోంది. అవురుపూడి నుంచి శేషమ్మ తీసుకొస్తే వచ్చిందిక్కడికి.

చామనఛాయతో సోగడగా ఉంది చిన చిట్టి. గోధుమరంగు జాకెట్టు మీద లేత నీలంరంగు ఓణీ వేసుకుని, జరీ అంచు పరికిణీ కట్టుకుంది. గుప్పెడంతజుత్తుతో రెండు జడలు వేసుకుంది. పెదవుల మీద నవ్వు ముఖమంతా విస్తరించిన రూపుతో, కాళ్ళకి అడ్డం పడకుండా పరికిణీ పైకి మడిచి బొడ్లో దోపుకుని, రాములోరి గుడి వైపు నుండి ఇద్దరాడపిల్లలని వెంటబెట్టుకుని వస్తోంది.

పట్టణపు సోకంటిన ప్రసాదు అనే ఈ కుర్రాడు చినచిట్టికి ఎదురుగా, కాస్త దూరంగా వస్తున్నాడు. చినచిట్టి, ఒక చేత్తో పక్కనున్న పిల్లని పట్టుకుని కుడి చేత్తో జుత్తు సవరించుకుంది. మరొక రెండడుగులు ముందుకు వేసి పైకి మడిచి బొడ్లో దోపుకున్న పరికిణీని కిందికి విడిచి, పరికిణీ సవరించుకుని నడక సాగించింది.

ఆ సోకంటిన కుర్రాడు, ఒక చేత్తో ఎర్ర బ్యాగు గట్టిగా పట్టుకుని, మరో చేత్తో తల సవరించుకున్నాడు- 'మనూర్లో ఎవరీ కొత్తమ్మాయి' అనుకుంటూ. తల సవరించుకుంటున్న ప్రసాదు వెనక నుంచి, ప్రసాదు చేతిని రాసుకుంటూ వెళ్ళి, "కుచ్చిళ్ళిరబోసుకుంటా నడుస్తావంటే లంజ!"అని ఛెళ్ళున చెంపమీద ఒక్కటి కొట్టాడు సత్యనారాయణ. చిన్న చిట్టి ముఖంలో చిరునవ్వంతా ఛిద్రమయిపోయింది. కళ్లల్లో నీళ్లు జల్లున ఒక్కసారి కిందికి రాలాయి.

"ఎందుకు కొట్టావ్? " అని ప్రశ్నించిన




గొంతు ధృఢంగా వినపడింది సత్యనారా యణకి వెనకనుంచి. ఆ గొంతు స్థిర త్వంలో, డిగ్రీ చదువుతున్న విద్యావంతుడు న్నాడు! అంబేద్కర్‌ని చదువుకుంటున్న యువకుడున్నాడు! మనిషి హక్కులు పోవ డమేమిటో తెలిసిన ఆలోచనాపరుడు న్నాడు!

"ఎందుకొట్టావ్? " అన్న మాట వినగానే, కన్నీళ్లు పరుచుకోడానికి వీలులేనంతగా చినచిట్టి కళ్లు విశాలమయ్యాయి. చినచిట్టి పక్కనున్న చిన్నపిల్లలు బిక్కు బిక్కు మంటూ చూస్తున్నారు.

"ఎందుక్కొట్టానా? నా కొడక నీకేం? అది కుచ్చిళ్లు ఇరబోసుకుని నడుస్తదా నా

ముందు?" కోపంతో ఊగిపోతూ ప్రసాదు వైపు చూసాడు.

ప్రసాదు ముఖంలో జంకుగాని భయం గాని లేదు.

"తప్పేంటి? ఎందుకట్టా కుచ్చిళ్లు ఎగబెట్టుకు నడవాలి?" అని మళ్ళీ అడిగాడు ప్రసాదు. అది మానవులుగా బతకాలనే ప్రశ్న! మానవ హక్కుల నిరాకరణమీద ప్రశ్న! ఆధిపత్య భావజాలం మీద ప్రశ్న! మత విలువగా కొందరికి ఆధిపత్యాన్నిచ్చిన మతం మీద ప్రశ్న! ఎన్నో ఏళ్లుగా ఈ దేశంలో వేస్తూనే వచ్చిన ప్రశ్న! ఈ రోజు ఈ పాటిపూడి మాలపల్లి నడివీధిలో మారుమోగింది.

ఒకప్పుడైతే సత్యనారాయణ ఆలస్యం లేకుండా నోటికీ చేతికీ ఒకేసారి పని చెప్పేవాడే! కానీ ఈసారి చేతికి పని చెప్పలేకపోయాడు. ఆ మాటతీరు శూలమో! వయోభారమో! మరి.

"ఏంట్రా లంజాకొడుక, తప్పేంటా?, తప్పేంటో తెలుస్తది. చెప్తాన్రా తెలిసేట్టు చెబుతా. రెండక్షరాలు చదువుకునేటప్పటికి ఎంతొచ్చింది? చూస్తా నీ యవ్వారం! చూస్తా!" అనుకుంటూ కోపంతో ముఖం కందగడ్డలా చేసుకుని వెళ్లిపోయాడు.

కళ్లవెంట నీళ్లు ఆగిపోయిన చినచిట్టి ముఖంలోకి ఒకసారి చూసి తలదించుకుని ఇంటికి వెళ్లిపోయాడు ప్రసాదు.

★ ★ ★

ఊరు ఉడికి పోతోంది. మాలపల్లి కంపించి పోతోంది.

శ్రీరాములవారి గుడి దగ్గర ఊరుచేరింది. విచక్షణా రహితంగా బూతులు రాలుతున్నాయి ఆ గుడి ప్రాంగణంలో. వర్ణధర్మాన్ని కాపాడిన శ్రీరామచంద్రుడి సన్నిధిలో, కులధర్మాల్ని నాశనం చేస్తున్న అధర్మవర్తనులని శిక్షించాలనుకోవడానికి, స్ఫూర్తి నింపాలంటే రాముల వారిగుడే సరైన వేదికని అక్కడ చేరినట్లున్నారంతా.

పోతురాజు రాయి దగ్గర కూర్చుంది మాలపల్లి. ఈ ఉపద్రవం నుంచి ఎలా బయటపడాలో వారికి తోచడం లేదు. పర్యవసానం ఎలా ఉంటుందో కూడా వాళ్లకు తెలియదు. పిల్లలు ఇంత అరాచకంగా ఎలా తయారౌతున్నారో అర్థంకాక తలలు పట్టుకుని కూర్చున్నారు వయసు మళ్లినవాళ్లు. తనకంటూ ఏ ప్రాధాన్యతా లేక అమ్మవార్లకి అండగా ఉండే పోతురాజు వీళ్లకి అండగా నిలబడతాడనేమో పోతురాజు రాయి దగ్గర చేరారు.

రాములవారి గుడి పైమెట్టు దగ్గరి స్తంభానికి ఆనుకుని కూర్చున్న కాశీరావు, "ఒరే, ఇవ్వాళ మీకిదేదో చాలా తేలిగ్గా కనబడుతోంది. ఆ నా కొడుకులకి నోరు పెగలడం మొదలెట్టారంటే శానా కస్టం! నా కొడుకు, ఆడు ఇదే రోడ్డంట నడవాలి! చెబుతా! నిలదీస్తాడా ఆడు! మన సత్యనారాయణని నిలదీస్తాడా! మనీధిలోంచి ఎళుతున్నపుడే ఆపుండాల్సింది" అంటున్నాడు చాలా కోపంగా.

"ఏంటి బాబాయ్ ఆలోచిచ్చేది? నా కొడుకుల్ని కనపడ్డోళ్లని కనపడ్డట్టు చితకబొడిచెయ్యక!" అన్నాడు సత్యనారాయణ పెద్దకొడుకు మురళీకృష్ణ.

కామ్రేడ్ భాస్కరరావు కొడుకు శేఖర్ అటుగా వెళుతూ "శివరావన్నా రోజులు మారుతున్నాయి. ఇవన్నీ మనం పట్టించుకుంటే ఎట్ట. దాంట్లో మాత్రం తప్పేముంది. గొడవెందుకు?" అన్నాడు. "ఒరె బ్బాయి శేఖరో పార్టీ మాటలిక్కడొద్దురా, ఈ యవ్వారాలు నీకు తెలవవు,నువ్వెళ్లు" అన్నాడు శివరావ్. కాసేపు తచ్చాడి వెళ్లిపోయాడు శేఖర్.

ప్రధానంగా సత్యనారాయణ నోటికి మాలపల్లి ఎక్కువగా భయపడుతూ ఉండేది. సత్యనారాయణ అక్కడుంటే,

ఇటు తప్పుకుపోతూ ఉండేవాళ్లు మాలపల్లి వాళ్లు. అది చూసి సత్యనారాయణ ఆనం దిస్తూ ఉండేవాడు. కాని ఈ రోజు మాల పల్లిలో నిలదీసి అడగడం! ఉడికిపోతు న్నాడు.

అయితే ఇది సత్యనారాయణకి, ప్రసా దుకి మధ్య వచ్చిన గొడవగా అటువాళ్లు గాని ఇటు వీళ్లుగాని భావించడం లేదు.

అప్పటికే ఊరి నుంచి పాలేరుతనం చేసి వెళ్లేవాళ్లు వెళుతున్నారు. వాళ్లు మాల పల్లి చేరేటప్పటికి అక్కడ జనం గుమి గూడి ఉన్నారు.

జనమంతా అనుకుంటున్నదేమిటంటే 'సత్తెన్నారాయణగోర్ని పెసాదు నిలేసి అడి గాడంట'. ఏమని అడిగాడు, ఎందుకడి గాడు ఇవేవీ అంశాలుకాదు. అసలు పెద్ద కులపు పెద్దమనిషిని నిలేసి అడగడమనేది చాలా పెద్ద విషయమైపోయింది.

"ఏరా పెసాదో, తెల్లారి లేస్తే ఆళ్ళ దగ్గర బతకాలి మనం! నోరెత్తి బతగ్గ లమా! మీకు నాలుగచ్చరాలు అబ్బేటప్ప టికి కన్నూ మిన్నూ కానటం లేదు. రేపు ముందు నువ్వు ఊర్లో నుండి బస్సెక్కి బయటూరు ఎల్లగలవా సెప్పు? " అన్నాడు గంగులు.

"ఒరే నిజమేరా నువ్వనేది! మనం పనులు జెయ్యకుండానే ఆళ్ళకి గడుత్తదా" అన్నాడు వీరయ్య పెదమాల.

"నువ్వు గాపోతే నీ బాబు వొచ్చి సేత్తాడ్రా! పని జెయ్యటాకి మనిషిలేడా? " అన్నాడు గంగులు.

"పనక్కడేనేరా? పన్జేసుకుంటే ఎక్కడైనా ఉంది. పన్జేసుకు బతకాల్సిందేగా! ఇవాల్టికి ఆడన్నాడ్రా! మనాడోళ్ళని మనముందే నోటికొచ్చినట్టు కూస్తే ఎప్పుడన్నా నోరెత్తామంట్రా!" అన్నాడు వీరయ్య పెద మాల.

"అవునయ్యా నోరెత్తుతాం. తరువాత? " అన్నాడు నాగేశ్వరరావు.

అందరూ తలోమాటా అంటున్నారు. ప్రసాదు మాట్లాడకుండా నిలబడ్డాడు.

శేషమ్మ ముందుకొచ్చింది.

"ఒరే, ఎన్ని మాటలు పడ్డాంరా! నడివీ ధిలో మానం సంపుకునే మాటలంటున్నా గుడ్లనీరు గుడ్లనే గుక్కుకుని వొచ్చేశాం! మొన్నటికి మొన్న మురలీగోడు మమ్ముల్ని అల్లరిపెడితే ఎవుడికన్నా చీమ కుట్టిందా? ఎవుడన్నా ఇక్కడ కూచుని ఆలోసిం చాడా? అప్పులు దెచ్చుకుని తాగి వొళ్ళు సివాలెత్తినట్టు సిందులు యేసేరుగాని, ఒక్కడాలోసించాడా? ఇవాల్టికిరా ఒక్క పిల్లోడు, ఒక్క మాటడిగితే- ఎక్కడ చత్తామో దేవుడో, మా బతుకెట్టాగో అని నెత్తి మీద సేతులెట్టుకు కూచున్నారు... మొగోళ్ళు! తాగి మమ్ముల్ని తన్నటానికి మొగోళ్ళు!..." అని బావురుమంది.

"ఊరుకోయే అప్పా, ఊరుకోయే" అని అక్కడ మిగిలిన ఆడవాళ్ళు సముదాయిం చారు.

పెద్దమాల రాఘవయ్య లేచి నిలబ డ్డాడు.

"మంచికో సెడుకో ఇయ్యాల ఆడు మని సనిపించుకున్నాడు. పడ్డంత కాలం పడ్డాం! ఈ పిలకాయలకి పడ్డం ఇట్టంలేదు. మనం ఇట్టంగా మాట పడలేదుగా? సూద్దాం! ఏం జరుగుద్దో అది జరుగుద్ది. ఆ మాట కొత్తే ఊర్లో ఆళ్ళెంత మందున్నారు, మనమూ అంతమందిమే ఉన్నాం. ఆళ్ళు ఊరుకున్నారా సరే, లేదంటే దానికి తగ్గట్టు మనమూ ఉందాం" అన్నాడు.

"ఉంటాంరా, తెల్లారి లెగిత్తే అక్కడ బత కాలి! ఏదోయిదంగా సరిజేసుకోవాలిగాని గొడవలెట్టుకు బతగ్గలమా? "... అంటు న్నాడు గంగులు.

"ఆc.. మా బతుకుతున్నాడయ్యా బతుకు! సిరిగిన గోసోటెట్టుకుని మూతి

నాక్కుంటా! తూ! బతుకేనా!" అంది సుబద్ర.

ఊళ్ళో నుండి తిరుపతొచ్చాడు- అక్కడి విషయాలన్నీ గమనించి, "ఒరే ఏమనుకుంటన్నారో! మొత్తం మీద ఆళ్ళేదో పెద్ద దెబ్బే కొట్టేతట్టున్నారు! అయినా ఈ పెసాదుగోడు ఆయన్ని నిలెయ్యటమేంటి! ఆళ్ళందరూ సేరి ఎట్టా మాట్టాడుకుంటన్నారో తెలుసా!" అన్నాడు.

ఆ చీకట్లో, "కోటేసున్నాడా? " అని పిలిచాడు మంగలి జయం. కోటేసుని పక్కకి తీసికెళ్ళి ఏదో మాటాడి వెళ్ళిపోయాడు.

"ఏంట్రా కోటేసు? ఏంటి కత!" అన్నాడు నాగేశ్వరరావు.

"ఏంలేదు! ఎదవ! ఆడిక్కడ ఏమైపోతోందో తెలుసుకోపోతే కడుపుబ్బిపోతది! ఏదో పనున్నట్టు వొచ్చేడిక్కడికి."

పెద్దమాల రాఘవయ్య మాట నికరం చేసుకుని ఒక్కొక్కరే అక్కడి నుండి వెళ్ళిపోయారు.

ప్రసాద్ వాళ్ళ అమ్మా నాన్నలతో ఇల్లు చేరాడు. "పెసాదో, నీకెందుకురా! రోడ్డున పోయే దాన్ని నెత్తికెత్తుకోటం! అసలే సత్తెన్నారాయనగోరి సంగతి నీకు తెలవందేముంది? నువ్వొక్కడివిరా! ఆళ్ళకేంటి ఇప్పుడు అందరూ అట్టాగే మాట్టాడతారు, గొడవొత్తే ఎవుడు నిలబడతార్రా ఈళ్ళు? ...." అంటున్నాడు పోతురాజు.

"ఇంకాపుతావా! పిల్లోడేదో సేసేడు. ఏదొత్తే అదొత్తది! నువ్వుండావుగా! మీ అన్నాదమ్ములుండారుగా ఆడికి! దయిరియం సెప్పాల్సింది పోయి పిరికి మందొత్తన్నాడు! సాలు సాలుగానీ, ఆపి పడుకో" అంది మాలచ్చిమి.

"నీయమ్మ నీకేటి తెలుత్తదే బయిటి సంగతి? "

"అవును మమ్మల్ని ఇల్లు కదలకుండా పెంచుతున్నావుగా! మాకు ఇంటో సంగతులు గాక బయటి సంగతులెట్టా తెలుత్తయ్? "

"నువ్వా? ... కాలికేత్తే మెడకేత్తావ్!" అని కొడుకుకి వచ్చే ఉపద్రవాన్ని తలుచుకుంటూ, మంచం మీద పడుకున్నాడు.

★ ★ ★

ఈ సంఘటన జరిగి ఉండకపోతే ప్రసాదు మర్నాడు ఉదయాన్నే బయలుదేరిపోయి ఉండేవాడు. ఇప్పుడిక జరగబోయేదానికి సిద్ధపడి, రెండురోజులు ఆగే వెళదామని నిర్ణయించుకున్నాడు.

ప్రసాదు నోబుల్ కాలేజి వాలీబాల్ టీమ్ వైస్ కెప్టెన్‌గా ఎన్నికయ్యాడు. పోటీలు చీరాలలో జరుగుతాయి. చీరాల వెళ్ళాలి. ఖర్చులు కాలేజియే భరిస్తుంది. అయినా చేతిలో డబ్బులుంటే మంచిదని, వీలైతే ఒక జత కొత్త బట్టలు కుట్టించుకోవచ్చని, డబ్బులుంటే ఇంటి దగ్గర అడిగి తీసుకుని తెల్లారి వెళ్ళిపోదామని వచ్చాడు. దారిలో ఈ సంఘటన జరిగింది.

రెండోరోజు ఉదయానికి సాధు వచ్చాడు. ఊళ్ళోకి పనులకి, పాలేరు తనాలకి వెళ్ళిన వాళ్ళ మీద సూటీ పోటీ మాటలు తగులుతున్నాయి. ప్రసాదు ఊళ్ళోకి వస్తే నిలెయ్యడానికి రంగం సిద్ధమయిందని మాలపల్లి వాళ్ళకి అర్థమయింది.

సాధుకి రాగానే విషయం అందిపోయింది. ముఖం కూడా కడుక్కోకుండానే ప్రసాదు దగ్గరకొచ్చాడు. ప్రసాదు ఇంటి దగ్గరే ఉన్నాడు. సాధుని చూడగానే బలమొచ్చింది.

"అనాల్సిన మాటన్నావురా ప్రెసాదూ! సూద్దాం! మాయమ్మ చెప్పిందిరా నిన్న సంగతంతా. ఇక తగ్గకూడదురా మనం!" అన్నాడు సాధు.

పోతురాజు అప్పటికే పనికి వెళ్ళిపోయాడు. మాలచ్చిమి సాధుకి "మొగం

కడుక్కోరా" అని ముఖం పుల్ల చేతికిచ్చి, ప్రసాదసలు ఎందుకొచ్చిందీ, ఏం జరిగిందీ, రాత్రి ఊర్లో మాటలు, కొడదామనుకుంటున్నారనే వార్తలు, వివరంగా చెప్పింది.

ప్రసాదు సాధుతో కలిసి వాళ్లింటికి వెళ్ళాడు. నాగేశు, బోడిగాడు, తిరుపతి మరోపదిమంది చేరారు. పోతురాజు అన్నదమ్ములు, వాళ్ల పిల్లలు కూడా ప్రసాదుకి దన్నుగానే మాట్లాడుతున్నారు.

కాలేజీ తరపున ఆడడానికి ప్రసాదు చీరాల వెళ్లాలని అందరికీ తెలుసు.

"ఒరే, ప్రెసాదూ, నువ్వెల్లిపోరా! ఇక్కడ ఏం జరిగితే అది జరుగుద్ది! మేం జూసుకుంటాగా! నువ్వు బందరెళ్లు!" అని సాధు, అతని తోటివాళ్లు ప్రసాదుని బలవంతపెట్టి బయల్దేరతీసారు. మర్నాడు సాయంత్రం, సాధు అతని తోటివాళ్లు ఓ పదిమంది ప్రసాదుని బస్సెక్కించి, మాలపల్లి వైపు తిరిగారు. ఊరివాళ్లు పమిడేశ్వరరావు అరుగు దగ్గర వీళ్లని నిలవేసారు.

"ఏంట్రా ఇంత మందొస్తున్నారు?" అన్నాడు శివరావు.

"ఏడ్రా ఆ నా కొడుకు ప్రసాదుగాడు?" సాధుని ఒక్కతోపు తోసాడు సత్యనారాయణ.

సాధు ఆ తోపుకి నిభాయించుకుని "ఎందుకండే తోత్తన్నారు?" అన్నాడు.

"ఎందుకా? ఎందుకంట్రావా? నా కొడుకుల్లారా, పెద్దమొగోళ్లలాగా మీరంతా ఆణ్ణి బస్సెక్కించటానికి వస్తా్రా? మీరంతా ఆడికి అండా?" అంటూ సాధుని చెంప దెబ్బ కొట్టబోయాడు సత్యనారాయణ.

సత్యనారాయణ విసిరిన చేతిని ఒక్క తోపు తోసాడు సాధు.

"చెయ్యెత్తుతున్నాడెయ్యండ్రా కొడుకుని'

'ఎయ్యండి',

'ఏసెయ్యండి' -కేకలు, పెడబొబ్బలు

కర్రలు పైకి లేచాయి. బుర్రలు పగిలి నలుగురు కింద పడిపోయారు.

ప్రసాదు రాత్రికి బందరుచేరి, తెల్లవారి నోబుల్ కాలేజి నుండి మిగతా ఆటగాళ్లతో పాటు చీరాల బయలుదేరిపోయాడు.

★ ★ ★

ఆంధ్రా యూనివర్సిటీ ఏరియాలో, నోబుల్ కాలేజి వాలీబాల్ టీమ్ విన్నర్ అయ్యింది- చీరాలలో జరిగిన పోటీల్లో కెప్టెన్ జగన్మోహన్, వైస్‌కెప్టెన్ ప్రసాద్.

నోబుల్ కాలేజి ప్రిన్సిపాలు, కాలేజిలో బహిరంగ సమావేశం ఏర్పాటు చేసి, అందరి ముందు టీమ్‌ని అభినందించారు.

"గత పది సంవత్సరాలుగా ఆంధ్రా యూనివర్సిటీ పరిధిలో మన కాలేజి టీమ్ ఒక్క ఈవెంట్ కూడా గెలుచుకోలేకపోయింది. ఈ ఏడాది ఈ విజయాన్ని సాధించిన మన వాలీబాల్ టీమ్ సభ్యులని, మన పి.డిగారు బాలశౌరయ్యగారిని అభినందిస్తున్నాను" అని కళాశాల ప్రిన్సిపాలు మాట్లాడారు.

ఒక్కొక్కరిని వేదిక మీదికి పిలిచి మరోసారి వాళ్ళకి మెడలో మెడల్స్ వేసారు.

ప్రసాదుకి ఈ విజయోత్సవం మనస్సుకి అంటటం లేదు. కొట్లాటలో హాస్పటల్ పాలైన సాధు, నాగేసు, వెంకటేసు, గంగయ్యలని చూడడానికి వెళ్ళి, ఇప్పటివరకూ వాళ్ళ దగ్గరే ఉండి వచ్చాడు.

## కొత్తగాలి...

**కలహించే**
**లోకులకన్నా**
**కలసి బ్రతికే**
**కాకులు మిన్న**

*-ఎ. రాంబాబు, హైదరాబాద్*

అప్పుడు తను లేనందుకు చాలా బాధ పడ్డాడు. వాళ్ళ నాన్నతో సహా ఓ పాతిక మందిని పోలీసులు అరెస్టు చేసి చల్లపల్లి జైల్లో పడేసినపుడు తను అందుబాటులో లేనందుకు బాధపడ్డాడు.

అరెస్టులన్నీ దెబ్బలు తగిలిన వాళ్ళపైపే జరిగాయి.

చీరాల నుండి ప్రసాదు కాలేజి టీమ్‌తో అర్ధరాత్రికి బందరు చేరాడు. రాగానే ప్రసాదు రూమ్‌మేట్ రాజారావు, పాటిపూడిలో కొట్లాట గురించి, సాధు వాళ్ళు హాస్పిటల్‌లో చేరిన విషయం చెప్పాడు. అంత అర్ధరాత్రిలోను ప్రసాదు హాస్పిటల్‌కి వెళ్ళిపోయాడు. సాధు తలకి కట్టుకట్టి ఉంది. నిద్రపోతున్నాడు. నాగేసు, గంగయ్య కూడా నిద్రపోతున్నారు. వెంకటేసుని పలకరించి వచ్చేసాడు.

తెల్లవారగానే ప్రసాదు ఆనందరావు మాష్టారింటికి వెళ్ళి, ఊరి విషయాలన్నీ చెప్పాడు. 'అయ్యో, నాకింతవరకూ తెలియలేద'ని నొచ్చుకున్నాడు ఆనందరావు.

"ప్రసాదు! ఇక్కడ మన అసోసియేషన్స్ చాలా ఉన్నాయి. లాయర్లు ఉన్నారు. నేను హాస్పిటల్‌కి వచ్చి వాళ్ళని చూస్తాను. మన అసోసియేషన్స్‌ని కలుద్దాం. నువ్వేంకేం ఆలోచించవద్దు!" అని ఆనందరావు భరోసా ఇచ్చాడు.

అక్కడి నుంచి ప్రసాదు హాస్పిటల్‌కి వెళ్ళి, అందరినీ పరామర్శించి, కాలేజీకి వచ్చి ఈ తంతు కాస్త ముగించుకుని, ఆనందరావు మాష్టారితో కలిసి ఎస్.సి. లీడర్స్ దగ్గరకెళ్ళాడు.

చల్లపల్లి పోలీసుస్టేషను నుండి అందర్నీ బయటికి తీసుకురావడానికి, ప్రసాదు, ఆనందరావు మాష్టారు, ఎస్.సి.నాయకులు, డి.యస్.పి, యస్.పి చుట్టూ చల్లపల్లి సి.ఐ. చుట్టూ, రెండుసార్లు తిరగవలసి వచ్చింది.

ఈ కొట్లాట తరువాత పాటిపూడి మాలపల్లి వాళ్ళకి భయం తగ్గింది. ఈసారి గొడవ వస్తే తన్నులు తినకూడదని, తమ జాగ్రత్తలో తాముండాలని నిర్ణయించుకున్నారు. ఈ కొట్లాట వాళ్ళందరిలో ఒక రకమైన మొండితనాన్నిచ్చింది. ఇవాళ ఎవరిదగ్గరా బేలతనపు మాటలు లేవు.

పెదబుజ్జి సాధుని ట్రాక్టరుపని మానమని కబురు చేసాడు. మరో పదిహేనురోజుల తరువాత, సుబ్రహ్మణ్యశాస్త్రి కౌలుకిచ్చిన పొలం తనే చేసుకుంటానని మాలపల్లికి కబురు పంపాడు.

★ ★ ★

మార్చి నెల. ఎండ చురుక్కుమంటోంది. గాలి కూడా వేగంగా వీస్తోంది. సమయం పదకొండుగంటలు దాటుతోంది. ప్రసాదు లైబ్రరీ పుస్తకాలు ఇచ్చేసి, తన నోట్‌బుక్స్ రెండూ తీసుకుని మెట్లు దిగి వస్తున్నాడు. మెట్లమీద తన క్లాస్‌మేట్ మాణిక్యం, మరో ఇద్దరు అమ్మాయిలు ఉన్నారు.

"ప్రసాద్," అంది మాణిక్యం పలకరింపుగా. మూడేళ్ళుగా వాళ్ళు క్లాస్‌మేట్స్. క్లాసులోనే కాదు, కాలేజిలో కూడా ప్రసాదు ఎప్పుడూ తనంతతానుగా అమ్మాయిలతో మాట్లాడలేదు. అమ్మాయిలూ తనని పలకరించలేదు. కాలేజీ ఖాళీ సమయాల్లోను, రూమ్‌లోను వినిపించే ప్రేమకబుర్లు, ఆడపిల్లల కబుర్ల మీద ఒక చెవివేసి ఉంచేవాడు కానీ, ఆసక్తిగా ఆ చర్చల్లో పాలుపంచుకోలేదు. ఆడపిల్లలతో మాట్లాడడానికి అతనికి అంత భయమూ లేదు.

"లైబ్రరీ నో డ్యూస్ తీసుకోవాలిగా. పుస్తకాలు ఇచ్చేసి నో డ్యూస్ తీసుకుందామని వచ్చాను. మీరు!" అన్నాడు సంభాషణ కొనసాగింపుగా.

"పుస్తకాలు ఇచ్చి వేరే పుస్తకాలు తీసుకుందామని వచ్చాను. ఏప్రిల్ ఫస్ట్‌వీక్

వరకూ టైముందిగా!" అంది.

మాణిక్యం పక్కనున్న ఇద్దరు అమ్మాయిల్లో ఒకామె ఆ కాలేజీలోనే బి.ఎస్సీ బోటనీ చదువుతోంది. మరో అమ్మాయిని ప్రసాద్ ఎప్పుడూ చూడలేదు. ఆ అమ్మాయి చూపు తనకి తెలిసినట్లు అనిపించింది. మరొకసారి వాళ్ళవైపు చూసాడు.

"సౌభాగ్య... తను తెలుసుకదా!" అంది మాణిక్యం కాలేజిలోనే బి.ఎస్సీ బోటనీ అమ్మాయిని చూపిస్తూ. తెలుసన్నట్లు తల ఊపాడు ప్రసాదు.

"విజయ, హిందూ కాలేజిలో బి.ఎస్సీ బోటనీ. మా ఇంటి పక్కనుంటోంది" అంది రెండో అమ్మాయిని పరిచయం చేస్తూ. అలాగా అన్నట్లు తలాడించాడు.

"ప్రసాద్, పామర్రులో చదువుకున్నావా!" అంది మాణిక్యం.

"అవును. ఇంటర్ అక్కడే చదివాను"

"ఇది పామర్రులోనే చదువుకుంది" అంది విజయని చూపిస్తూ.

కొంచెం ఆశ్చర్యంగా చూసాడు ప్రసాదు విజయ వంక. "చూసినప్పుడు ఎక్కడో తెలిసినట్టుగా అనిపించింది... కానీ గుర్తు రావడం లేదు" అన్నాడు.

"ఛాంపియన్ కదా అపుడు!" అంది విజయ- మేమెలా గుర్తుంటాంలే అనే అర్థం వచ్చేటట్లు.

"అప్పుడేమిటి, ప్రసాద్ ఇప్పుడూ ఛాంపియనే! వాలీబాల్ బాగా ఆడతాడు తెలుసా!" అంది మాణిక్యం.

ప్రసాదు తనలోని ఆటగాడిని అమ్మాయిలు పొగుడుతుంటే ఇష్టంగానూ, ఇబ్బందిగానూ నిల్చున్నాడు. వెళతానన్నట్లుగా వాళ్ళవైపు చూసాడు ప్రసాదు. విజయ కళ్ళలో పలకరింపు చూసి 'సరే, వెళతానండి' అని చెప్పి, ముగ్గురివైపు చూసి గబగబా మెట్లుదిగి కదిలిపోయాడు వయసు ఉత్సాహంతో.




**రా**త్రి వర్షం కురిసి నేలంతా ఆరి ఉంది. వేసవిలో పేరుకున్న దుమ్మంతా కొట్టుకుపోయి కాలేజిలో మొక్కలన్నీ పసిపిల్లలు స్నానం చేసినంత శుభ్రంగా ఉన్నాయి.

ప్రసాదుకి మోహనరావు ఉత్తరం రాసాడు. 'డిగ్రీ రిజల్ట్సు వచ్చాయి. నువ్వు సెకండ్ క్లాసులో పాసయ్యావు' అని. అది చూసుకుని ప్రసాదు కాలేజికి వచ్చాడు.

తను రెండేళ్ళు ప్రాక్టీస్ చేసిన వాలీబాల్ కోర్టులోకి వెళ్ళి నుంచున్నాడు. ఆ స్తంభాన్ని, కోర్టుని చూస్తుంటే, 'ఇక వీటితో నాకు సంబంధం లేదు' అనిపించినప్పుడు మనసు పీకినట్లుగా ఉంది ప్రసాదుకి. కాలేజి చాలా కొత్తగా, కళగా కనిపించింది. మూడేళ్ళ ఇక్కడి జీవితం, కె.బి.కె. పాఠం, షరోన్‌రాజు హిస్టరీ క్లాసు, టినోపాల్ ఇంగ్లీషు లెసన్, లక్ష్మీనారాయణ తెలుగు పాఠం... అన్నీ మనసు ముందు కదిలాయి. పి.డి.గార్ని కలుద్దామని పి.డి. రూమ్‌కి వెళ్ళాడు. తాళాలు వేసి ఉన్నాయి.

మార్కులిస్టు సంతకం చేసి తీసుకున్నాడు. 59.3% వచ్చింది. మార్కులు చూసుకుంటే సంతోషంగా అనిపించింది. "మరో వారంలో ప్రొవిజినల్సు వస్తాయి. వచ్చి తీసుకోవొచ్చు" అని క్లర్కు చెప్పాడు.



వాలీబాల్ ప్లేయర్‌గా ప్రసాదు స్టాఫ్ అందరికీ తెలుసు.

కిందికి వస్తూంటే, బెనర్జీ మాష్టారు కనిపించారు. 'గుడ్ మార్నింగ్ సార్" అన్నాడు ప్రసాదు.

"ఓహ్ వాలీబాల్ ప్లేయర్! వాట్ అబౌట్ యువర్ డిగ్రీ రిజల్ట్? " అని అడిగారు బెనర్జీ సార్.

"సెకండ్ క్లాస్ సార్" అన్నాడు ప్రసాద్. "వెరీ గుడ్" అని భుజం తట్టి ముందుకెళ్ళి పోయారు.

ప్రసాదు తెలియకపోయినా లెక్చరర్లలో చాలా మందికి ప్రసాదు తెలుసు. అయితే ఎవరి మనసుకి చేరువయ్యేంత సాన్నిహిత్యం ప్రసాద్‌కి లేదు. నిజానికి చదువు కూడా బాగా చదివే విద్యార్థే. కానీ అతన్ని అందరూ ఆటగాడిగానే గుర్తించేవారు. మిగిలిన నలుగురికి డిగ్రీ పూర్తికాలేదు.

పెద్దమ్మ కొడుకు పెద్దన్నయ్యకి ఉత్తరం రాసి పోస్టుచేసి, ఇంటికి వెళ్ళిపోయాడు. రెండు రోజులాగి పామర్రు పెద్దమ్మ దగ్గరికి వెళ్ళి ఉన్నాడు. అక్కడి నుండి టి.సి, ప్రొవిజినల్ సర్టిఫికేట్ తీసుకుని, పెద్దమ్మ ఇంట్లోనే ఉంచాడు.

★ ★ ★

బి.ఏ. పూర్తయింది. ఇక ఏమిటి చెయ్యడమనేది ప్రసాదు ముందున్న ప్రశ్న! ముందుగా ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజికి వెళ్ళి, రిజిస్ట్రేషన్ చేయించాడు. బి.ఇడి చేద్దామంటే ఎంట్రన్స్ టెస్ట్‌కి అప్లై చెయ్యలేదు. ఇక మిగిలింది- ఇంటికి వెళ్ళి నాన్నతో కలిసి కూలీ పనులకి వెళ్ళడం.

ప్రసాదు పెద్దన్నయ్య నుండి ఉత్తరం వచ్చింది.

"ప్రసాదు, మా ముగ్గురిలో ఎవరం యూనివర్శిటీలో చదవలేకపోయాం. నువ్వు 59% అని రాసావు. బి.ఏకి అది మంచి పర్సంటేజ్. తప్పనిసరిగా యూనివర్శిటీకి అప్లై చెయ్యి. సీటొస్తుంది. డబ్బుల గురించి ఆలోచించకు. నీకు స్కాలర్‌షిప్ ఉంటుంది. అవసరమైతే మేమున్నాం. పేపర్లో నోటిఫికేషన్ పడుతుంది. తప్పనిసరిగా అప్లై చెయ్యి. చిన్నమ్మని, బాబాయిని అడిగానని చెప్పు" అని రాసాడు. ఈ ఉత్తరం ప్రసాదుకి కొత్త ఊపిరిని ఇచ్చింది.

ఒకవైపు అమ్మానాన్నలతో వ్యవసాయపు కూలీపనులకి వెళుతూనే ఘంటశాల వెళ్ళి పేపరు చూస్తూ ఉండేవాడు. ఆంధ్రా యూనివర్శిటీ నోటిఫికేషన్ పడింది. సర్టిఫికేట్లన్నీ పెద్దమ్మ దగ్గరే ఉండడంతో అప్లై చెయ్యడానికి పామర్రు వెళ్ళాడు.

పామర్రు పోస్టాఫీసులో పోస్ట్‌చేసి, బయటకు వచ్చాడు. దేవాలయం వీధి గుండా వస్తూంటే, సందుమలుపు తిరిగి విజయ ఎదురుపడింది. ఇద్దరు చిన్నపిల్లలున్నారు ఆమె పక్కన. అప్రయత్నంగా ఇద్దరూ పలకరింపుగా ఆగిపోయారు.

"ఏమిటిటొస్తున్నారు? " అన్నాడు ప్రసాదు.

"ఆంధ్రా యూనివర్శిటీకి అప్లై చేద్దామని పోస్టాఫీసుకెళుతున్నాను. మీరు? " అంది విజయ.

విజయ అక్క పిల్లలిద్దరూ కూడా నిలబడిపోయి ప్రసాదు వైపు చూస్తున్నారు.

"నేను అదేపని చేసొస్తున్నాను" అన్నాడు.

"ఈరోజు పోస్ట్ చేస్తే అందిపోతుందంటారా!" అంది విజయ. ఏదో ఒకటి మాట్లాడాలనుంది.

"ఎందుకెళ్ళదండి? ఇంకా పదిరోజులు టైముందిగా!" అన్నాడు ప్రసాదు. ఇంకా ఏమైనా మాట్లాడాలని ఉంది. సంభాషణ ఎలా కొనసాగించాలో తెలియడంలేదు.

వెళతానన్నట్లు తలాడించి, ప్రసాదు కళ్ళలోకి చూసి ముందుకు కదిలింది విజయ.

"పదండి నేనూ వస్తాను. ఇంటి కెళ్ళడమే! మరేం పనిలేదు" అంటూ విజయతోపాటు కదిలాడు ప్రసాదు. పిల్లలూ కదిలారు. ఇద్దరి మధ్య మౌనమే మాటలు...

తల కొంచెం వాల్చి నడుస్తున్న విజయ ముఖంలోకి వచ్చిన వెలుగు తెలుస్తోంది ప్రసాదుకి.

తల తిన్నగా పెట్టి ముందుకి నడుస్తూ,

## కొత్తగాలి...

**పుస్తకం**
**మూసుకుంటే**
**పుటలు తెరుచుకుంటే**
**భావాల సాగరం**

—అనూరాధ రామకృష్ణ, నెల్లూరు

కళ్ళ చివరల నుంచి తనమీద పడుతున్న ప్రసాదు చూపులు మనసుకి గంధం పూస్తున్నాయి.

పోస్టాఫీసులో జనం లేకపోయినా అర గంట గడిచింది. నోబుల్ కాలేజినుంచి, హిందూ కాలేజి నుంచి యూనివర్సిటీకి అప్లై చేసేవాళ్ళ గురించి, వాళ్ళవీ వీళ్ళవీ పెర్సంటేజిల గురించి మాట్లాడుకున్నారు.

"ఇంటర్మీడియట్ ఒకే కాలేజిలో చదువు కున్నాం. మళ్ళీ మనం ఒకే యూనివర్సి టీలో కలుస్తామన్న మాట!" అన్నాడు ప్రసాదు పోస్టాఫీసు నుంచి బయటకొస్తూ. నవ్వుతూ అవునన్నట్టు తలూపి వెళ్ళిపో యింది పిల్లలతో.

సందు మలుపు తిరుగుతూ వెనక్కి చూసిన విజయకి, సందుకి ఆ చివర ప్రసాదు కనబడ్డాడు.

బస్సుకోసం నిలబడిన ప్రసాదుకి కృష్ణ మాచార్యులు కనిపించాడు. అతను బందరు హిందూ కాలేజిలో బి.ఎస్సీ ఫిజిక్సు చేసాడు.

"ఏమిటి ప్రసాదూ విశేషాలు? బి.ఇడి ఎంట్రన్స్ రాసావా? " అన్నాడు.

"లేదు. అపుడు గమనించుకోక అప్లై చేయనేలేదు. ఆంధ్రా యూనివర్సిటీకి అప్లై చేసి వస్తున్నాను"

"పర్సంటేజి ఎంతుంది? "

"ఫిఫ్టీనైన్"

"రిజర్వేషన్ ఉందికదా, రావచ్చులే "

మనస్సు చివుక్కుమంది. కానీ చాలా మంది నోటిలోంచి వింటున్న మాట ఇది. కాస్త తేరుకుని ప్రసాదు, "మరి నువ్వేం జేస్తావ్? " అనడిగాడు.

"మానాన్నగారు ఏమంటారో చూడాలి"

కాసేపు పిచ్చాపాటి మాట్లాడుకుంటుంటే బస్సు వచ్చేసింది.

★ ★ ★

ఆంధ్రా యూనివర్సిటీ ఆవరణ.

నాగార్జున హాస్టల్. రూమ్ నెంబరు 201- చూసుకుంటూ వెళ్ళి తలుపు తట్టాడు ప్రసాదు.

"కమిన్" అని వినబడింది.

తలుపు తోసుకుని లోపలికి వెళ్లాడు.

"ప్రసాదువికదా! " అన్నాడు లోపల రాసుకుంటున్న కృష్ణమూర్తి, రాత ఆపి ప్రసాదుని చూస్తూ.

"అవునన్నా" అన్నాడు ప్రసాదు.

"కూర్చో! నిన్ననే మీ అన్నయ్య ఉత్తరం అందింది. నీ కోసమే వెయిట్ చేస్తు న్నాను" అన్నాడు కృష్ణమూర్తి.

"అన్నయ్య నాకూ ఉత్తరం రాసాడన్నా" అని ఉత్తరం చూపించాడు.

"అవునూ, నేను గుర్తున్నానా? రెండేళ్ళ క్రితం నీ రూమ్‌కి వచ్చాం"

"మీరు గుర్తున్నారన్నా! నన్ను గుర్తు పడతారా లేదా అని బయపడ్డాను"

"నేను లేకపోయినా క్యాంపస్‌లో ఎవరో ఒకరు నీకు సాయం చేస్తారు. ఆ సమస్య ఏమీ ఉండదు" అని,

"సింహాద్రికొచ్చావా! బేగు అదీ లోపల పెట్టుకో. లుంగీ, టవల్ తెచ్చుకున్నావు కదా!" అన్నాడు.

"తెచ్చుకున్నానన్నా"

ప్రసాదుని బయటికి తీసుకొచ్చి "అక్కడ బాత్‌రూముంది" అని చూపించి, "వెళ్ళి స్నానం చేసిరా! ఎనిమిది దాటిపోతోంది. భోజనానికి వెళదాం!" అన్నాడు కృష్ణ

మూర్తి.

ప్రసాదు స్నానం చేసి వచ్చాడు. ఇద్దరూ స్కాలర్స్ హాస్టల్ కి వెళ్ళి భోజనం చేసి వచ్చారు.

"ప్రసాద్! నాకు రాతపని ఉంది. నువ్వు పడుకోవాలనుకుంటే పడుకో. లేదూ కాసేపు బైటికి వెళ్ళిరా! నేను అర్జంటుగా ఓ వ్యాసం తయారు చెయ్యాలి" అన్నాడు రీసెర్చి స్కాలర్ కృష్ణమూర్తి.

ప్రసాదు నాగార్జున హాస్టలు చివరి అంతస్తులో కారిడార్ అంతా కలియతిరిగాడు. ఎటు వెళుతున్నాడో తెలియలేదు. ఒకసారి రూమ్‌నెంబరు 201 గది తప్పిపోయాడు. అక్కడి నుండి మెట్లెక్కి పైకి వెళ్ళాడు. విశాఖపట్నం దేదీప్యమానంగా కనబడుతోంది ఇక్కడి నుండి. చాలా మంది టెర్రస్ మీద కూర్చొని ఉన్నారు. టెర్రస్ మీద తూర్పువైపుకి వెళ్ళాడు. నమ్మలేకపోయాడు. సముద్రపు హోరు! సముద్రంలో దూరంగా అక్కడొకటి అక్కడొకటి వెలుగులు విరజిమ్ముతూ ఓడలు నిలిచి ఉన్నాయి. తన్మయత్వంతో చూసాడు. కాసేపు చూసి కిందికి వచ్చాడు.

రూమ్‌లో కృష్ణమూర్తి తదేక దృష్టితో రాసుకుంటున్నాడు. ప్రసాదు రాకని గమనించి, "ప్రసాదు! ప్రయాణం చేసి వచ్చావు కదా! ఆ చాప వేసుకుని పడుకో! నేను ఇంకాస్సేపు రాసుకోవాలి. నేను ఉదయమే బయటకు వెళ్ళాలి. నిన్ను ఒక ఫ్రెండుకి అప్పజెపుతాను. నీ అడ్మిషను అతను చూస్తాడు. నేను మధ్యాహ్నం రెండుగంటలకి వచ్చేస్తాను. ఈలోపు నీ అడ్మిషను అయిపోవచ్చు. సరే, నువ్వు నిద్రపో!" అని రాతలో మునిగిపోయాడు.

ప్రసాదు చాప పరుచుకుని పడుకున్నాడు. నిద్ర రావడంలేదు. రూమ్‌ని పరిశీలిస్తున్నాడు. అక్కడ గోడకున్న అల్మరా నిండా పుస్తకాలున్నాయి. టేబుల్ లాగ కట్టిన సిమెంట్ ప్లాట్ ఫారమ్ పైనున్న షెల్ఫ్‌లో కూడా చాలా పాత పుస్తకాలు పెట్టి ఉన్నాయి. ఒక మూలగా అంబేద్కర్ ఫోటో ఉంది. ఇంకే ఫోటోలూ లేవు. సినిమా హీరోయిన్ల బొమ్మలున్న పోస్టర్లు గానీ లేవు. చక్కగా బోర్డర్ కాగితం అంటించి ఉన్న పేపర్‌కటింగ్ ఒక్కటి మాత్రం గోడకి అతికించి ఉంది. ఒక అందమైన జంట లాన్‌లో కూర్చున్న దృశ్యం. చూస్తున్నకొద్దీ ఆ పేపర్‌కటింగ్‌లో దృశ్యం చాలా అందంగా అనిపించింది. అది చూస్తుంటే, హఠాత్తుగా విజయ గుర్తొచ్చింది ప్రసాదుకి. ఆ రూమ్‌ని పరిశీలిస్తూనే నిద్రలోకి వెళ్ళిపోయాడు.

★ ★ ★

క్యాంపస్ అంతా పచ్చగా అల్లుకుపోయిన రంగు రంగుల బటానీ పూల తీగలు! దట్టమైన ఆకులతో ఉన్న పెద్ద పెద్ద చెట్లు! పొదరిళ్ళలా జీడిచెట్లు, చక్కగా తీర్చిదిద్దిన తారురోడ్డు. రోడ్డు కిరువైపులా విరగపూసిన పసుపు తంగేడిపూలు. నడిచేవారి మీద పూలజల్లులు కురిపిస్తూ, ఆ చెట్ల కింద పరచుకున్న పూలు! ప్రసాదుకి కొత్త ప్రపంచంలోకి వచ్చినట్లుగా ఉంది. అడ్మిషన్ రిసీట్‌తో ప్రసాదుని, హాస్టల్లో చేర్చిన తరువాత లైబ్రరీకి తీసుకొచ్చి చూపించాడు కృష్ణమూర్తి. అక్కడున్న కార్డు క్యాటలాగుని ఎలా ఉపయోగించుకోవాలో చెప్పాడు. లైబ్రరీలో అన్ని సెక్షన్స్‌ని చూపించాడు. ఇంటర్నేషనల్ లైబ్రరీ కోడ్‌ని, దాని ద్వారా పుస్తకాన్ని తీసుకోవలసిన పద్ధతులని ప్రసాదుకి చూపించాడు. టాప్ ఫ్లోరులో ఉన్న రికార్డు సెక్షన్‌కి వెళ్ళారు. అక్కడ కూర్చుంటే చల్లటిగాలి రావడమే కాదు నీలి సముద్రం విశాలంగా ఆహ్వానిస్తూ కనిపించింది ప్రసాదుకి.

"అన్నా, సముద్రం దగ్గరికి వెళ్ళొచ్చా?

ఎంత దూరం ఉంటుంది? " అని అడిగాడు కుతుహలం ఆపుకోలేక.

"దగ్గరే. రోజూ వెళ్ళొచ్చు"

కిందికి దిగుతున్నారు ఇద్దరూ.

"ప్రసాద్! నాకు స్కాలర్స్ హాస్టల్లో రూమ్‌నెంబర్ 88 ఎలాటయింది. ఈపాటికే ఆ రూమ్‌లో చేరిపోవాలి. మీ అన్నయ్య ఉత్తరం రాసాడు, నువ్వు ఇబ్బంది పడతావని షిఫ్ట్ అవలేదు. రేపు అక్కడికి మారిపోతాను. నువ్వు ఈ రూమ్‌లో ఉండిపోవచ్చు. హాస్టల్ ఆఫీసులో నీకీరూమ్ ఎలాట్ చెయ్యమని చెప్తాను. ఎప్పుడైనా, ఏ అవసరమున్నా నా దగ్గరికి నిరభ్యంతరంగా రా!" అని చెప్పాడు కృష్ణమూర్తి.

లైబ్రరీ బయటకొచ్చి నిలబడ్డారు.

"ఇంత పెద్ద లైబ్రరీ మనలాంటి వాళ్లకి దొరికేదికాదు. దాన్ని ఉపయోగించుకో. ఇక్కడ చేరామంటే ఎమ్.ఏ పాసవుతాం, దానికోసం ఎక్కువ శ్రమపడనక్కర్లేదు. ఈ లైబ్రరీని ఉపయోగించుకో. విశాఖ, మన క్యాంపస్ చాలా బావుంటాయి... ఈ రిసీట్ చూపించి మెస్‌కి వెళ్లు. నీకు మధ్యాహ్నం నుండే భోజనం పెడతారు. మిగతా విషయాలు నీకే తెలుస్తాయి..." అన్నాడు కృష్ణమూర్తి. లైబ్రరీ నుంచి హాస్టల్ వైపుకొచ్చారు.

ప్రతి అడుగులో ఆనందం కనిపిస్తోంది ప్రసాద్‌కి. పెద్దన్నయ్యకి ఉత్తరం రాయాలి- విజయ చేరిందా! కృష్ణమాచార్యులుకి సీటు వచ్చిందో లేదో! మాణిక్యం హిస్టరీలో చేరి ఉంటుంది అనుకున్నాడు.

పి.జి రెండవ సంవత్సరంవాళ్లకి పరీక్షలు జరుగుతున్నాయి. కాబట్టి క్లాసులు జనవరి 18 నుండి ప్రారంభమవుతాయని చెప్పారు. ప్రసాదు మర్నాడుండి, కృష్ణమూర్తి రూమ్ షిఫ్టింగ్‌కి తోడుగా ఉండి, ఆ సాయంత్రం ఊరికి బయలుదేరాడు.

★ ★ ★

సంక్రాంతి తరువాత క్యాంపస్‌కి వచ్చాడు ప్రసాద్. నాలుగైదు రోజులకి క్యాంపస్‌లో పరిసరాలకి అలవాటు పడ్డాడు.

కొంతసేపు మధనపడి, బోటనీ డిపార్టుమెంటు వైపు అడుగులు వేసాడు. డిపార్టుమెంటు గేట్ దగ్గర కొచ్చేసమయానికి కొందరు స్టూడెంట్స్ గేటుదాటి ముందుకు నడుస్తున్నారు. 'ఇప్పుడే విడిచి పెట్టినట్లున్నారు' అనుకున్నాడు. గేటు వైపు చూసేటప్పటికి గబగబ నడుస్తూ విజయగేటు దగ్గరికి వస్తోంది. ఒక్కసారిగా శరీరంలో తెలియని ప్రవాహం! వేగంగా నడిచేకాళ్లు మందగించాయి. విజయ ప్రసాద్‌ని చూసి నవ్వింది. తననే చూస్తూ ముందుకు వస్తున్న విజయ కళ్లనే చూస్తూ ఆగిపోయాడు. ఇద్దరూ పలకరించుకున్నారు.

"ఎప్పుడు చేరారు మీరు" అన్నాడు ప్రసాదు.

"టెన్త్‌న చేరి ఇంటికి వెళ్లి సంక్రాంతి తరువాత మళ్లీ వచ్చాను. మీరెప్పుడు చేరారు? "

"నేను జనవరి ఐదున చేరాను. ఇంటికెళ్లి సంక్రాంతి తరువాత రావడమే!"

"మాణిక్యం కూడా చేరింది కదా!"

"తను హిస్టరీ. నేను ఆర్కియాలజీలో చేరాను. ఇంతవరకూ మాణిక్యంతో మాట్లాడ్డమే కాలేదు. వెంట వెంటనే క్లాసులు! అసలు ఖాళీ ఉండడం లేదు"

"మాకూ అంతే. నెక్స్ట్‌వీక్ నుండి ప్రాక్టికల్స్ అంటున్నారు"

"ఆర్కియాలజీ కదా! మాకు ఫీల్డ్ ట్రిప్స్ ఉంటాయన్నారు"

"మీరే హాస్టల్‌లో ఉంటున్నారు? "

"నాగార్జున"

"ఆర్ట్స్ కాలేజికి దగ్గర కదా! లైబ్రరీకి రావాలన్నా మీకు దగ్గర, హాస్టల్ నుంచి"

"నాగార్జున తెలుసా మీకు? "

"మా చిన్నాన్న అటువైపు నుండే తీసు కొచ్చారు జాయిన్ అయ్యేటప్పుడు"

"మీరు హాస్టల్‌లో కాదా ఉండేది?"

"హాస్టలే. న్యూబ్లాక్. మా చిన్నాన్న ఇంటి దగ్గర ఉండమని గొడవ. నాకు హాస్టల్లో ఉండాలని"

"అయితే మీకు సముద్రం పక్కనే"

"మొదట రెండ్రోజులైతే ఆ హోరుకి నిద్ర పట్టలేదు. సూర్యోదయం ఎంత బావుంటుందో! మీ హాస్టల్ నుంచి కనిపిస్తోందా!"

"కనిపిస్తోంది. నాకైతే సముద్రం ఒడ్డుకి వెళ్ళి కూర్చొని చూడాలనిపిస్తుంది. సెలవొచ్చినపుడు వెళతాను"

ఈ మాటల మధ్యలో, లేడీస్‌హాస్టల్‌కి బస్సులు బయలుదేరే చోటుకి వెళ్ళే దూరం కరిగిపోయింది. బస్సు కదిలి ముందుకొచ్చేస్తుంటే, విజయ బస్సుఎక్కడానికి వేగంగా వెళుతూ, "వస్తాను. భోజనం చేసి లైబ్రరీ టికెట్స్ తీసుకోవాలి" అని బస్సెక్కేసింది.

ఆ రోజు మధ్యాహ్నం ఇద్దరూ లైబ్రరీలో మళ్ళీ కలుసుకున్నారు.

★ ★ ★

నీలి సముద్రపు అలలు, దూరంగా పచ్చని సింహాచలం కొండలు! అసెంబ్లీ హాల్లోనో, ఓపెన్ ఎయిర్ థియేటర్‌లోనో ఏదో ఒక కార్యక్రమం జరుగుతూ ఉంటుంది. సెమినార్లు, సభలు, సమావేశాల అకడమిక్ వాతావరణం! అందులో మమేకమైపోయాడు ప్రసాద్.

ఉదయం లేవగానే కాసేపు వ్యాయామం చేస్తాడు. టిఫిన్ చెయ్యడానికి ముందుగా వెళ్ళేది ప్రసాదే. టిఫిన్ అయ్యాక పుస్తకాలు తీసుకుని ఆర్ట్స్ కాలేజికి నడుచుకుంటూ వెళ్ళేవాడు. ఎవరైనా కలిస్తే కలుస్తారు. లేదా ఒంటరిగానే. ఖచ్చితంగా ఒకరితో బ్యాచ్‌గా కలిసి వెళ్ళాలనే నియమం లేదతనికి. రెండో బెంచిలో కూర్చుంటాడు. పాఠం శ్రద్ధగా వింటాడు. మొదట్లో పూర్తి ఇంగ్లీషు మీడియంలో పాఠాలు చెబుతుంటే అందుకోవడం కాస్త కష్టంగా ఉండేది. తరువాత క్రమంగా అలవాటయ్యింది. అవరేదైనా ఖాళీ ఉంటే లైబ్రరీకి వెళ్ళి పేపర్ చూసి వచ్చేవాడు. లంచ్ తరువాత లైబ్రరీకి వెళ్ళి నాలుగున్నర వరకూ అక్కడ చదివేవాడు. సాయంత్రం గ్రౌండ్‌కి. రాత్రి భోజనం చేసి ఎక్కువగా లైబ్రరీకి.

ప్రసాద్ లైబ్రరీ వెనక నుంచి నాగార్జున హాస్టల్ వైపు వెళ్ళాడు. నాగార్జున హాస్టల్‌కి చేరుకునేటప్పటికి హాస్టల్ చాలా హడావుడిగా గొడవ గొడవగా ఉంది. ఏమిటంటే, ఎస్.సి, ఎస్.టి, బి.సి. అసోసియేషన్ మీటింగ్ జరుగుతుంది. అందరూ

## వీక్ పాయింట్స్

క్లబ్బునుంచి వస్తున్న భార్యాభర్తల కారుని పోలీసులు ఆపేశారు. డాక్యుమెంట్లన్నీ పరిశీలించి లైసెన్స్ ఎందుకు రెన్యూవల్ చేయించలేదని అడిగారు. 'డేట్ అయిపోయిందని తెలియదు.. వెంటనే చేయిస్తాను' అన్నాడు భర్త దీనంగా. దీంతో భార్య కోపంగా, 'వారం క్రితమే ఇంటికి లెటర్ వచ్చిందని చెప్పా కదా?' అంది. చిరాకెత్తిన భర్త 'నువ్వు నోర్మూసుకో?' అన్నాడు. ఇదంతా చూస్తున్న పోలీసులు, 'ఎప్పుడూ ఇలాగే అరుస్తుంటాడా?' అడిగారు. 'తాగినప్పుడు మాత్రమే' చెప్పిందామె.????



## కొత్తగాలి...

**పీటర్ ఇంగ్లాండ్ చొక్కా**
**కార్పొరేట్ ఆస్పత్రి వైద్యం**
**ఉరికొయ్యకు మాత్రం**
**నేత కార్మికుడు**

—వేలూరి కౌండిన్య, విజయవాడ

టెర్రాస్ మీదికి రావాలన్నారు. ప్రసాద్ వెళ్లి కూర్చున్నాడు.

★ ★ ★

ఆర్కియాలజీ మ్యూజియం ముందు మాణిక్యం నిలబడి ఉంది. ప్రసాద్ దగ్గరికి వెళ్లి పలకరించాడు.

మాణిక్యం హిస్టరీలో, ప్రసాద్ ఆర్కియాలజీలో చేరడంతో ఒకళ్లనొకళ్లు చిరునవ్వుతో పలకరించుకుంటారు. మాట్లాడుకునేంత వెసులుబాటు ఉండదు కానీ, ఇంత దూరం వచ్చాక ఇద్దరమూ ఒక ప్రాంతం వాళ్లమనే అభిమానం. అవసరానికి ఆసరా.

మాణిక్యం వాళ్ల నాన్న బ్యాంకు మేనేజరు. కూతురికి చదువు వస్తుంది. కనుక చదివినంతవరకూ చదివించాలని ఆయన ఉద్దేశం. అందుకే కూతుర్నిక్కడ చేర్పాడు.

ప్రసాద్ యూనివర్శిటీ గురించి అసలెప్పుడూ ఆలోచించలేదు.

అనుకోకుండా వచ్చిన అవకాశం కావడంతో దాన్ని పొదివి పట్టుకొని వినియోగించుకోవాలన్నది అతని ఉద్దేశం.

మాణిక్యం కాస్త నీరసంగానూ, కళ్లల్లో జీవం తక్కువగానూ కనిపించింది.

"నీరసంగా ఉన్నావేమిటి? " అన్నాడు ప్రసాద్.

"అవును ప్రసాదూ, ఒంట్లో బావుండడం లేదు. హాస్పటల్‌కి వెళదామనుకుంటున్నాను. ఎక్కడో చెప్పారు. కానీ నాకు తెలియడం లేదు" అంది కళ్లల్లోకి దుఃఖం తెచ్చుకుంటూ.

చిన్న అనారోగ్యానికే ఎందుకేడుపు తెచ్చుకోవాలో ప్రసాద్‌కి అర్థం కాలేదు.

"నార్త్ కేంపస్, సౌత్ క్యాంపస్ అని రెండు ఉన్నాయి. సౌత్ క్యాంపస్ పెద్దది. వెళదామంటే నేను తీసుకెళతాను" అన్నాడు.

"నీకు క్లాస్ ఉందిగా!"

"ఒకరోజు పోతే ఏం కాదులే! బుక్స్ ఫ్రెండ్స్‌కిచ్చి వస్తాను. నువ్వు కిందికి నడుస్తూ ఉండు" అని ప్రసాద్ లోపలికి వెళ్లాడు. మాణిక్యం ఆర్ట్స్ కాలేజి మెట్లు దిగేలోపే కలుసుకున్నాడు.

"విజయ, సౌభాగ్య వస్తామన్నారుగానీ, సెకండవర్ అయ్యాక వస్తామన్నారు. వాళ్ల ప్రొఫెసర్ క్లాసట. మానడానికి భయపడిచస్తారు. వాళ్లొచ్చేటప్పటికి పదిన్నర దాటిపోతుంది. డాక్టర్స్ ఉదయమే వస్తారట కదా!" అంది ప్రసాద్‌వైపు తిరిగి.

"నాకా సంగతి తెలీదు. హాస్పటల్ తెలుసు" అన్నాడు ప్రసాద్.

"హాస్టల్లో అసలేమీ శుభ్రంగా ఉండదు ప్రసాదూ! తిండి సహించడంలేదు. కడుపులో నొప్పి! ఇక్కడ అందరికీ అమిబియాసిస్ వస్తుందట కదా!..." అని అనారోగ్యాల గురించి చాలా వివరాలే చెప్పుకుంటూ నీరసంగా కాళ్లీడ్చుకుంటూ అతనికి ఒకడుగు వెనక నడుస్తోంది.

ఈ మాటలన్నీ విన్న తరువాత అర్థమయింది ప్రసాద్‌కి- తన ఆరోగ్యం గురించే మాణిక్యం అంత బిక్కముఖం వేసిందని.

సౌత్ క్యాంపస్ వెళ్లే సమయానికే డాక్టర్ టి.వి. రావుగారు ఉన్నారు. మందులు తీసుకున్నాక, మాణిక్యాన్ని హాస్టల్‌కి వెళ్లమని చెప్పి తను క్లాసుకు వెళ్లిపోయాడు.

క్లాసుకు వెళ్లి కూర్చోగానే, అందరి కళ్లూ ప్రసాద్ మీదికి మళ్లాయి. రీసిస్‌లో సుధీర్ దగ్గరికి వచ్చి, "ప్రసాద్ ఏమిటి కథ? క్లాసు మానేసావు!" అన్నాడు నవ్వు మొహం పెట్టుకుని.

ప్రసాదు కాస్త కరుకు సమాధానం చెప్పకపోతే కష్టం అనుకొని, "డిగ్రీలో నా క్లాసు మేట్, చాలా!" అన్నాడు కరుగ్గా.

"అంత కోపమొస్తే అడగను లేన్నా, అన్నో, అడగనులే!" అన్నాడు వెటకారంగా సుధీర్.

"నీకు చెబుతున్నది కూడా అదే. మళ్లీ అడగొద్దని"

ఇదేదో వ్యవహారం ముదిరేటట్లు వుందని ప్రక్కనున్న నలుగురూ కదిలారు.

సుధీర్ కూడా కోపంగా 'పదం(డ్రా' అని వెళ్లిపోయాడు.

★ ★ ★

"దిక్కు మొక్కు లేని జనం, ఒక్కొక్కరు అగ్నికణం" - ఎస్.ఎఫ్.ఐ

"హిందువునని గర్వించు" - ఎ.బి.వి.పి

"నిన్న తెల్లవాడు నిన్ను బానిస అన్నాడు.

నేడు నల్లవాడు నిన్నుదోచుకుతిన్నాడు"

- ఎ.ఎస్.ఎఫ్.ఐ

"యజ్ఞానికి మేకల్నే బలి ఇస్తారు. పులుల్ని కాదు"

- డా॥ అంబేద్కర్

అని రాసిన స్లోగన్లు క్యాంపస్ గోడల మీద అక్కడక్కడా కనిపిస్తూ ఉంటాయి.

పొట్టిగా దృఢంగా ఉన్న ఒక వ్యక్తి డబ్బా తీసుకుని,

"కులం పునాదుల మీద ఒక జాతిని నిర్మించలేరు"

-డా॥ అంబేద్కర్

"భారతదేశ విముక్తికి అంబేద్కర్ ఆలోచనలే శరణ్యం"- అని రాస్తూ కనిపించాడు. ఆ రాస్తున్న వ్యక్తిని ప్రసాదు ఇంతకు ముందే చూసిన గుర్తుంది. ప్రసాదుకి జిమ్‌లో కనిపిస్తూ ఉంటాడు- అప్పుడప్పుడూ వెయిట్ లిఫ్టింగ్ ప్రాక్టీసు చేస్తూ. అతన్ని గుర్తు పట్టాడు. ఈసారి కనిపిస్తే అడగాలనుకున్నాడు. అంబేద్కరు షెడ్యూల్డు కులాల కోసం ఎక్కువ కృషి చేసినట్లుగా మాత్రమే ప్రసాదుకి తెలుసు. దేశ విముక్తికి అంబేద్కర్ ఆలోచనలు శరణ్యం! ఎలా? - కమ్యూనిజం కదా ప్రపంచ శ్రామిక విముక్తి చేసేది! అతన్నే అడగాలి.

ఒకరోజు ప్రసాదు జిమ్‌కి వెళ్లేటప్పటికి పేరలల్ బార్‌మీద ఎక్సర్‌సైజ్ చేస్తున్నాడతను. ప్రసాదు అక్కడే ఆగాడు. బార్ మీద ఎక్సర్‌సైజ్ చేస్తూనే, "ఏంటి తమ్ముడూ, నా కోసమా!" అన్నాడు గగారిన్.

"అవునండి!" అన్నాడు ప్రసాదు.

"రెండు నిముషాలాగు వస్తాను" అని ఆ ఎక్సర్‌సైజ్ పూర్తి అయ్యాక వచ్చాడు. ఏమిటి అన్నట్టు చూసాడు.

"మీతో మాట్లాడాలండి" అన్నాడు ప్రసాదు.

"దేని గురించి? "

"అంబేద్కర్ గురించి"

"ఐతే, ఓ పని చెయ్. నువ్వూ జిమ్‌కే గదా వచ్చింది! ఇద్దరమూ ఎక్సర్‌సైజులు పూర్తి చేసుకుని కలిసి వెళదాం" అని తన పనిలో నిమగ్నమై పోయాడతను. ప్రసాదు కూడా తన పనిలో పడిపోయాడు.

"వెళదామా తమ్ముడూ" అన్నాడు గగారిన్. బయలుదేరారు. "నువ్వు ఎస్.సి.వే కదా!" అన్నాడు. అవునన్నట్టు తలూపాడు ప్రసాదు.

"నువ్వు ఎస్.సి.వి కాకపోతే అంబేద్కర్ గురించి మాట్లాడడానికి ఎందుకొస్తావ్? ఏమిటో చెప్పు"

"అన్నా, మీరు అంబేద్కర్ ఆలోచనా విధానమే ఈ దేశ విముక్తికి శరణ్యం అని రాయడం చూసాను. ఎలా అవుతుందన్నా? కమ్యూనిజం కదా!" అన్నాడు ప్రసాదు.

గగారిన్ నవ్వుతూ ప్రసాదు భుజంమీద చెయ్యి వేసాడు.

"అంబేద్కర్ గురించి నువ్వేం చదివావు? "

"అంబేద్కర్ జీవిత చరిత్ర చదివాను. కుల నిర్మూలన చదివాను".

"ఇపుడూ, గాంధీ జీవిత చరిత్ర చాలా మంది రాశారు. ఏదో ఒకరు రాసిన గాంధీ జీవిత చరిత్ర చదివితే గాంధీ గురించి పూర్తిగా తెలుస్తుందా? "

"తెలియదన్నా"

"నువ్వింకా ఎవరి జీవిత చరిత్రలు చదివావ్? "

"అల్లూరి సీతారామరాజుది, సుభాష్ చంద్రబోసుది, వీరేశలింగం పంతులుది"

"చదవడం అలవాటుందన్నమాట!... వీళ్ళ జీవిత చరిత్రల ద్వారా వీళ్ల రాజకీయ విధానమూ, ఆలోచనా దృక్పథం, అన్నీ క్షుణ్ణంగా తెలుస్తాయా? "

"తెలియవన్నా"

"అలా తెలియనప్పుడు, అంబేద్కర్ జీవిత చరిత్ర మాత్రమే చదివి, అంబేద్కర్ గురించి నేను రాసింది తప్పని ఎందుకనుకుంటున్నావు? "

" .............. "

ప్రసాదు మౌనంగా ఉండిపోయాడు.

"ముందు అంబేద్కరు రాసిన పుస్తకాలు చదువు! ప్రస్తుతం ఇంగ్లీషులోనే దొరుకుతున్నాయి. అన్నీ ప్రింట్ కూడా కాలేదు. మనకి దొరికేవైనా చదువు... ఒక అభిప్రాయానికి రా. అప్పుడు కూడా నేను రాసింది తప్పనిపిస్తే, ఫలానా విధంగా తప్పు అని చెప్పు. నేను తప్పయితే మార్చుకుంటాను" స్థిరంగా, సౌమ్యంగా ఉంది ఆ గొంతు.

ఇద్దరూ జిమ్ నుండి సిద్ధార్థ హాస్టల్ వరకూ నడుచుకుంటూ వచ్చారు.

"రా! ఒకసారి మా రూమ్‌లోకి వచ్చి వెళుదువు గాని. అన్నట్లు నా పేరు గగారిన్. నీ పేరు? "

"నా పేరు ప్రసాదు. ఆర్కియాలజీ ఫస్టియర్. మాది బందరు దగ్గర పాటిపూడి మాలపల్లి"

గదిలోకి వెళ్లేటప్పటికి అక్కడ కృష్ణమూర్తి కూర్చొని ఉన్నాడు.

"నువ్వొస్తావని ఈ టైమ్‌కి వచ్చానయ్యా, ఇదేమిటి మా వాడిని వెంటబెట్టుకు వస్తున్నావ్? " అన్నాడు కృష్ణమూర్తి.

"జిమ్‌లో తగిలాడు కుర్రాడు!. చూస్తే గట్టిగా కనపడుతున్నాడని నాతోపాటు బరువులు మోయించడానికి తీసుకొస్తున్నా!"

"గగారిన్, మా ప్రసాదు రాటుదేలిన వాడు! బరువులేమిటి? నిన్నైనా మోసేస్తాడు! మంచి కుర్రాడు. ఈ మురికి అసోసియేషన్ గొడవల్లో పడకుండా చూడు!"

"బానే ఉంది, నువ్వండి నాకు చెపుతావేం! అయినా మీ క్రిష్ణాజిల్లా వాళ్లకి అయితే కమ్యూనిజం, లేదంటే కిరస్తానం! అంతకు తప్పించి అంబేద్కర్ గురించి తెలీదయ్యా!"

"గగారిన్ మళ్లీ జిల్లాల రొచ్చులోకి దించుతున్నావు. అయినా మా వాళ్లని దెప్పుతారు గానీ రావూరి ఏకామ్రనాద ఎక్కడి వాడయ్యా? "

"చూడు తమ్ముడూ, జిల్లాల ఊసెత్తొద్దని తన జిల్లాని సమర్థించుకుంటున్నాడు? " అన్నాడు ప్రసాదు వైపు చూసి నవ్వుతూ గగారిన్.

"నీతో మాట్లాడలేం గురూ!" అని కృష్ణమూర్తి అంటుంటే, గగారిన్ ఆమ్లెట్ ప్లేట్

అందించాడు. ప్రసాదుకీ, కృష్ణమూర్తికీ చెరో ఆమ్లెట్ వేసిచ్చాడు పెనంమీద. తను రెండు గుడ్లు కలిపి ఒకే ఆమ్లెట్‌గా వేసుకు తినడం ప్రారంభించాడు.

"మన లైబ్రరీలో ఉన్న అంబేద్కర్ వర్క్స్ చూపించరాదు? కుర్రాడు చదువు తాడు" అన్నాడు గగారిన్.

"నేనెందుకు చూపించడం? తను చూసుకోగలడు. ఎలా చూసుకోవాలో చెప్పాను ముందే!"

ప్రసాదు ఆమ్లెట్ తింటూ, గగారిన్ రూమ్ గోడలమీద ఉన్న అంబేద్కర్ సూక్తులు చూస్తున్నాడు. "నా పోరాటం కేవలం భౌతిక వనరుల కోసమో, ఆర్థిక లాభాల కోసమో కాదు- మానవత్వాన్ని తిరిగి సముపార్జించడానికి" ఈ సూక్తి ప్రసాదు మనసులో నిలిచిపోయింది.

ప్రసాదు లేచి, వెళతానన్నట్టు కృష్ణ మూర్తిని చూసి, "ఉంటానండీ" అని గగా రిన్‌కి చెప్పి బయలుదేరబోతుంటే,

"తమ్ముడూ, నాగార్జున హాస్టలు అంతా మంచి వేడిమీద ఉంది. నదుల ఫీలిం గులు, జిల్లాల ఫీలింగులు చాలా ఉన్నాయి. ఈ పాటికి నువ్వు ఏ జిల్లా వాడివో తెలిసిపోయి ఉంటావు. అది అంత సీరియస్‌గా తీసుకోకు. సరదాగా నలుగురితో ఉండు, జిల్లాల ఆవేశం మాత్రం పడకు. కానీ నిజంగా మన జనా నికి అవమానం జరిగేదైతే నిలబడు. ఎంతకైనా తెగించి నిలబడు!బై తమ్ముడు" అన్నాడు గగారిన్.

"మొత్తంమీద సూక్తి ముక్తావళి వినిపిం చకుండా ఎవర్నీ పంపవ్" అన్నాడు కృష్ణ మూర్తి.

నవ్వేసాడు గగారిన్.

చెమటతో తడిసిన చొక్కాతో ఒక్కడే నీడా వెలుగుల మధ్య నడుచుకుంటూ అంజలీ గెస్ట్ హౌస్ దాటాడు. నాగార్జున హాస్టల్‌లో భళ్లుమని పెద్ద గోల! కేకలు, అరుపులు. గబగబా పరుగెట్టాడు ప్రసాదు హాస్టల్లోకి. అప్పటికే ఓ ఇద్దరికి రక్తాలు కారుతున్నాయి. వాళ్లని హాస్పటల్‌కి తీసు కెళ్లే ప్రయత్నంలో ఉన్నారు. రామస్వామి కర్ర పట్టుకుని ఉగ్ర నరసింహావతారంలో ఉన్నాడు.

కొత్తగా చేరిన విద్యార్థులంతా బితుకు బితుకుమంటూ ఉన్నారు. ఈ కొట్లాటలే మిటో, ఈ గొడవలేమిటో కొద్ది కొద్దిగా అర్థమవుతున్నాయి.

ప్రసాదు స్నానానికి వెళ్ళాడు.

పెద్ద మోతచేస్తూ పోలీసు వ్యానులు మూడు వచ్చాయి. హాస్టల్ గేట్లు మూసే సారు. ఒక్కొక్క రూము సోదా చేస్తు న్నారు. కర్రలు, రాడ్లు, కత్తులు దొరికితే కిందికి తీసి కెళుతున్నారు. ప్రసాదు స్నానం చేసి వచ్చేటప్పటికి ప్రసాదు రూమ్ దగ్గరికి ఇద్దరు పోలీసులు వచ్చారు. రూమ్ లోపల వెదికారు. ప్రసాదు ప్రాణం బిక్క చచ్చిపోయింది. తన రూమ్‌లో ఏయే వస్తువులున్నాయో తనకి కూడా తెలియదు. వచ్చి రెండు నెల లయింది. రూమంతా శుభ్రపరుచుకోలేదు.

పాత బూట్లు, పాలిష్ డబ్బాలు పెట్టి ఉన్న గూటిలో కాగితాల కింద పోలీసులకి పిడిబాకు దొరికింది. పక్కరూముల వాళ్ళంతా ఆశ్చర్యంగా ప్రసాదు వంక చూస్తున్నారు. "చదువుకునే పిల్లలు, ఏమై పోతాయ్ మీ బతుకులు!" అని ఆ కత్తి తీసుకుని మరో రూమ్‌లోకి వెళ్లిపోయారు పోలీసులు.

జ్వరం వచ్చి కింద పడిపోయిన వాడికి గ్లూకోజు నీళ్లు ఇచ్చినట్లుగా ఉంది ప్రసాదు పరిస్థితి- పోలీసులు వెళ్లిపోవడంతో.

హాస్టల్ వార్డెను వచ్చాడు. పోలీసులు ఎవర్నీ అరెస్టు చెయ్యలేదు. దొరికిన కర్రలు, కత్తులు, రాడ్లు, పిడిబాకులు

వ్యాన్‌లో పడేసుకున్నారు. ఓ పదిమంది పోలీసులని కాపలా ఉంచి పోలీసు వ్యాన్లు వెళ్ళిపోయాయి.

కొత్త విద్యార్థులందరూ ఊపిరి పీల్చుకు న్నారు. దీనితో ప్రసాదు అతనికి తెలియ కుండానే 'చాకు రౌడీ' అయిపోయాడు.




ప్రసాదు ఆర్ట్స్ కాలేజి ప్రిన్సిపాల్ ఆఫీ సుకి బయలుదేరాడు.

ప్రసాదు క్లాసులో ముగ్గురు ప్రసాదులు ఉన్నారు. ఒకరు ఎస్.సి., మరొకరు బి.సి, ఇంకొకరు ఇ.బి.సి. ముగ్గురూ కె. ప్రసా దులే. తండ్రి పేర్లు, ఇంటి పేర్లు తేడా ఉన్నాయి. "అవి దగ్గరుండి ఒక్కసారి కర క్షన్స్ ఏమైనా ఉంటే చూసుకోండి. స్కాల ర్షిప్‌కి పేరు సరిగా నోట్ అయిందో లేదో తెలుసుకోండి" అని డిపార్ట్‌మెంట్ ఆఫీసులో చెబితే ప్రిన్సిపాల్ ఆఫీసుకి బయలుదేరాడు ప్రసాదు- పన్నెండు గంటల ప్రాంతంలో.

బోటనీ డిపార్ట్‌మెంటు మీదుగా నడుస్తు న్నాడు. డిపార్ట్‌మెంట్ వైపు చూసాడు. ప్రసాదుని చూసి అక్కడ నిలబడి ఉన్న విజయ దగ్గరకొచ్చింది.

"ఏమిటీ, పామర్రు వాళ్లిద్దరూ ఏవో రహస్యాలు మాట్లాడుకుంటున్నారు?" అంటూ సౌభాగ్య వచ్చి కలిసింది. ఈలోపు మరో ఇద్దరు మగవాళ్లు వచ్చి కలి సారు.

"బానే ఉంది. మీ బందరువాళ్లు మాట్లా డుకుంటూ వస్తుంటే లేదుగానీ మా పామ ర్రువాళ్లం మాట్లాడుకోకూడదేమిటి?" అంది విజయ.

ప్రసాదు కూడా 'అంతే' అన్నట్లు చూసాడు.

"థ్యాంక్స్ ప్రసాద్, మొన్న మేం మాణి క్యానికి తోడుగా రాలేకపోయాం!. 'పదిన్న రకి డిపార్ట్‌మెంటుకి రావే' అంటే దాని కంగారుదానిది!

దానికి మరీ శుభ్రం! ఇంటి దగ్గర్లా హాస్టల్లో ఉండమంటే ఎలా ఉంటుంది? ఆ మాత్రం దానికే ఏకంగా యూనివర్శిటీ మానేస్తానని గొడవ. మేం సర్దిచెప్పామను కోండి. హాస్పటల్‌కి వెళ్ళడం ఒక గంట లేటయితే డాక్టరుండడేమో ఎక్కడ చచ్చిపో తానో అని భయం! పోన్లే నువ్వన్నా తీసు కెళ్ళావు!"

"దానికేముందిలే!... నాకు ప్రిన్సిపాల్ ఆఫీసులో పనుంది. అందుకే ఇటొస్తు న్నాను. మీకు లాస్టవర్ లేదా?" అన్నాడు సౌభాగ్య వైపు చూసి.

"లేదు" అని "హరిప్రకాష్! ఇతను ప్రసాద్. మా నోబుల్ కాలేజి. ఆర్కియా లజీలో చేరాడు" అని పరిచయం చేసింది. హరిప్రకాశ్ షేక్‌హ్యాండ్‌కి చేయి చాపాడు ప్రసాదు వైపు.

"నేను, సౌభాగ్య, హరిప్రకాష్ డిగ్రీలో ఒకే చోట ట్యూషన్ చదివాం" అంది విజయ.

"ఇంకా మన బందరు వాళ్ళు ఎవరెవరు చేరారండి సైన్స్ కాలేజ్‌లో?" అన్నాడు ప్రసాదు హరిప్రకాష్‌తో మాటకలపడానికి.

"కృష్ణమాచార్యులు చేరాడు ఫిజిక్స్‌లో. వాలీబాల్ ఆడతారు కదా మీరు! మా కాలేజికి గూడా ఫ్రెండ్లీ మ్యాచ్ ఆడడానికి మీ టీమ్ రెండుసార్లు వచ్చింది కదా!" అన్నాడు హరిప్రకాష్.

"అవును" అన్నాడు ప్రసాదు.

"బందరు వాళ్ళు ఎంతమంది ఉన్నారని లెక్కలు వేసుకోడమే గాని, ఆడపిల్లలు ఇంత దూరం వచ్చారు, వాళ్ళ ఇబ్బందులేమిటి? సముద్రపుగాలికి ఆరోగ్యాలెలా ఉన్నాయి? " అని పలకరించడం ఏం ఉండదు కదా!" అంది విజయ.

"నువ్వు నిందలు వెయ్యకు విజయా! నేను హాస్టల్‌కి రావడంలా? ఫ్రూట్స్ కూడా తెచ్చి పెట్టాను" అన్నాడు హరిప్రకాష్.

"నిన్ను కాదులే హరిప్రకాష్" అంది విజయ.

ప్రసాదుకి ఏమనాలో తెలియలేదు. ఈలోపు వాళ్ళు రోడ్డు మీదికి వచ్చేసారు. అందరికీ తలాడించి, ప్రిన్సిపాల్ ఆఫీసు వైపు వెళ్ళాడు ప్రసాదు.

ప్రిన్సిపాల్ ఆఫీసులో యు.డి.సి. రామ కృష్ణ బాబాయి దగ్గర మనిషి వున్నాడు కానీ, మనసేమో విజయ మాటల చుట్టూ ఉంది.

★ ★ ★

ఆర్. కె. బీచ్ నుండి కాళీమాత దేవాలయం ప్రక్కగా నడుస్తున్నారు మిత్రులు ప్రసాదు, సుధీర్, సుధాకర్, కృష్ణమోహన్.

"అరేయ్, కాళీమాత టెంపుల్ దగ్గర మాణిక్యం కనబడడం లేదు!" అన్నాడు సుధీర్.

"ఒరే నీకళ్ళే కళ్ళురా! దరిద్రపు కళ్ళు! అమ్మాయిలు తప్ప ఇంకెవ్వరూ కనపడరు. ఒకవేళ మాణిక్యం ఉందనుకో! ఇపుడెళ్ళి పలకరిస్తావేంటి? ఆక్వర్డ్‌గా ఉంటది" అన్నాడు సుధాకర్.

"నీతులొద్దురా! కృపారసం కురిపించుకోడానికి ప్లాట్లు తెలుసు మాకు. గుడికెళ్ళింది ఆడవాళ్ళు. తప్పనిసరిగా ఓ కొబ్బరిముక్కైనా దొరుకుతుంది. అయినా మనం సెలవురోజు, సెకండ్ సాటర్‌డే, బీచ్‌కొచ్చి అమ్మవార్ని దర్శించుకోడానికి వెళుతున్నాం. కాళీమాతకీ!" అంటూ ముందుకి దారితీసాడు సుధీర్.

"నేను రాన్రా, మీరెళ్ళిరండి. నేనిక్కడే ఉంటాను" అన్నాడు సుధాకర్ బిగుసుకుపోతూ.

"బిగుసుకుపోవడమెందుకురా! రా" అని చేత్తో లాగుతూ, "సుధీర్‌గాడి మాటలకే మొచ్చెగానీ గుడి చూసొద్దాం ఒకసారి. రారా, నేనెప్పుడూ ఒక పెద్దగుడికి వెళ్ళలేదురా. ఎటూ మనం అటేకదా వెళ్ళేది!" అని సుధాకర్‌ని చెయ్యిపుచ్చుకుని లాగాడు కృష్ణమోహన్.

నలుగురూ కాళీమాత ఆవరణలోకి వెళ్ళారు. నలుపు, ఎరుపు రంగుల గ్రానైటు రాతికట్టడం! నున్నగా అద్దంలా!

సుధీర్ గంటకొట్టి భక్తుడి రూపంలోకి వచ్చేసాడు. సుధీర్‌ని చూస్తే నిజం భక్తేననిపించింది ప్రసాదుకి. ఎందుకో లోపలికి వెళ్ళాలనిపించలేదు ప్రసాదుకి. ఆవరణలో నిలబడి కట్టడాన్ని చూస్తున్నాడు. అప్పటికే మాణిక్యంతో కబుర్లు చెప్పుకుంటూ తల మీద రెండు పువ్వురేకులు చల్లుకుని వస్తున్నాడు సుధీర్. వాళ్ళతో పాటు విజయ, ఇంకొందరు.

ప్రసాదుని చూసి కళ్ళతో నవ్వింది విజయ. ప్రసాదు కూడా పలకరింపుగా నవ్వాడు ఆనందంగా.

"దేవాలయానికి వచ్చాక కాసేపు కూర్చుని వెళ్ళాలి. అటు కూర్చుందాం రండి" అని ఖాళీ చోటు ఉన్న వైపుకి దారితీసాడు సుధీర్. వీడికి ఇంత భక్తి తెలుసా!" అన్నట్లు చూసుకున్నారు కృష్ణమోహన్, సుధాకర్.

"మేము ఇందాకే కాసేపు కూర్చున్నాం సుధీర్! మీరు కూర్చోండి, మేం వెళతాం!" అని ముందుకు కదిలింది మాణిక్యం అండ్ బృందం.

ముగ్గురూ బిక్కచచ్చిపోయారు.

"మంచిదండి బై" అనేసి "ఏదీ కాస్త ప్రసాదం కొబ్బరిముక్క..." అన్నాడు ఎటూకాని స్థితిలో సుధీర్.

మాణిక్యం బృందం ఆవరణ దాటుతున్నారు.

విజయ, వెళుతూ వెళుతూ ప్రసాదు చేతికి కొబ్బరిచెక్క ఇచ్చి వెళ్ళిపోయింది. ఒక్కసారిగా ముగ్గురిలోకి ఆశ్చర్యమూ, చలనమూ వచ్చాయి.

"ఆ అమ్మాయిది మా ఊరు దగ్గర్రా! ఇంటర్లో నా క్లాసుమేటు!" అన్నాడు ప్రసాదు. మిత్రుల నుంచి అనవసరపు ప్రశ్నలు ఎదుర్కోకుండా.

★ ★ ★

'ఓట్ ఫర్ పాల్ ప్యానల్'

'ఓట్ ఫర్ పాల్ ప్యానల్' అంటూ ఓ పాతికమంది గుంపులు గుంపులుగా ఆర్ట్స్ కాలేజి రెండో అంతస్తు నుంచి పైకి వెళుతున్నారు.

పాల్ నల్లగా చిరునవ్వుతో బ్లూ ఫ్యాంట్ మీద వైట్‌షర్టు టక్ చేసుకొని ఉన్నాడు. అతన్ని అందరూ 'నమస్తే అన్నా' అంటూ పలకరిస్తున్నారు.

ఎస్.సి అండ్ ఎస్.టి అసోసియేషన్ రెండుగా చీలిపోయింది. ఇద్దరు నాయకులు పోటీ చేస్తున్నారు. పాల్, వెంకటేశ్వరరావు. ఎస్.ఎఫ్.ఐ తరపున రాజశేఖర్ పోటీలో ఉన్నాడు. పి.డి.ఎస్.యు తరపున శ్రీనివాస్ ప్యానల్ ఉంది. ఎ.బి.వి.పి కూడా ప్యానల్ వేసింది. అయితే వాళ్ళకి ప్రచారం లేదు.

ఈ ప్యానల్స్‌లో ఒక ప్యానల్‌కి రిజిస్ట్రార్ సపోర్టు, మరో ప్యానల్‌కి వి.సి.సపోర్టు ఉందని గుసగుసలు వినిపిస్తున్నాయి. మరొక్క మూడు రోజులే ఎన్నికలున్నాయి.

ప్రసాదు భోజనం చేసి లైబ్రరీకి బయలుదేరుతుంటే, సాల్మన్, సుబ్బారావు, రామస్వామి 'తమ్ముడూ ఆగు' అని పిలిచారు.

ప్రసాదుని సుబ్బారావు రూమ్‌కి తీసుకుని వెళ్ళాడు. "నువ్వు మాట్లాడుతూ ఉండు గురూ! మేం మరో ఇద్దర్ని కలవాలి" అంటూ వెళ్ళారు.

"ఏ ఊరు తమ్ముడు మీదీ" అన్నాడు సుబ్బారావు

"గంటసాల దగ్గర పాటిపూడన్నా"

"గంటసాల దగ్గర పాటిపూడా! నాది అవనిగెడ్డ. గంటసాల నేను చాలా సార్లు వచ్చాను. అమ్మా నాన్నా ఏం జేస్తారు? "

"ఇద్దరూ కూలిపని చేస్తారన్నా. మా ఊర్లో ఇక్కడి వరకూ వచ్చిన వాణ్ణి నేనే. మొన్ననే ఇద్దరు డిగ్రీలో చేరారు."

"తమ్ముడు, గోదావరి జిల్లాలోళ్ళు మనకి ఎంత అన్యాయం చేసారో నీకు తెలవదు. మన జిల్లావాడికి యూనివర్సిటీ ప్రెసిడెంట్ అయ్యే అవకాశం ఇపుడే వొచ్చింది. అది మనం నిలుపుకోవాలి. మనం నలుగురం కనబడితేనే, నలుగురు మనకి ఓట్లు వేస్తారు. ఈ రెండ్రోజులూ క్లాసులు అవి అనుకోకుండా క్యాంపెయిన్‌కి తిరగాలి. ఈ రాత్రికి హాస్టల్స్ అన్నీ తిరగాలి. రా నువ్వు గూడా. నీ బుక్స్ ఇక్కడుంచెయ్. క్యాంపెయిన్ నుంచి తిరిగొచ్చాక తీసుకెళ్ళొచ్చు" అన్నాడు.

ఎలా కాదనాలో కూడా ప్రసాదుకి తెలియలేదు. వాళ్ళతో పాటు బయలుదేరాడు.

## కొత్తగాలి...

**గడ్డికరువు**
**పశువుల మేతకు కాదు**
**నాయకుల**
**దిష్టిబొమ్మలకు**

-పాలెపు బాబు, మచిలీపట్నం

ప్రసాదు వాళ్ళు 'ఓట్ ఫర్ వెంకటేశ్వర రావు' అనుకుంటూ వెళుతుంటే, సుధీర్, సుధాకర్ వాళ్ళు 'ఓట్ ఫర్ పాల్' అనుకుంటూ ప్రసాదుకి ఎదురుపడ్డారు. ఒకళ్ళనొకళ్ళు బెరుకుగా చూసుకుంటూ ఎవరి ప్యానల్ వెంట వాళ్ళు వెళ్ళిపోయారు.

ప్రసాదువాళ్ళు శాతవాహన హాస్టల్ వైపుకి వెళ్ళారు. అక్కడ అన్ని రూమ్స్ తిరిగారు. హర్షవర్ధన దగ్గర తిరిగారు. సిద్ధార్థలో తిరుగుతున్నప్పుడు-

"నాలుగువేల రూపాయలు, అసోసియేషన్ డబ్బులు తినేసిన నా కొడుకులు, ఇంతవరకూ లెక్కలు చెప్పకుండా అసోషియేషన్ చీల్చి, ఇవ్వాళ ఓట్లు అడగటానికి వస్తార్రా! ఈ హాస్టల్లోకి అడుగెట్టారంటే నరికేస్తాను నా కొడకల్లారా!" అన్నాడు చాకు పట్టుకొని బెదిరిస్తూ డేనియల్.

అప్పటికే కొంతమంది 'ఓట్ ఫర్' అనుకుంటూ రెండో అంతస్తు ఎక్కేస్తున్నారు.

"దిగండి! ఒక్క నా కొడుకు ముందుకెళ్ళినా ఊరుకోను" అన్నాడు.

ఎక్కడివాళ్లు అక్కడ నిలబడిపోయారు.

ఈ విషయం విని రామస్వామి, సాల్మన్ పైనుంచి కిందికి వస్తున్నారు.

ప్రసాదు డేనియల్‌కి దగ్గరగా ఉన్నాడు. డేనియల్ బాగా తాగి ఉన్నాడు.

"వెనక్కి పొమ్మంటే మీక్కాదురా చెప్పేది నా కొడకల్లారా" అని దగ్గరే ఉన్న ప్రసాదు కాలరు పట్టుకొని లాగాడు. ఈ హటాత్సం ఘటనకి ముందు కంగారుపడ్డా వెంటనే తేరుకున్నాడు ప్రసాదు.

"పోవేరా నా కొడకా" అని చొక్కా వదలకుండానే చాకు పైకెత్తాడు. ప్రసాదు, కత్తి పట్టుకున్న డేనియల్ చేతిని వెనక్కి వంచాడు అప్రయత్నంగానే. డేనియల్ ఈ ఉడుంపట్టుకి కాస్త కంగారుపడ్డాడు. ఈలోపు రామస్వామి, సాల్మన్ వచ్చారు. ప్రసాదు చెయ్యి విడిచిపెట్టాడు.

"డానీ అన్నా! నువ్వొరికే బూతులు తిట్టొద్దు. కత్తులు మా దగ్గరా ఉన్నాయి. ముందు మనం అనుకున్నదేంటి? ఇప్పుడు జరుగుతున్నదేంటి? చెప్పన్నా?" అని కోపంగా అడుగుతున్నారు- రామస్వామి, సాల్మన్.

అత్త మీద కోపం దుత్తమీద చూపించినట్లు, డేనియల్ ప్రసాద్ మీద పడ్డాడు.

"నిన్న కాక మొన్నొచ్చిన బుడ్డ నాకొడుకు. నా మీద చెయ్యేత్తుతాడ్రా" అంటూ ప్రసాద్ మీదికి లేచాడు.

ప్రసాద్‌కి ఏమనాలో తెలియలేదు. ఏదో క్యాంపెయిన్‌కి అనుకున్నాడు గానీ తన ప్రమేయం లేకుండానే తను గొడవలో ఇరుక్కోవడం నచ్చడంలేదు. నచ్చడం, నచ్చకపోవడం ఇక్కడ సమస్యకాదు. ఉనికి సమస్య. మళ్ళీ కత్తి తీసి మీద కొస్తున్నాడు డేనియల్. ఈ సారి ప్రసాద్‌కి వెనక్కి తగ్గాలనిపించలేదు.

"ఒరేయ్" అని కత్తిని ఒక్క తిప్పు తిప్పాడు డేనీ. కొత్త పిల్లలంతా భయంతో వెనక్కి జరిగారు. వాడి దౌర్జన్యం చూస్తే ప్రసాద్‌కి వెనక్కి తగ్గబుద్ధికాలేదు. కత్తి ఉన్న చేతి మీద ఒక్క తోపు తోసాడు.

రామస్వామి వచ్చి డేనీ రెక్క పట్టుకొని కత్తి లాక్కున్నాడు. "మర్యాదగా చెపుతున్నా, వెళ్ళిపో నువ్వు లోపలికి" అన్నాడు రామస్వామి. డేనీ బూతులు తిట్టుకుంటూ లోపలికి వెళ్లిపోయాడు 'దౌర్జన్యం' అనుకుంటూ.

అందరూ సిద్దార్థ నుండి బయలుదేరారు. కాసేపు ఎవ్వరికీ మాటలు లేవు.

"గట్టివాడివి తమ్ముడూ" అన్నాడు సాల్మన్ అభినందనగా.

ఈ ప్రొసెషన్‌లో ఉన్న చాలామంది విద్యార్థులకి ఇదేం గొడవరా అనిపించింది.

కాసేపటికి తేరుకుని మళ్ళీ, 'ఓట్ ఫర్' అనుకుంటూ మొదలుపెట్టారు.

నాగార్జున హాస్టల్‌కి వచ్చి కాసేపు సిమెంట్ బెంచి మీద కూర్చున్నాడు ప్రసాదు ఒంటరిగా. చల్లటి గాలి వీస్తోంది. చంద్రుడు మసకగా వెలుగుతున్నాడు. ఈ కరెంటు దీపాల వెలుగు చంద్రుడి సహజమైన వెన్నెలని అభినందిచనీయడంలేదు - ఈ క్యాంపస్ రాజకీయాల్లాగా. హాస్టల్‌లో ఎన్నికల హడావుడి కొనసాగుతూనే ఉంది. ప్రసాద్ అలా కళ్లు మూసుకొని కూర్చునే ఉన్నాడు.

ఈ క్యాంపస్‌లోకి అడుగు పెట్టినపుడు; హాస్టల్‌లో రూమ్ చూసినపుడు, లైబ్రరీ మెట్లెక్కినపుడు, డిపార్టుమెంట్ గ్యాలరీలో పాఠం వింటున్నపుడు, కాన్వకేషన్ హాల్ బిల్డింగ్ ఎక్కి సముద్రాన్ని చూసినపుడు, సముద్రం ఒడ్డున నీలి అలల్ని చూసినపుడు, పసుపు పువ్వులు తలమీద రాలుతూ, పాదాల్ని స్పృశిస్తూంటే క్యాంపస్‌లో నడుస్తున్నపుడు, అసెంబ్లీ హాల్లో సరితాదాస్ నృత్యం చూసినపుడు తనేదో కొత్త లోకంలో ఉన్నట్లు భావించాడు.

ఎంత వర్షం కురిసినా నీరింకిపోయే ఈ ఎర్రమట్టి నేల... మాధవీ లతల సొగసు, జీడిచెట్ల సోయగం, నిజంగా తను మైమరిచిపోయాడు.

'కాదుండే', 'అవునుండే', 'అయ్యగారో' అని భయపడుతూ, నిత్యం తప్పు చేసినవాడిలా ప్రతిక్షణం తిట్లు తింటామేమోననే భయంతో, నిరంతరం అపరాధ భావనతో చిన్నబుచ్చుకోవాల్సిన మాటలు వింటూ, బూతుమాట లేకుండా తమని సంబోధించడం చేతకాని పెద్దకులపు అహంకారాన్ని అనుభవిస్తూ సాగిన బతుకులోంచి - ఈ పచ్చని నేలలోకి, ఈ చదువుల చైత్యంలోకి, భయంలేని, భీతిలేని మనిషిగా, తను ఒక మనిషిననే నమ్మకం నేర్పిన ఈ నేలలో... ఒక్క నిట్టూర్పు వదిలాడు ప్రసాదు కళ్ళు తెరుస్తూ.

గౌరవనీయుడైతే గౌరవించడమే

కొత్తగాలి...

**చీరలూ, చెప్పులూ...**
**ఇస్త్రీ పెట్టెలూ, ఇంటిసామాన్లూ..**
**అన్నీ లైట్ వెయిట్**
**మనుషులే హెవీ వెయిట్**

*-బి. గీతిక, తాడేపల్లిగూడెం*

మినహా చచ్చినట్లు, తన శరీరమంతట్లో నుంచి, గౌరవం ఇవ్వాల్సిన నిర్బంధపు మనోవాస్తవం నుంచి నిటారుగా నడవగలిగే స్థితిని ఇక్కడే అనుభవించాడు. అనుభవిస్తున్నాడు కొద్దినెలలుగా.

'అరే', 'ఒరే', 'ఏరా', 'లంజాకొడకా', వంటి పిలుపుల నుండి, 'ఏమండీ' అనే పిలుపు!. తనని 'అండీ' అని గౌరవంగా మర్యాదగా పిలిచిన పిలుపు తొలిసారిగా ఇక్కడే విన్నాడు.

"చెప్పండి, ఆర్కియాలజీలో చేరేస్తారా, లేకపోతే హిస్టరీలో కూడా ఖాళీ వుంది, అందులో చేరతారా? " అని ప్రొఫెసర్ అన్నపుడు, ఎంత కంగారు పడ్డాడు! తనని 'అండీ' అనడమా అని ఎంత బిగదీసుకుపోయాడు! ఆ తరువాత ఎంతమందో అలా పిలుస్తున్నారు. ఎంతమందో 'మాష్టారూ' అని పిలుస్తున్నారు. అంబేద్కర్ చెప్పే 'రీక్లయిమేషన్ ఆఫ్ హ్యూమన్ పర్సనాలిటీ' అంటే ఇదేనేమో!

తమ ఊరంత ఘోరం కాకపోయినా పామర్రులో, లైబ్రరీ పుస్తకం ఇవ్వడానికి ఎంతోసేపు కావాలని నిలబెట్టేవారు! ఏదైనా పుస్తకం అడిగితే, ఇది నీకెందుకు? నీకేం అర్థమౌతుందనే వెటకారపు మాటలు. ఇక్కడ తనకి కావలసిన పుస్తకం తనే తెచ్చుకునే స్వేచ్ఛ! ఏ పుస్తకాన్నైనా మర్యాదగా గౌరవంగా తను

కూర్చున్న చోటికి తెచ్చి ఇచ్చే వ్యవస్థ!

నిటారుగా మనిషిగా జీవించడం నేర్పిన మహా విద్యాలయం! తను ఇక్కడికి రాక పోతే, జీవితంలో 'స్వేచ్ఛ' అంటే ఏమిటో, స్వేచ్ఛ వుంటే ఎలా ఉండవచ్చో ఎప్పటికీ తెలిసేది కాదు.

ఇటువంటి పాలసముద్రంలో ఈ ఉప్పు గల్లులాంటి సంఘటన!

## ముందే తెలుస్తుంది

అమెరికా, రష్యా, ఇండియాలకు చెందిన పోలీస్ ఆఫీసర్లు ఓ కాన్ఫరెన్స్‌లో ముచ్చట్లు చెప్పుకుంటున్నారు. అమెరికా పోలీస్, 'మా దేశంలో హత్య జరిగిన 48 గంటల్లోనే హంతకుల్ని పట్టేస్తాం' అన్నాడు దర్పంగా. రష్యన్ ఆఫీసర్, 'మాకైతే 24 గంటలు చాలు' అన్నాడు ఛాతి ఉప్పొంగిస్తూ.



ఇండియన్ పోలీస్ ఆఫీసర్ మాత్రం తాపీగా, 'మా దేశంలో 24 గంటలు ముందుగానే ఫలానా వాడు ఫలానావాడిని హత్య చేస్తాడని మాకు తెలిసిపోతుంది' అన్నాడు.

ఈ ముఠాలేమిటి, ఈ జిల్లా ఫీలింగులేమిటో, ఈ డబ్బులు తినెయ్యడాలు, తాగుబోతు వెధవలు, రాజకీయం, అధికారం, తన్నులాటలు, కొట్లాటలు, దీనిలో తన ప్రమేయం లేకుండానే తను ఇరుక్కోవడం- మనసు వికలంగా అనిపించింది ప్రసాదుకి.

ప్రసాదు రూమ్‌కి వెళ్ళి, కుందూరి ఈశ్వరదత్తు 'ప్రాచీనాంధ్ర భూగోళం' తీసాడు. కాసేపు చదివి పడుకుండిపోయాడు. విజయ గుర్తుకొచ్చింది.

★ ★ ★

తెల్లవారి లేచి కాలకృత్యాలు తీర్చుకుని రూమ్‌లోకి వచ్చేటప్పటికి రూమ్‌లో సుబ్బారావు, ప్రెసిడెంటల్ కేండిడేట్ వెంకటేశ్వరరావు, మరో ఇద్దరూ ఉన్నారు.

"వెరీగుడ్ తమ్ముడు! వాడు వెధవ. వాడేమీ చెయ్యలేడు. నువ్వు చాలా ధైర్యంగా నిలబడ్డావట. వెరీనైస్. బయలుదేరు. టిఫిన్‌కి వెళదాం. నీలాంటి వాడు ఉండాలి మనకి" అన్నాడు వెంకటేశ్వరరావు.

ప్రసాదుకి ఈ అనుకోని ఆహ్వానం అర్థం కాలేదు- కాసేపు. డేనియల్ ముందు తను ప్రదర్శించింది ధైర్యమో కాదో తెలియదు- ముందు పరిస్థితి అర్థం కాలేదు. కత్తి తీస్తే సహజంగా పెనుగులాడడంతే. చితక తాగి ఉన్నవాడు కత్తితో ఏమీ చెయ్యలేడని తెలియడం కూడా కావచ్చు. ఇదేదో చాలా ధైర్యమున్నట్టు అనుకుంటున్నారు వీళ్ళు- అనుకున్నాడు.

ప్రసాదు ఒక్క నిమిషం ఆలోచించాడు.

"అన్నా నీ వెనక నేనొస్తాను. ఇక్కడికొచ్చేవరకూ మీరెవరో కూడా నాకు తెలియదు. ఒక జిల్లా పేరుతో నేనెందుకు తిట్లు తినాలి? గోదావరి జిల్లాల వాళ్ళ మీద నేనెందుకు ప్రత్యేకమైన కోపం పెట్టుకోవాలి? తప్పో ఒప్పో డబ్బులు తినేసారనే మాటలు ఎందుకొస్తున్నాయి? నాకు కొత్తన్నా! నాకేమీ తెలియదు. నాకు ప్రమేయంలేని గొడవల్లోకి నేనెందుకు రావాలి? " అన్నాడు.

వచ్చిన వాళ్ళు ప్రసాదుకి జవాబు చెప్పే ప్రయత్నం చెయ్యలేదు. "నువ్వు బట్టలు వేసుకో, క్రిందుంటాం మేం" అని వెళ్ళిపోయారు.

ప్రసాదు ప్రొసెషన్‌కి వెళ్ళలేదు. గగారిన్ మాటలు గుర్తొచ్చాయి.

★ ★ ★

ఫ్యాకల్టీ క్లబ్ ముందున్న వాలీబాల్ కోర్టులో సాయంత్రం వరకూ ఆడి, బోటనీ డిపార్ట్‌మెంట్ నుంచి జీడిచెట్ల ప్రక్కనుంచి కలక్టరు బంగళా మీదుగా నాగార్జున హాస్టల్ కి వెళ్ళడం ప్రసాదుకి అలవాటు. ఇంకా మసక పడలేదు. స్ట్రీట్ లైట్లు వెలగలేదు. కానీ పగటి వెలుగు తగ్గింది.

బోటనీ డిపార్ట్‌మెంట్ నుంచి ఇద్దరు ముగ్గురుగా కలిసి బయటకొస్తున్నారు. విజయ కనిపిస్తే బావుండు అనుకున్నాడు ప్రసాదు.

మరో అమ్మాయితో కలిసి విజయ ఎదురుపడింది. విజయని చూసి ఆగి,

"ప్రాక్టికల్స్ ఉన్నాయా! ఇప్పటివరకూ ఉన్నారు" అన్నాడు చిరునవ్వుతో.

"అవునూ, ఎక్కడ్నుంచి? " అంది విజయ.

"వాలీబాల్ కోర్టు నుంచి"

"ఇంకా ఆడుతూనే ఉన్నావన్నమాట!"

"ప్రాక్టీస్ పోకుండా ఉంటుంది. కాస్త ఎక్సర్ సైజ్ గాను ఉంటుంది కదా! ఇంచుమించుగా రోజూ ఇటు వస్తాను."

"అవునే, చెప్పలేదు కదా! ఇతను ప్రసాద్. ఇంటర్లో నా క్లాస్‌మేట్. ఆర్కియాలజీ చేస్తున్నాడు. మంచి ప్లేయర్... ఇది పద్మావతి, ప్రసాద్! ఈవూరే" అని ఒకరికొకరిని పరిచయం చేసింది విజయ.

పద్మావతి అనాసక్తిగా వీళ్ళిద్దరివైపు చూసింది. "నేను బస్‌కి రిజిస్ట్రార్ ఆఫీసు వెనక్కి నడిచివెళ్ళాలి. మరి నేను వెళతాను" అని వీళ్ళ మాటకోసం చూడకుండా రెండడుగులు వేసిందో లేదో స్కూటర్‌తో ఒకతను వచ్చి ఎక్కించుకుని వెళ్ళిపోయాడు.

"మీకిప్పుడు హాస్టల్ కి బస్సు ఉంటుందా? " అని అడిగాడు ప్రసాదు.

"యూనివర్సిటీ బస్సు ఎనిమిది గంటలకే. సిటీబస్‌కి వెళ్ళాలి" అంది విజయ.

"బస్ స్టాప్ వరకూ నేను వస్తాను" అని అంగీకారం కోసం చూసాడు. నవ్వుతూ ముందుకు కదిలింది విజయ. ఆమెతో పాటు ప్రసాదు.

"సౌభాగ్యకి ప్రాక్టికల్స్ లేవా? " అన్నాడు.

"సౌభాగ్యా! దానిది వేరే బ్యాచ్. వారంలో మాకు రెండురోజులు, ఆ బ్యాచ్ వాళ్ళకి రెండు రోజులు. అయినా దానికి ర్యాంకర్నని కొంచెం ఇదిలే" అంది.

క్యాంపస్ కబుర్లు, సముద్రపు సంగతులు, స్వీట్ నాన్సెన్స్.... ఓ అరగంట సేపు బస్టాప్‌లో. విజయని నెంబర్ టెన్ బస్సు ఎక్కించి, హాస్టల్ కి ఉత్సాహంగా గాలిలో తేలుతున్నట్లుగా చేరుకున్నాడు.

★ ★ ★

ప్రెసిడెంటల్ డిబేట్!

అందరూ ముందుగా వెళ్ళి ఓపెన్ ఎయిర్ థియేటర్‌లో కూర్చున్నారు. ప్రిన్సిపాల్ గారు, కొద్దిమంది సీనియర్ ప్రొఫెసర్లు ముందువరసలో కుర్చీల మీద కూర్చున్నారు. వేదిక మీద ఆరు కుర్చీలు ఉన్నాయి.

వెంకటేశ్వరరావు ప్యానల్ వచ్చింది జిందాబాద్ లు కొట్టుకుంటూ, కాగితాలర జన్లు చల్లుకుంటూ. వెంకటేశ్వరరావుని చేతులమీద లోపలికి తీసుకొచ్చారు. తర్వాత రాజగోపాల్ ప్యానల్ ఎర్రెర్రని స్లోగన్లతో వచ్చింది. అందరూ చప్పట్లు కొట్టారు. పాల్ ప్యానల్ వచ్చింది. మంచి ఉత్సాహం! ఒక క్రమబద్ధమైన చప్పట్ల మధ్య పాల్ చిరునవ్వుతో అందర్నీ విష్‌చేస్తూ వచ్చాడు.

"ఆర్ట్స్, కామర్స్ అండ్ లా కాలేజిల విద్యార్థి సంఘం ఎన్నికలలో అతి ముఖ్యమైన ప్రెసిడెంటల్ డిబేట్ ప్రారంభం కాబోతోంది. అధ్యక్షత వహించాల్సిందిగా

ప్రిన్సిపాల్‌గార్ని ఆహ్వానిస్తున్నాం" అని చక్కటి ఇంగ్లీషులో చెప్పారు.

ప్రిన్సిపాల్, విద్యార్థినాయకులు, ఒకరి తరువాత ఒకరు పిలుపులందుకుని వేదిక ఎక్కారు.

ప్రెసిడెంటల్ డిబేట్ ఉద్దేశం, విశ్వవిద్యాలయ విద్యార్థి సంఘ అధ్యక్షుడిగా ఉండే వ్యక్తికి దేశ సమస్యలపై అవగాహన ఉండాలని, అలా అవగాహన ఉన్న వ్యక్తినే విద్యార్థులు ఎన్నుకోవాలని.

అభ్యర్థులకి, ఒక గంట ముందుగా ఇచ్చిన అంశం: "భారతదేశంలో ఉన్నత విద్య- ఉపాధి అవకాశాలు." మాట్లాడడానికి అరగంట సమయం ఇచ్చారు.

ప్రసాదు ఆసక్తిగా చూస్తున్నాడు. ఈ సంవత్సరమే కొత్తగా చేరిన విద్యార్థులందరూ ఆసక్తిగా కూర్చున్నారు. ఇది వాళ్ళకు కొత్త.

వేదిక మీదున్న ప్రెసిడెంటల్ కేండిడేట్స్ అందరూ ఇచ్చిన అంశం మీద మాట్లాడారు అరగంటసేపు ఒక్కొక్కరూ.

ప్రసాద్‌కి వాళ్ళు ప్రస్తావించిన అంశాలు ఆశ్చర్యాన్ని కలిగించాయి. ఎవరు బాగా మాట్లాడారనే దానికంటే, ఎవర్ని ఎవరెంతగా విమర్శించేరన్నదానికంటే దేశం, దేశ అవసరాలు, ఉన్నతవిద్య వివిధ స్థాయిలు... కొన్ని రోజులు కష్టపడినా లైబ్రరీలో సంపాదించలేని సమాచారం, వాళ్ళంతా మాట్లాడిన రెండున్నర గంటల కాలంలో దొరికింది.

ఒక అంశాన్ని దేశం పరిధిలోను, విస్తృతంగాను ఆలోచించాలి అనేది తొలిసారిగా ప్రసాదుకి అందింది.

జిందాబాద్‌లతో ఒక్కపిసరు గొడవ కూడా లేకుండా పండుగ వాతావరణంలో ప్రెసిడెంటల్ డిబేట్ ముగిసింది.

★ ★ ★

అకడమిక్ ఇయర్‌ని ముందుకు తీసుకుని రావాలనే ఉద్దేశంతో వేసవి సెలవులని తగ్గించేసారు. మే నెల మధ్యవరకూ క్లాసులు జరుగుతాయని సర్క్యులర్ వచ్చింది. సంక్రాంతికి ఇళ్ళకి వెళ్ళి వచ్చిన విద్యార్థులు, మళ్ళీ ఇళ్ళకు వెళ్ళలేదు చాలామంది. వేసవి సెలవులు ఏప్రిల్ పదిహేనుకి వస్తాయనుకున్నవి, మరో నెల వెనక్కి వెళ్ళడంతో చాలామంది దూరపు ఊళ్ళ వాళ్ళకి నిరాశ!

ఇవే మాటలు చెప్పుకుంటూ, ఒంటిగంట సమయంలో సౌభాగ్య, విజయ, మాణిక్యం హాస్టల్ బస్ ఎక్కడానికి, ప్రిన్సిపాల్ ఆఫీసుదగ్గర రావిచెట్టువైపు వెళుతున్నారు.

"స్టూడెంట్ యూనియన్ ప్రెసిడెంట్స్ ఉన్నారుగా! సెలవులు ముందుగా ఇమ్మని అడగొచ్చు కదే! మొన్న మా నాన్నగారు రమ్మని రాసారు. నేనే వెళ్ళలేదు. ఇలా మే వరకూ ఉండాలంటే, వెళ్ళివచ్చేదాన్ని! ఇంటికెళ్ళి చాలా రోజులయ్యింది. ఏమిటో!... మాణిక్యం ఒక్కసారన్నా ఇంటికెళ్ళి వచ్చింది." అంది సౌభాగ్య.

హరిప్రకాష్, మరి కొంతమంది వీళ్ళ మాటలు వింటూ వీళ్ళతో కలిసారు.

"మీరు సెలవులకోసం చూస్తున్నారు కానీ అకడమిక్ ఇయర్ కరక్ట్‌గా వుంటే ఈ పాటికి సిలబస్‌లైపోయి పరీక్షలు దగ్గరపడేవి. ఇప్పటికే ఓ సంవత్సరం వృధా! జనవరిలో చేరాం మనం! సెలవులకెళ్ళి చేసేదేముంది ఇంటి దగ్గర! కొన్ని నెలలు ముందు పి.జి చేతికొచ్చినా వచ్చినట్లేగా! అదిగో, ఆ ప్రసాద్‌గాడిలాంటి వాళ్ళకైతే నష్టం లేదు. డబ్బులు కట్టకుండా హాస్టల్‌లో పడి మెక్కొచ్చు మనం మెస్ బిల్లులు కట్టుకోవాలి కదా!" అన్నాడు హరిప్రకాష్.

"ప్రసాదేం అలాంటి వాడు కాదు" అంది మాణిక్యం.

"నేను ప్రసాదు గురించి కాదన్నది. బోలెడుమంది ఉన్నారు, వెల్ఫేర్ స్కాలర్‌షి

ప్పులతో ఏళ్ళ తరబడి క్యాంపస్‌లోపడి మెక్కుతారు." అన్నాడు హరిప్రకాష్.

విజయ మనసులో తెలియని ఇబ్బంది. నిస్సత్తువగా అనిపించింది.

వీళ్ళు వి.సి.హౌస్ దగ్గర రోడ్డు మీదికి వచ్చేటప్పటికి కృష్ణమాచార్యులు ఇన్‌గేటు నుండి లోపలికొస్తూ కనిపించాడు. బందరు వాళ్ళందరూ రోడ్డు ప్రక్కగా ఆగారు. కాసేపు మాట్లాడి, తర్వాత కలుద్దామనుకుని హరిప్రకాష్, కృష్ణమాచార్యులు కలిసి వెళ్ళిపోయారు. ఆడపిల్లలు రావి చెట్టు దగ్గర బస్సు ఎక్కేసారు.

★ ★ ★

హైదరాబాదు వాలీబాల్ ట్రైనింగ్ క్యాంప్‌కెళ్ళి ఈ ఉదయమే వచ్చాడు ప్రసాదు.

మధ్యాహ్నం లైబ్రరీకి వెళ్ళాడు.

ప్రసాదు క్విక్ రిఫెరెన్స్ సెక్షన్‌లో కూర్చొని సినానిమ్స్ డిక్షనరీ చూస్తున్నాడు. ఏ అర్థంలో ఏయే పదాల్ని వాడొచ్చో విపులంగా వుంది అందులో. ఈ నాలుగు నెలల్లో ఇంగ్లీషు వేగంగా చదవడం అలవాటవుతోంది ప్రసాదుకి. డిక్షనరీ సహాయం ఎక్కువగా తీసుకుంటున్నాడు. ఆ పుస్తకాన్ని చదువుతూ చాలాసేపు గడిపాడు. అతని బయోలాజికల్ క్లాక్ గ్రౌండ్‌కి వెళ్ళమని అలారం ఇచ్చింది. లేస్తుంటే, ఎదుటి వరసలో కూర్చుని ఉన్న విజయ. పట్టలేనంత సంతోషంగా అనిపించింది ప్రసాదుకి.

హైదరాబాదు ట్రైనింగ్ క్యాంపువల్ల పద్దెనిమిది రోజులయింది విజయని చూసి. ఉదయం క్యాంపస్‌లో కాలు పెట్టినప్పటి నుంచి, ఎక్కడైనా తను ఎదురుపడితే బావుండని తహ తహ! ఇలా అనుకోని అదృష్టంలా విజయ ఎదురుగా కనిపించేసరికి శరీరం తేలిపోతున్నట్లుగా ఉంది ప్రసాదుకి.

విజయ తలవంచి పుస్తకం

## కొత్తగాలి...

**కొందరికి**
**గోడలే చెవులు**
**వాటి రంధ్రాలే**
**కళ్ళు**

**– వై. సుభాషిణి, హైదరాబాద్**

చదువుకుంటోంది. విజయ ప్రక్క కుర్చీ ఖాళీగానే ఉంది.

విజయ ప్రాక్టికల్స్ నుండి వెళ్ళేటప్పుడు, ప్రతిసారీ ప్రసాదు కల్సి బస్టాపు వరకూ రావడం, మాట్లాడుకోవడం, ఒకరికోసం ఒకరు ఎదురు చూడడం ఇద్దరి మధ్యా సాన్నిహిత్యం పెంచింది.

ప్రసాదు వెళ్ళి విజయ ప్రక్కన కూర్చొని, "ఎంతసేపయింది వచ్చి?" అన్నాడు చాలా నిదానంగా.

పుస్తకం మీది నుంచి దృష్టి మరల్చుకుండానే "ఇప్పటికి కనిపించానన్నమాట. సంతోషించాను" అంది విజయ.

"నిజంగానే నిన్ను చూడలేదు. ఆ డిక్షనరీలో మునిగిపోయాను."

"నువ్వు ఎందులో కావాలంటే అందులో మునుగు! నేను ఇంకాసేపు చదువుకోవాలి. నీకు టైమౌతున్నట్టుంది, గ్రౌండుకి బయలుదేరు" అంది తలెత్తకుండా.

ప్రసాదు మౌనంగా కూర్చున్నాడు- అక్కడున్న పుస్తకాలు కదుపుతూ. కాసేపు ఆగి, "వచ్చి ఎంతసేపయిందో చెప్పలేదు" అన్నాడు.

"తెలుసుకుని ఏంజెయ్యబోతావ్?"

"ఏం చేస్తాను? ఏదో రకంగా రెండు మాటలు నీతో మాట్లాడాలని చూస్తాను" అన్నాడు.

లైబ్రేరియన్ వీళ్ళవైపు నుండి కదిలివె

ళ్ళింది.

"లైబ్రేరియన్ మన వైపు చూస్తోంది. నువ్వు వచ్చేవరకూ నేను బయట వెయిట్ చేస్తాను" అని అక్కడ్నుంచి లేచి బయట కొచ్చాడు. స్టాటిస్టిక్స్ డిపార్ట్‌మెంట్ వైపున్న చెట్టు దగ్గర దిమ్మమీద కూర్చు న్నాడు.

తనవైపేనా చూడకుండా ఎందుకలా మాట్లాడుతోంది? - హైదరాబాదు వెళ్ళే ముందు చెప్పలేదని అలిగిందా!- అది అల కైతే.... ప్రసాదుకి ఉద్విగ్నంగా ఉంది.

పదినిమిషాల తరువాత విజయ లైబ్రరీలోంచి బయటకొచ్చింది. ప్రసాదుని గమనించనట్లు కాన్వకేషన్ హాలు వైపు నడుస్తోంది. ప్రసాదు గబగబా నడుస్తూ విజయని కలిసాడు. ఇద్దరూ మౌనంగా నిదానంగా నడుస్తున్నారు.

"హైదరాబాదు నుంచి ఉదయమే వచ్చాను. వాలీబాల్ కోచింగ్ క్యాంప్‌కి మన క్యాంపస్ నుంచి నన్ను, మరో నలు గురిని పంపారు. నీకు చెబుదామనే అను కున్నాను...... కానీ..." ఆగిపోయాడు. విజయ వంక చూస్తున్నాడు.

విజయ ప్రసాదు వైపు చూసింది. తననే అపేక్షగా చూసే కళ్ళని చూసింది.

"నాకు చాలా ఉక్రోషంగా అనిపించింది, నువ్వు హైదరాబాదు కోచింగ్ క్యాంప్‌కెళ్ళా వని మాణిక్యం చెప్పినపుడు" అంది విజయ.

ఆ మాటనేసాక విజయలో సీరియస్‌నెస్ పోయి ముఖం ప్రసన్నంగా అయింది. విజయ చాలా చనువుగా అనిపించింది ప్రసాదుకి. "విజయ" అని లోతుగా చూసాడు.

"నిజం చెప్పనా! నీకు చెప్పాలనే అనుకు న్నాను. కానీ అతి చనువు తీసుకుంటున్నా నని నువ్వు అనుకుంటావేమోనని సంశయం! ఈ పదిహేను రోజులూ లెక్క పెట్టుకుంటూ గడిపాను... ఉదయం ట్రైన్ దిగిన దగ్గర్నుంచి, నువ్వెక్కడైనా ఎదురుప డితే బావుండునని చూస్తున్నాను" అన్నాడు విజయవైపే చూస్తూ.

మెడ దగ్గర గంధం పూస్తున్నట్టు చక్కిలి గింత!

ప్రసాదు తన ట్రైనింగు వివరాలు మాట్లాడుతుంటే, ఇద్దరూ ఆర్ట్స్ కాలేజి బస్టాప్ దాటి రేడియో స్టేషన్ మీదుగా నిదానంగా నడుస్తున్నారు. కబుర్లు చెప్పు కుంటూ ఎర్రమట్టి గుట్టల స్టాప్ దగ్గర, రోడ్‌కి వున్న సపోర్టింగ్ వాల్ మీద కూర్చున్నారిద్దరూ.

"పోనీలే, నా మీద కోపమొచ్చింది నీకు!" అన్నాడు.

"కోపమొస్తే పోనిస్తారా! పోగొడతారు గానీ!"

"నువ్విలా నామీద అలిగి ఉండకపోతే, నేనిది రోజూ జేబులో వేసుకుని ఎంత కాలం తిరిగేవాడినో..." అని జేబులో చెయ్యి పెట్టి తీసాడు. "క్యాంప్‌లో కిట్‌తో పాటు కొద్దిగా డబ్బులిచ్చారులే. ఇది కొంటున్నపుడు, నీకు ఆఫర్ చేస్తే తీసుకుం టావో లేదో, ఉన్న పరిచయం కూడా తెగి పోతుందేమో అని ఎంత మధనపడ్డానో తెలుసా!" అంటూ చేతిలో ఉన్న హార్ట్ పాలతిన్ ప్యాక్‌ని ముందుకి చాపాడు విజ యవైపు.

చెక్క పనితనం దంతపు నగిషీతో ఒక వైపు 'వి' అనే ఇంగ్లీషు అక్షరం రాసిన చిన్న కీ చైన్ ఉంది ఆ ప్యాక్‌లో

"ఇది నాది" అని తీసేసుకుంది విజయ. కీచైన్ చూస్తూ, "నీ సెలక్షన్ బావుంటుందే! నీ డ్రస్‌లా కాదు. చాలా బావుందిది. థ్యాంక్సేమీ చెప్పను" అంది చొరవగా. ప్రసాదు నవ్వి ఊరుకున్నాడు.

"అవునూ, పామర్రులో మీరుండేదెక్కడ ప్రసాద్? " అంది.

"మాది పామర్రు కాదు. నేను కురుమద్దాలి మాలపల్లి నుంచి వచ్చేవాణ్ణి. మా పెద్దమ్మ దగ్గరుండి చదువుకున్నాను. అసలు మాది ఘంటసాల దగ్గర పాటిపూడి మాలపల్లి"

"అయితే నువ్వు మా పామర్రు కాదన్నమాట! అనవసరంగా మా వూరనుకుంటున్నాను" అంది ఉడికిస్తూ.

"మీ ఊరు కాకపోతే ఏమన్నా ప్రమాదమా? " అన్నాడు నవ్వుతూ.

"ప్రస్తుతం ఈ బస్ కూడా తప్పిపోయే ప్రమాదం ఉంది" అని వచ్చే బస్సును చూపిస్తూ లేచి నిలబడింది.

★ ★ ★

తిరుపతి -పూరీ ఎక్స్‌ప్రెస్ భీమవరంలో ఆగింది. విశాఖలో బయలుదేరడమే ఆలస్యంగా బయలుదేరింది. భీమవరంలో అర గంటపైగా ఆగుతుందన్నారు. ఇంజన్‌లో బొగ్గు, నీరు నింపుకోవాలి.

మాణిక్యం, హరిప్రకాష్, కృష్ణమాచార్యులు, సుధీర్, సౌభాగ్య, విజయ, మరి కొందరు కునుకు నిద్ర ముఖాలతో బద్ధకంగా లేచి ముఖాలు కడుక్కునే ప్రయత్నంలో ఉన్నారు. వీళ్ళంతా రిజర్వేషన్ కంపార్ట్‌మెంట్లో ఉన్నారు. ప్రసాదు, సుధాకర్, కృష్ణమోహన్ జనరల్ బోగీలో ఉన్నారు. జనరల్ బోగీ మన బోగీకి ముందుంటుందా, వెనకుంటుందా అని వివరాలు తెలుసుకోవడం ప్రారంభించింది మాణిక్యం.

"ఎటో అటువైపు ఉంటుంది కానీ ముందు నువ్వు వెళ్ళి బ్రష్ చేసుకురా! కాఫీ తాగొచ్చు" అంది సౌభాగ్య.

హరిప్రకాష్, కృష్ణమాచార్యులు ప్లాట్ ఫారం మీద బ్రష్ చేసుకుంటూ నిలబడ్డారు. విజయ కిటికీ దగ్గర కూర్చొని బయటికి చూస్తోంది ప్రసాద్ కనిపిస్తాడేమోనన్నట్లు. ప్రసాదు ఇదే ట్రైన్‌కి వస్తానన్నాడు కానీ ట్రైన్ కదిలేంతవరకూ కనిపించనే లేదు.

వేసవి సెలవులకి ఇళ్ళకి బయలుదేరారు వీళ్ళంతా. సుమారుగా ఐదు నెలల తరువాత. సొంత ఇళ్ళకి ఇంతదూరం వెళ్ళడం, క్లాస్‌మేట్స్ ఫ్రెండ్స్‌తో ప్రయాణం! అందరికీ కొత్త అనుభూతి. వేసవి సెలవుల డేట్ తెలిసిన వెంటనే గుడివాడకి రిజర్వేషన్ చేయించుకున్నారు. విజయ ప్రసాదుని కదిపింది.

'ఎందుకు? జనరల్లో వచ్చేస్తాన'న్నాడు. విజయ కూడా అంత పట్టుపట్టలేదు. ట్రైన్ కదిలేవరకూ ప్రసాదు కనిపించలేదు. విజయకి డల్‌గా ఉంది మనసులో.

భీమవరంలో దిగవలసిన వాళ్ళు దిగుతున్నారు. కృష్ణమోహన్, సుధాకర్‌లకి టాటా చెప్పి, తన బ్యాగ్, ప్రక్కనున్న మరో స్టూడెంట్‌కి చూడమని చెప్పి, విజయా వాళ్ళున్న బోగీ వైపు వచ్చాడు ప్రసాదు.

ప్లాట్‌ఫారమ్ మీద, విజయ కిటికీవారగా నిలబడి "గుడ్ మార్నింగ్" అన్నాడు ప్రసాదు. విజయ చూసి, "బ్యాడ్ మార్నింగ్! అసలు నువ్వు ఎక్కావో లేదో నాకెలా తెలుస్తుంది? ముందే వస్తానన్నావుగా? " అంది చిటపటలాడుతూ. ఆ కోపంలో ప్రసాద్ కోసం చూసిన ఎదురు చూపు, ఆత్రుత.

"ఓ కాఫీ తీసుకొచ్చేదా? ఆ వేడినీళ్ళకి

## కొత్తగాలి...

**బాట్ మీద**
**ఒట్టు**
**క్రికెట్ బెట్టింగ్**
**ఓటు మీద ఒట్టు**
**అసెంబ్లీలో ఫైటింగ్**

*– లక్కోజు శ్రీనివాసరావు*, నెల్లూరు

నువ్వు కాస్త చల్లబడతావేమో!" అన్నాడు నవ్వుతూ.

మాణిక్యం బ్రష్ చేసుకొచ్చి ముఖం తుడుచుకుంటూ ప్రసాదుని చూసి, "నువ్వు ఈ ట్రైన్‌కే వస్తానన్నావుకదా, కదిలే వరకూ కనబడలేదేం? నువ్వు వచ్చావో రాలేదో తెలియలేదు" అంది.

"మనకి రైల్వే కన్సెషన్ ఫారమ్స్ ఇచ్చారు కదా! కన్సెషన్ ఉపయోగించుకో డానికి ఇన్ని కష్టాలు, ఛీత్కారాలు ఉంటా యని తెలియదు. సంతకాలు, వెరిఫికేష న్‌లు, వన్‌ఫోర్త్ కన్సెషన్ అనేటప్పటికి రైల్వే క్లర్కు ఛీదరింపులు అయ్యి- టికెట్ కొనుక్కునేటప్పటికి ట్రైన్‌కి పచ్చజెండా ఊపేస్తున్నాడు. ట్రైన్‌కి అందుతామా లేదా అనిపించింది క్యూలో నిలబడ్డప్పుడు" అన్నాడు.

"మీకు కూర్చోడానికి సీటు దొరికిందా? " అంది విజయ.

"అనకాపల్లి తరువాత సర్దుకున్నాం. ఫర వాలేదు" అన్నాడు.

"ప్రసాద్! కాఫీ అతను కనిపిస్తుంటే పిలుస్తావా? " అంది సౌభాగ్య. ప్రసాదు కాఫీ అతని కోసం చూసి, కనిపించాక చేతి సైగ చేసాడు. హరిప్రకాష్, కృష్ణమాచా ర్యులు వచ్చారు ముఖాలు కడుక్కుని. ప్రసాదు కూడా లోపలికొచ్చాడు. అందరూ లోపల కూర్చొని కబుర్లు. కాఫీలు వచ్చాయి. కృష్ణమాచార్యులు కాఫీ తీసుకో లేదు.

"ప్రసాద్, మీకెలా ఉందిరా! సీటన్నా దొరికిందా కూర్చోడానికి? " అన్నాడు సుధీర్ కాఫీ తాగుతూ. దొరికిందన్నట్టు తలూపాడు ప్రసాద్.

"ఈసారి నేను విజయవాడ మీదుగా వస్తాను. ఛస్తే ఈ ట్రెయిన్ ఎక్కను" అన్నాడు హరిప్రకాష్.

"బెర్త్ ఉందనే మాటేగాని, నిద్రాలేదు పాడూలేదు! అయితే బందరు బస్సుకి, లేదంటే విజయవాడ మీదుగా వెళ్లడమే బెస్ట్" అంది సౌభాగ్య.

తన పనసపళ్లు, బ్యాగులు ఉన్నాయో లేవా చూసుకుంటోంది మాణిక్యం.

"మాణిక్యం మాత్రం ట్రైన్‌లో రావల సిందే! ఇంత లగేజ్‌తో బస్సులో కష్టం కదా!" అన్నాడు హరిప్రకాష్. అందరూ నవ్వారు.

"మీకేం లగేజిలు తక్కువున్నాయేమిటి? నాకు పనసపళ్లు రెండు ఎక్కువ వున్నా యంతే" అంది మాణిక్యం.

"అవునులే అన్నీ మాతో మోయించేసా వుగా!" అంది విజయ.

మాణిక్యం దగ్గర పనసపళ్లు చూసాక, తనూ ఒక పనసపండు తీసుకుని ఉండా ల్సిందనిపించింది ప్రసాదుకి.

"ఏమిటే ఫ్రెండ్స్ అన్నాక ఆమాత్రం చెయ్యరా!" అంది మాణిక్యం.

"అవునమ్మా నీకు మేం కూలివెధవల్లా కనపడ్డాం. మళ్లీ ఒక్కో బ్యాగు ఎంతబ రువో తెలుసా, చేతులు పడిపోయాయి" అంది విజయ.

"మా క్లాస్‌మేట్స్ లక్ష్మీనారాయణ వాళ్లు ఉండబట్టి సరిపోయింది గానీ, మేం నలు గురమే అయితే చచ్చేవాళ్ళం ప్రసాద్! ఏం హరి? " అంది సౌభాగ్య.

"అదేమిటి, మాణిక్యం అభిమానంగా ఇంటికో రెండు పనసపళ్లు పట్టికెళుతుంటే అలా అంటారు? " అన్నాడు ప్రసాదు.

"మోసింది మేము, నువ్వు కాదుకదా! మీ డిపార్ట్‌మెంట్ కాబట్టి సపోర్టింగ్‌గా మాట్లాడతావు" అన్నాడు హరిప్రకాష్.

"మీరందరూ నాకు సాయంచేసారు. అందరికీ థ్యాంక్స్. సరేనా!" అని ప్రసాదు వైపు చూస్తూ, "అసలు వచ్చేటపుడు ఎంత టెన్షనయిందనుకున్నావ్ ప్రసాద్! మెస్‌లో నేమో భోజనం రెడీ అవలేదు. మేం

మధ్యాహ్నమే చెప్పాం, పెందలకడ చేసెయ్యమని. ఎనిమిది దాటితే సెంటర్‌లో ఆటోలుండవు. ఏడున్నర అయ్యేంతవరకూ భోజనాలు పెట్టలేదు ప్రసాద్! మీలాగా బయట తినెయ్యలేం కదా మేం! ఎంత టెన్షనయిపోయిందో!" అంది మాణిక్యం ఆ గాభరాని మళ్ళీ అనుభవిస్తూ.

"బీడీ తాగొస్తానని ఒకడూ, గ్లాసులింకా కడగలేదని వొకడూ చంపుకుతిన్నారనుకో!

మేమంతా వెళ్లి గొడవపడితేగాని పెట్టలేదు ప్రసాద్" అంది సౌభాగ్య.

"ఈ మధ్య పనివెధవలకి బొత్తిగా భయం లేకుండా పోతోందే! ఒక్కోడికి పొగరు పెరిగిపోతోంది. ఎంత లెక్కలేకుండా మాట్లాడుతున్నాడో చూడు ఆ అప్పారావుగాడు..." అంటోంది విజయ.

ప్రసాదు ఉలిక్కిపడ్డట్టు చూసాడు విజయవైపు.

"మాకంతా ఆరున్నరకే రెడీ అయిపోయింది" అన్నాడు హరిప్రకాష్.

"సరే లేమ్మా! రెడ్డిరాణీ! మళ్ళీ ఆవేశపడకు గానీ,... గుడివాడ నుంచి ప్రయాణం ఎలా? " అంది సౌభాగ్య విజయతో.

"రైల్వేస్టేషన్‌కి మా బావగారొస్తారే, రెండురోజులు గుడివాడలో ఉండి పామర్రెళతాను" అంది విజయ సౌభాగ్యతో.

"మరి మీరు? " అంది కొనసాగింపుగా.

"గుడివాడ స్టేషన్‌లో దిగాక, ఓ అరగంటలోపు బందరు పాసింజరుంటే దానికి వెళతాం. లేకపోతే బస్‌స్టాండ్‌కి వెళ్లి బందరు బస్సు ఎక్కెయ్యడం!" అంది సౌభాగ్య- మాణిక్యం, హరిప్రకాష్‌ల వైపు - 'అంతే కదా!' అన్నట్టు చూసి. వాళ్లు తలూపారు.

"ఒకసారి నా బ్యాగు చూసుకుని వస్తాను" అని అక్కడినుంచి లేచాడు ప్రసాదు. టాయ్‌లెట్ కని లేచి వెళ్లింది విజయ.

విజయ డోర్‌దగ్గర నిలబడి ఉంది.

**కొత్తగాలి...**

**ఆకాశం వనమాలి**
**మబ్బుల ట్యూబులతో**
**భువనానికి**
**నీళ్లు పెడుతున్నాడు**

*-కె. ఆంజనేయకుమార్, విజయవాడ*

"ప్రసాద్! మనం గుడివాడలో కలవడం అవదు. మా బావగారు వస్తారు. మళ్లీ నువ్వు ఎప్పుడు క్యాంపస్‌కి తిరిగి వస్తావ్? " అని అడిగింది.

"రి-ఓపెనింగ్‌కల్లా వచ్చేస్తాను- అనుకోకుండా ఆలస్యమైతే తప్పించి. ఒకరోజు ముందుగానే వచ్చేస్తాను. ఇంటిదగ్గర పెద్ద పనులేముంటాయి నాకు"

"నేను పామర్రులో ఉండనేమో!" అంది బిడియంగా.

"నీకోసం సింహాచలం సంపెంగ పూలు, సింహాచలం వెళ్లి కట్టించుకొచ్చాను- నీకూ మా అమ్మకి. వీళ్ళ ముందివ్వడం బావుండదు కదా! నువ్వోకాస్త బయటికి వస్తావా! నేను తీసుకొచ్చి ఇస్తాను" అన్నాడు.

"సరే, ఆ బుక్సుబండి దగ్గరుంటాను" అని బెర్త్ దగ్గరకెళ్లి పర్సు తీసుకుని బయటకి వచ్చింది.

ప్రసాదు తన బోగీవైపు వడివడిగా వెళ్ళాడు.

విజయ బుక్సుబండి దగ్గర పేపర్లు, పత్రికలు తీస్తూ, నిల్చుంది. ప్రసాదు లేత పచ్చి అరటి దొప్పలలో కట్టిన పూల పొట్లం చేతికిచ్చి వెళ్లిపోయాడు. తను తీసుకున్న రెండు వారపత్రికలు, రెండు పేపర్లచాటున పూలపొట్లం తెచ్చి, బ్యాగు సర్దుతున్నట్లు పూలపొట్లం బ్యాగులో పెట్టింది. ఇదంతా మాణిక్యం, సౌభాగ్య గమనిం

చారు.

"విజయా! ప్రసాదు అతని కంపార్ట్‌మెంట్‌కి వెళ్లిపోయాడే" అంది మాణిక్యం సౌభాగ్యవైపు చూసి నవ్వుతూ ఇంకా బ్యాగు సర్దుతున్న విజయతో.

చిన్నగా- 'చెప్పాడు' అంది విజయ తలెత్తకుండా.

**10**

'గుండె గొంతుకలోన కొట్లాడతాది. కూసుండనీయదే కాసింత సేపు'.

జ్యేష్ఠమాసం వెన్నెల రోజులు! అన్నం తిని మంచం వేసుకున్నాడు ప్రసాదు. ఇంకా కరంటు వాసనలులేని ఆ మాలపల్లిలో తాటాకుల ఇంటి ముందు, నెమరువేస్తున్న గేదెల ప్రక్కన మంచంమీద పడుకుని మబ్బుల చాటున పరిగెత్తుతున్న చందమామని చూస్తున్నాడు.

మరొక్క వారం రోజులు గడిస్తే యూనివర్సిటీకి వెళ్ళొచ్చు. యూనివర్సిటీకి వెళ్లడమంటే ప్రసాదుకి కొత్త శ్వాస తెలుస్తోంది.

మధ్యలో ఒకసారి పెద్దమ్మ దగ్గరికి వెళ్ళాడు. పామర్రు వెళదామనుకున్నాడు. కానీ, మళ్ళీ ఆగిపోయాడు.

సాధు పిలిచేదాకా ప్రసాదు మబ్బుచాటున చందమామ జాడలు చూస్తున్నాడు.

సాధు లారీ డ్రైవరుగా ఎదిగాడు. ఈ సంవత్సరం సంబంధాల కోసం తిరుగుతోంది వాళ్లమ్మ. ఊర్లో మరో నలుగురైదు గుర్నీ మోటారు ఫీల్డులో పెట్టాడు సాధు.

"ఎప్పుడొచ్చావురా" అన్నాడు లేచి సాధు దగ్గరికి వెళుతూ.

"గంటక్రితం వచ్చానురా! అన్నందిని ఇటొచ్చాను. అమ్మ చెప్పింది నాకోసం నువ్వు రెండు మూడుసార్లు ఇంటికొచ్చి వెళ్ళావని... నీ వైజాగ్ ప్రయాణం ఎప్పుడు రా!" అన్నాడు సాధు.

"మరో వారంలో వెళ్లాలి రా" అన్నాడు సాధు.

"మబ్బు కమ్మి నాలుగు చినుకులడ్డాయి గాని మళ్లీ వర్షం లేదు చూసావా?" అన్నాడు వెంకటేసు. అక్కడే నాగేశు ఉన్నాడు.

"రారా, ఇటు చేలలోకి వెళ్లి కూచుందాం" అన్నాడు సాధు నలుగురూ కలిసి అక్కడ పొలాల్లో కూర్చున్నారు.

"ఒరే సాధూ, మనూరి కరంటు విసయం మరోసారి కదిపి రావాలి రా! రేపో, ఎల్లుండో మరోసారి మనం ఎల్లి రావాల్రా!" అన్నాడు నాగేశు.

"సంకురాతిరికి పెసాదొచ్చినపుడు చల్లపిల్లి ఎలట్రికలాపీసుకెళ్లి ఇంజనీరుతో మాటాడివొచ్చాడు గదా! నేనూ, రాఘవయ్య బాబాయి, పెద్దయ్య, పంచాయితీ నుంచి కాయితం పెట్టిచాం- పెసాదు చెప్పాడుగా! మరి ఎప్పుడెల్దాంరా సాదూ? పెసాదు ఉంటండగా నలుగురం ఎల్తే బావుంటది రా!" అన్నాడు వెంకటేశు.

"రేపే వెళ్దాం!" అన్నాడు సాధు.

కాసేపు లోకాభిరామాయణం మాట్లాడుకున్నాక, వెంకటేశు, నాగేశు "తెల్లారిలెగాల్రా" అని వెళ్లిపోయారు.

సాధు ఈ మధ్య చూసిన సంబంధాల గురించి చెప్పుకొస్తున్నాడు.

"చాలామంది పిల్లనివ్వడానికి ఇష్టపడ్డం లేదురా లారీలోళ్లకి! అమ్మ తిరుగుతాంది. ఏదో ఒకటి కాయమైపోతదిలే ఈ సంవత్సరం" అని కాసేపాగి "ఒరే, నువ్వెక్కడున్నా రావాలిరో!" అన్నాడు.

"మరి నీ యవారమేంట్రా? .. యూనివర్సిటీలో బోల్డుమంది అమ్మాయిలుంటారంట గదా!" అన్నాడు ప్రసాదుతో.

"బోల్డుమందేముందిరా! బోల్డుమంది అందమైన అమ్మాయిలే ఉంటారు. ఫ్రీగా ఉంటారు. ఎవరితోనైనా మాట్లాడొచ్చు.




అంతే. అక్కడి జీవితం వేరురా! అక్కడికి చదువుకోడానికి వచ్చిన అమ్మాయిలంతా కాస్త ఉన్నోళ్లే! మనలాంటి వాళ్లు కాదు. మన ఆడోళ్లలాంటి వాళ్లు అసలు అక్కడికి వస్తారో రారో కూడా తెలియదు" అన్నాడు ప్రసాదు.

సాధు చిలకలపూడి సంబంధం గురించి ఆ అమ్మాయి గురించి చెప్తుంటే ప్రసాదు ఆసక్తిగా వింటున్నాడు. సాధు నాకంటే చొరవైనవాడు అనుకున్నాడు.

మధ్యరాత్రి వరకూ కబుర్లు చెప్పుకుని ఇళ్లకు చేరారు. ప్రసాదు విజయ విషయం

## కొత్తగాలి...

**ఇకపై దిక్కులతో ప్రపంచాన్ని గుర్తించలేం రానున్నది రోబో యుగం**

**—తలకట్ల మహీపాల్‌రెడ్డి, హైదరాబాద్**

చెబుదామనుకున్నాడు సాధుకి. కానీ బిడియంగా అనిపించి చెప్పలేదు.

ప్రసాదుకి చాలా సేపు నిద్రపట్టలేదు. విజయ గురించి ఆలోచిస్తూ ఎప్పుడో పడుకున్నాడు.

★ ★ ★

ఒక్కసారి హాస్టల్‌లో కలకలం! సీనియర్ విద్యార్థులు హడావుడి పడిపోతున్నారు. విద్యార్థి నాయకులు చాలా ఆవేశపడుతున్నారు.

కొంతమంది పుస్తకాలు తీసుకొని రూమ్ తాళాలు వేసి క్లాసులకి బయలుదేరుతున్నారు. నాగార్జున హాస్టల్ ముందు విద్యార్థినాయకులు గుమిగూడి ఎవ్వరూ క్లాసులకి వెళ్లొద్దని చెబుతున్నారు. విద్యార్థులెవరూ బయటకు వెళ్లకుండా గేటుకు తాళం వేసారు.

'ఇవేం గొడవలు మనకెందుకు' అనుకున్న వాళ్లు కామ్‌గా మెస్ వెనకదారి నుండి బయటకి వెళ్లిపోతున్నారు.

"బ్రదర్స్ అందరూ కిందికి రావాలి" అని పెద్దగా కేకలు పెడుతున్నారు సీనియర్ విద్యార్థులు. "పెళ్లి నడకలేంటి గబగబ దిగి రావాలి" అని కేకలు వేస్తున్నారు. మరికొంత మంది ఒక్కొక్క అంతస్తులో ఉన్న రూముల్లో ఉన్నవార్ని కిందికి తీసుకొస్తున్నారు.

ఎస్.సి, ఎస్.టి. విద్యార్థులందరూ తమంత తామే గుమిగూడి పోతున్నారు. బి.సి. విద్యార్థులు కొందరు ఇష్టంగాను, కొంతమంది అనాసక్తిగాను నిలబడి ఉన్నారు. బి.సి. విద్యార్థి నాయకులు కొంత హడావుడి చేస్తున్నారు.

'కారంచేడు' 'కారంచేడు ఊచకోత'; హోరెత్తుతోంది హాస్టల్.

ఏ కొద్దిమందో మినహా హాస్టల్లో ఉన్న విద్యార్థులందరూ సమావేశమయ్యారు.

మొన్న యూనియన్ ఎన్నికల్లో, జిల్లా ఫీలింగులని, మాలలని, మాదిగలని, కర్రలు పట్టుకొని తన్నుకున్నవాళ్లు, మాట్లాడుకోవడం మానేసినవాళ్లు, ఒకరి మీదొకరు పోటీపడిన వాళ్లు, అందరూ కలిసి కట్టుగా గుమిగూడుతుంటే ప్రసాదుకి ఆశ్చర్యంగా అనిపించింది.

సిమెంట్ బెంచి మీద పాల్ నిలబడ్డాడు. అతని ముఖంలో ఆవేశపుటుద్వేగం! ఒక్క క్షణంలో కోలాహలం అణగిపోయింది.

పాల్ మాట్లాడడం ప్రారంభించాడు.

అనర్గళంగా, ప్రతి అణువులో, ఆవేశంతో గంగానమ్మ సంబరంలో నిప్పుకణిక దగ్గర వెచ్చబెట్టిన 'కనకతప్పెట' గర్జనలా, రక్తం నిలవనివ్వని 'తానాషా' హోరులా, అణువణువూ ఆవేశం నిండేటట్లు పాల్ ఉపన్యాసం ఐదు నిముషాల్లో ముగిసింది.

అతని మాటలు పూర్తయ్యేటప్పటికి అక్కడున్న విద్యార్థులందరిలోనూ కర్తవ్యం కనిపించింది. ఇంక ఎవ్వరూ ఎటూ వెళ్ళడం లేదు. అందరూ తమంతటతామే రెండు లైన్సుగా నిలబడి ప్రొసెషల్‌లా కదలడం మొదలు పెట్టారు.

మిగిలిన హాస్టల్స్ నుండి కూడా విద్యార్థులు వచ్చి చేరారు. ప్రసాద్‌కి గగారిన్ కనిపించాడు. ఒక బృందాన్ని అతను నడిపించుకువచ్చి వీళ్ళలో కలిపాడు. ప్రసాదుకి చాలా శక్తి వచ్చినట్లుగా ఉంది. ఇలాంటి ఒక నిరసనని ఇంత ధైర్యంగా

తెలియజెయ్యడం అతను ఎన్నడూ చూడ లేదు.

"అర్ధనగ్న ప్రదర్శనతో కలక్టరుకి మెమొరాండం ఇస్తాం. అందరూ సిద్ధంకావాలి" అనడం, షర్టులు తీసి నడుంకి చుట్టుకున్నారందరూ. అన్ని డిపార్ట్‌మెంట్లలో క్లాసులు బాయ్‌కాట్ చేయించివచ్చారు కొంతమంది విద్యార్థులు.

అసెంబ్లీ హాల్లో వి.సి. మీటింగ్ మధ్యలో ఆగిపోయింది.

అయిదు వ్యానుల్లో ఆర్మ్డ్ పోలీసులు వచ్చారు.

అందరూ చొక్కాలు తీసి, అర్ధనగ్నంగా సాగుతున్న ప్రొసెషన్ కలక్టరాఫీసుకి సాగింది. పెట్రోల్ బంకు దగ్గర కొచ్చేటప్పటికి ఓ యాభైమంది విద్యార్థినులు వచ్చి చేరారు. స్లోగన్లు హోరెత్తి పోతున్నాయి. పోలీసు వ్యానులు నిదానంగా ప్రొసెషన్ వెంట వస్తున్నాయి.

"సహించం సహించం.. మారణకాండను సహించం.." స్లోగన్లు దద్దరిల్లచేస్తూ, పోలీసుల్నిచూసి మరింత గట్టిగా అరుస్తూ ప్రొసెషన్ కలక్టరాఫీసు చేరింది.

కలక్టరు ఛాంబర్ నుండి బయటకు వచ్చి మెమొరాండం తీసుకున్నారు. కొంతసేపు, దగ్గరగా ఉన్న వాళ్ళతో మాట్లాడి, అందరికీ చెయ్యి ఊపి లోపలికి వెళ్లిపోయారు.

ఎవరికివారు డిస్పర్స్ అయిపోయారు.

ప్రసాదుకి ఆరోజు అర్ధమయింది. ఇక్కడ చదువుకుంటున్న ఎస్.సి., ఎస్.టి.లు ఎవ్వరూ పూరి కొంపల్లోని వాళ్ళ అమ్మానాన్నలని, ఆత్మగౌరవాన్ని మరిచిపోలేదని.

ఒక్కసారిగా తన వాళ్ళు, ఊరు, గొడవలు గుర్తుకొచ్చాయి ప్రసాదుకి.

హాస్టల్‌కి వచ్చేటప్పటికి, సిమెంట్ బెంచ్ మీద కాళ్ళు పెట్టుకుని కబుర్లు చెబుతున్నాడు సుధీర్.

"సుధీర్!, నువ్వు కనిపించలేదే! ప్రొసెషన్‌లో! రాలేదా? " అని అడిగాడు ప్రసాదు.

"మనం వెళ్ళకపోయినా జరిగేది జరుగుతుంది గురూ! దీని కోసం కేకలు వేసుకుంటూ అంత దూరం నడిచివెళ్ళడం ఆయాసం తప్ప ప్రయోజనమేముంది, చెప్పు? " అన్నాడు కాళ్ళూపుకుంటూ.

"నీలాంటి వాడికెందుకురా రిజర్వేషన్లు? - మమ్మల్ని నాశనం చెయ్యడానికి కాకపోతే! క్లాస్ సెక్రటరీ కావాలనుకున్నపుడు ఎస్.సి.వని గుర్తుందా? నీకేం అనిపించడం లేదా? నీ బాబు ఉద్యోగం చేస్తున్నాడుగా! సమస్య వస్తే ఆయాసమా? నీకు అవసరమొచ్చినపుడు మాత్రం ఎస్.సి.వని గుర్తుంటుంది. ఛ... వెధవ" అని ఏవగింపుగా చూసి ముందుకెళ్లి పోయాడు ప్రసాదు.

సుధీర్ అలా మ్లానంగా ఉండిపోయాడు.

★ ★ ★

ఈ ప్రొసెషన్‌లో పాల్గొనాల్సిన అవసరం లేని విద్యార్థులు, డే స్కాలర్స్ ఇళ్ళకు వెళ్ళిపోయారు. మగపిల్లలు హాస్టళ్ళకి వెళ్ళిపోయారు. ఆడ పిల్లలకి హాస్టల్‌కి బస్సులెపుడు బయలుదేరుతాయో తెలియదు. కొంతమంది కాసేపు లైబ్రరీలో కూర్చొని వెళ్ళవచ్చు అనుకున్నా, లైబ్రరీ కూడా మూసి ఉండడంతో ఆ చెట్ల క్రింద కూర్చున్నారు. వీళ్ళకి చాలా చికాకుగానూ అసహనంగానూ ఉంది. బలవంతంగా క్లాసులు ఖాళీ చేయించడం, ఎక్కడో ఏదో జరిగితే ఇక్కడ అల్లరి చెయ్యడం ఈ చెట్లనీడలో కూర్చున్న వీళ్ళకి నచ్చడం లేదు.

హరిప్రకాష్, సౌభాగ్య, మాణిక్యం, విజయ, కృష్ణమాచార్యులు, పద్మావతి, లక్ష్మి, మధుసూదన్ అక్కడ ఓ చెట్టు కింద కూర్చున్నారు.

మధుసూదన్ బందరు జాతీయ కళాశాలలోను, లక్ష్మి పద్మావతి కళాశాలలోను డిగ్రీచేసి కెమిస్ట్రీలో చేరారు. ఈ మధ్యే వీళ్ళకి పరిచయమయ్యారు.

"చాలా ఘోరమటరా! చాలా ఘోరంగా చంపేసారట కారంచేడులో! అన్యాయం కదా!" అన్నాడు మధుసూదన్.

"అన్యాయమే! కాదని ఎవరంటారు?

"దానికి ఇంత అల్లరేమిటి? ఇక్కడ క్లాసులులేకుండా చెయ్యడమేమిటి? " చాలా



ఉక్రోషంగా అంది లక్ష్మి.

"బలవంతంగా క్లాసులు బాయ్‌కాట్ చేయించడం ఏమీ బావుండలేదు. ఏమిటా దౌర్జన్యం! అసలు మాట్లాడనియ్యలేదు. మనకిష్టమైతే వెళతాం, లేదంటే లేదు. కిటికీ తలుపులు మూసెయ్యడం, బలవంతంగా వెళ్లగొట్టడం, ఏమిటిది? " అంది సౌభాగ్య కోపంగా.

"మేం క్లాసుల్లోకి కూడా వెళ్లలేదు. ఆర్ట్స్ కాలేజి బయటనుండే వచ్చేసాం. ఈ బస్సు లెప్పటికి వస్తాయో! క్లాసులోనో, లైబ్రరీలోనో, హాస్టల్‌లోనో కాకుండా బయట ఇలా.. ఈ పడిగాపులు.. టైం వృథా" నిస్సత్తువగా కూర్చుంది మాణిక్యం.

"అయినా వీళ్ళు రోడ్లెక్కి గొడవ చేస్తే ఏం జరుగుతుంది? పోలీసులున్నారు. గవర్నమెంటుంది. వాళ్ళు చూస్తారు" అన్నాడు కృష్ణమాచార్యులు.

"అక్కడ పోలీసు కేసులు కూడా పెట్టారట! అయినా చావులు ఆగలేదు కదా!" అన్నాడు మధుసూదన్.

"ఇక్కడెందుకు వీళ్లు కేకలెయ్యడం? ధైర్యముంటే అక్కడికెళ్లాలి గాని" అంది విజయ.

"అక్కడికి వెళ్ళి ఏదైనా చెయ్యడానికి ధైర్యమెక్కడిది వెధవలకి? మా ఊర్లో అయితేనా నోరెత్తితే డొక్క చించేస్తాం! అందుకే ఇక్కడ కేకలేస్తారు" అన్నాడు విసురుగా హరిప్రకాష్.



"అందరూ షర్టులు తీసేసి వెళుతున్నారు. ప్రసాదు కూడా ఉన్నాడందులో. పోలీసులు, పోలీసు వ్యానులు వీళ్ళ వెనక. ఎవ్వరూ భయపడడం లేదు. ఎంతమంద నుకుంటున్నావ్? చాలా పెద్ద ప్రొసెషన్..." తను చూసింది చెప్తోంది మాణిక్యం.

"ప్రసాదెందుకుండడు? ఉంటాడు. మా ఊరి మాలపల్లిలోనే కదా ఉండి చదువుకున్నదతను. ప్రసాదు వాళ్ల ఊర్లో కూడా ఇట్లాంటి గొడవలే అయ్యాయప్పుడు. ప్రసాదు కూడా వాటిల్లో ఉన్నాడని అనుకున్నారప్పుడు" అన్నాడు కృష్ణమాచార్యులు.

ప్రసాదు ప్రస్తావన రాగానే ముడుచుకుపోయింది విజయ. తనకి తెలియకుండానే తలదించేసుకుంది.

విశాఖపట్టణంలో పుట్టి పెరిగిన పద్మావతికి, కులం వల్ల మెరిట్ దెబ్బ తినడం తెలుసు కానీ ఈ నరుక్కోడాలు, కొట్టుకోడాలు, హరిప్రకాష్ చెప్పిన డొక్క చించెయ్యడాలు బోధపడడం లేదు.

"అసలు కారంచేడులో ఎస్.సి.లు ఏదైనా తప్పు చేస్తే వాళ్ల మీద పోలీసు కేసు పెట్టవచ్చు కదా! అప్పర్‌కాస్ట్ వాళ్లు వెళ్ళి కొట్టడం, నరకడం ఎందుకు? " అంది అమాయకంగా విశాఖపట్నం పద్మావతి.

అక్కడున్న విజయకిగాని, హరిప్రకాష్‌కిగాని, కృష్ణమాచార్యులుకి గాని, మధుసూదన్‌కిగాని, ఎస్.సి.ల మీద కేసు పెట్టడమేమిటో అర్థం కాలేదు. కాసేపటికి తేరుకుని, "కేసు పెట్టడమేమిటి? " అని నవ్వేశారు. వాళ్లెందుకు నవ్వుతున్నారో పద్మావతి అర్థం చేసుకునే ప్రయత్నంలో పడింది.

యూనివర్సిటీ బస్ రావడంతో లైబ్రరీ దగ్గర కూర్చున్న హాస్టల్ విద్యార్థినులందరూ బస్సెక్కేసారు.

బస్‌లో కూర్చున్న విజయలో తనకే తెలియని దిగులు.

★ ★ ★

ఆ తరువాతి రోజు స్టేట్‌బంద్ కూడా జరిగింది. మరో రెండురోజులు యూనివర్సిటీలో క్లాసులు జరగలేదు. క్లాసులు ప్రారంభమయ్యాక, విజయ లైబ్రరీకి వచ్చి ప్రసాద్ కనిపిస్తాడేమోనని చూసింది. వరసగా రెండురోజులు అలా చూసింది.

ప్రసాదు కారంచేడు వెళ్లాడు.

కారంచేడు నుంచి వచ్చాక, ప్రసాదు రోజూ లైబ్రరీకి వచ్చి విజయ కోసం చూస్తున్నాడు. సాయంత్రం బోటనీ డిపార్ట్‌మెంట్ దగ్గర ఎదురు చూస్తున్నాడు. అలా చెరో రెండురోజులు ఎదురుచూపులు అయ్యాక గాని వాళ్లు కలుసుకోవడం వీలు కాలేదు.

ఇద్దరూ సాయంత్రం డిపార్ట్‌మెంట్ నుండి ఇన్‌గేట్ దగ్గరున్న బస్ స్టాండ్‌కి, కబుర్లు లేకుండా నడుస్తూ చేరుకున్నారు.

"మొన్న రెండురోజులు చూసాను నీ కోసం" అంది పొడిగా.

"కారంచేడు వెళ్లాను. చీరాలలో కూడా ఉండవలసి వచ్చింది. వెళ్లి రావడం రెండు రోజులయింది. మొన్న ఉదయానికి చేరుకున్నాను. నేను రెండు రోజులుగా లైబ్రరీలో నీకోసం చూస్తున్నాను" అన్నాడు.

"నాకు తెలియకడుగుతాను ప్రసాద్, కారంచేడు వెళ్లి మీరేం చేస్తారు? ఈ ధర్నాలు, బందులువల్ల ఏమిటి ప్రయోజనం? " అంది.

"ఉప్పు సత్యాగ్రహమప్పుడు ఊరూర ఉప్పు తయారు చేసారు. ఏంటి ప్రయోజనం! స్వరాజ్యం కోసం ధర్నాలు, హర్తాళ్‌లు, ఊరేగింపులు చేసారు కదా! వాటికేం ప్రయోజనం ఉందో వీటికీ అదే ప్రయోజనం!" అన్నాడు ప్రసాదు.

"నీతో మాట్లాడడం కష్టం!" అంది విజయ.

"విజయా! నీకు నేనిలా ప్రొసెషన్లకి వెళ్లడం ఇష్టంలేదని కాదుగానీ, నీకు నచ్చ లేదనిపిస్తోంది. మేం ఏం ఆలోచిస్తామో నీకు తెలియదు. కోట్రెడ్డిగారి అమ్మాయివి నువ్వు! పని వెధవలకి పొగరుపెరిగి పోతోందనగలవు! పనిచేసే వాళ్లని వెధవలుగా ఈసడించుకుని మాట్లాడగలవు. ఇలా అంటున్నానని ఏమీ అనుకోవద్దు. 'కోట్రెడ్డి గాడి కూతుర్రా ఇది' అని ఎవరైనా నిన్ను అంటే సహించగలవా! కానీ ఇక్కడ చదువుకునే ఎస్.సి.లలో చాలా మందిమి బండబూతులు మాటలు అనిపించుకున్నాం. బండబారి పోవలసిందే! మనసు కదా బండబారలేదు. మనుషులం అనిపించుకోవాలనిపిస్తుంది విజయా! అందుకే ఇలాంటి వాటికి వెళ్లకుండా ఉండలేను..." నిదానంగా, స్థిరంగా, తను నొచ్చుకోకూడదన్నట్లు, నిశ్చయంగా ప్రసాదు చెప్తుంటే, తను ఇంతవరకూ ఎప్పుడూ చూడని గాంభీర్యం అతని ముఖంలో చూసింది.

"ఇంక ఆ గొడవ విడిచిపెట్టేద్దాం ప్రసాద్! మీకు ఎసైన్‌మెంట్స్ ఇచ్చేస్తున్నారా? " అంది విజయ.

"ఇంకా ఇవ్వలేదు. ఓ రెండు రోజుల్లో ఇస్తామంటున్నారు" అన్నాడు.

★ ★ ★

ఇపుడు ప్రసాదు వాళ్లంతా సీనియర్ విద్యార్థులయ్యారు. జూనియర్స్ రావడం, వెల్‌కమ్ పార్టీలు, ఫ్రెషర్స్ డేలు ఉల్లాసంగా ముగిసాయి. ఫస్టియర్‌లో సౌభాగ్యకి బోటనీలో ఫస్టుర్యాంకు వచ్చింది. మాణిక్యం నాలుగో ర్యాంకుతో సరిపెట్టుకుంది. ప్రసాదుకి ఫిఫ్త్ ర్యాంకు వచ్చింది.

రాత్రి ఏడుగంటలకి భోజనం చేస్తుంటే,

"అసెంబ్లీ హాల్లో డాన్స్ ప్రోగ్రామ్ రా, వస్తావా?" అన్నాడు సుధాకర్ ప్రసాదుతో.

"మనలాంటి పనికి మాలిన వెధవలు చూడ్డానికి కాదు ఆ ప్రోగ్రామ్! దానికి ఇన్విటేషనుండాలి. మహారాష్ట్ర గవర్నరు వస్తున్నాడు. చుట్టూ పోలీసు బందోబస్తు. హాయిగా టి.వి. చూసుకోడం మంచిది" అన్నాడు బాబూరావు కల్పించుకుని.

ప్రసాదుకి ఒక్కసారి వెళ్లి చూడాలనిపించింది. సరే, ప్రయత్నం చేద్దాం అనుకుని భోజనం చేసి డ్రస్ చేసుకుని అసెంబ్లీ హాలుకి వెళ్లాడు. పృచ్ఛకులుగా ఉన్న తెలుగు డిపార్ట్‌మెంట్ వాళ్లతో కలిసి లోపలికి వెళ్లిపోయాడు. విపరీతంగా పోలీస్ చెకింగ్. అప్పటికే అసెంబ్లీ హాలు పూర్తిగా నిండిపోయింది. ప్రసాదు వాళ్లు బాల్కనీలోకి వెళ్ళి నిలబడ్డారు.

కళాకృష్ణ నృత్యం ప్రారంభమయింది. నృత్యం చేస్తున్నది మగవాడని తెలియనంత లాలిత్యం! ఆ ఆరడుగుల నర్తనంలో, ఆ వాలు జడ విసుర్లలో, అలక నవ్వుల పెదిమల విరుపుల్లో, క్రీగంటి చూపుల్లో సుతారపు లాలిత్యపు సవ్వడి ప్రతి గుండెని తాకుతోంది. గాలి చొరని అసెంబ్లీ హాలు నీరవ నిశ్శబ్దంతో నాట్యపు వెలుగుల రాగాన్ని ఆస్వాదిస్తోంది.

నాట్యం పూర్తయింది. కొన్ని క్షణాల వరకూ అందరూ అచేతనంగా ఉండిపోయారు. ఎవరో, ముందు చేతనలోకొచ్చిన ఒక (అ) రసికుడు చప్పట్లు చరిచాడు. కరతాళ ధ్వనులు కొన్ని నిముషాలు మార్మోగిపోయాయి.

ముగింపు మాటలకి ఉపక్రమిస్తున్నారు. అప్పటికే అసెంబ్లీ హాలు ఖాళీ కావడం ప్రారంభమయింది.

బాల్కనీలో లైట్లు వెలిగాయి. మెట్ల దగ్గర లైటు పోయింది.

లైట్ల వెలుగులో విజయ. వడివడిగా కదిలాడు. జనాన్ని తోసుకుంటూ విజయ దగ్గరికెళ్లాడు. కళ్లతోనే పలకరించుకున్నారు. మెట్ల మీదినుండి దిగకుండా పోలీసులు ఆపేసారు. గవర్నరు గారిని, నేవల్ కమాండర్ ఆఫీసర్లని, అధికారులని, రాజకీయనాయకులని పంపడానికి వీలుగా. మెట్ల మధ్యలో ఇరుక్కుపోయారు వీళ్ళు. ప్రసాదు విజయ వెనకే నిలబడ్డాడు. వెనకనున్న వాళ్ళకి ముందుకు రావాలనే ప్రయత్నం. ప్రసాదు ఆ వత్తిడిని ఆపుతూ నిలబడ్డాడు. శరీరానికి శరీరం తగలడం తప్పడం లేదు. విజయకి చాలా దగ్గరగా ప్రసాదు. శరీరాన్ని నిలపలేని మనస్సు. చేతులు ముందుకు పోనిచ్చి విజయ పాపిడిని వాసన చూసాడు. విజయ గమనించింది. చేతిమీద చిన్న చరుపు చరిచి వెనక్కి చూసింది. సరిగా వెలుతురులేని ఆ మెట్లమధ్య విజయచూపులో ఏముందో ప్రసాదుకి తెలియలేదు. బాల్కనీ వాళ్ళని విడిచిపెట్టేసారు. విజయ, ప్రసాదువైపు చూడకుండా గబగబా వెళ్ళి హాస్టల్ వెళ్ళడానికి సిద్ధంగా ఉన్న బస్సు ఎక్కేసింది.

విజయ తనవైపు కనీసం కోపంగానైనా చూడకుండా వెళ్ళిపోవడంతో మనసంతా నిస్సారంగా అనిపించింది. 'ఛ' అనుకున్నాడు. తన్నుతాను తిట్టుకున్నాడు. నిగ్రహించుకోలేనందుకు మనస్సు పిండినట్లుగా అనిపించింది. రాత్రంతా నిద్రపట్టలేదు.

## కొత్తగాలి...

**ప్రేమ సినిమా**
**యువకుల రంగుల కల**
**యువతులపాలిట**
**మృత్యుహేల**

*- గరిశకుర్తి రాజేంద్ర, భిక్‌నూర్*

విజయకి ముఖం చూపించడానికి ధైర్యం చాలడంలేదు. తన గురించి ఏమనుకుం టుందోనని బెంగగా ఉంది. ఇక తనవైపు చూడదేమోనని దిగులు వేసింది. ఏమీ పాలుపోవడం లేదు.

ప్రసాదు క్లాసులకి వెళ్ళడం యాంత్రికమ యిపోయింది. ప్రాక్టీసుకు కూడా రెగ్యుల ర్‌గా వెళ్ళడం లేదు. ఒకసారి వెళ్ళి విజ యకి 'సారీ' చెబుదామనుకున్నాడు. ధైర్యం చాలలేదు.

ఈ సంవత్సరం కూడా మే పదివరకూ క్లాసులు జరుగుతాయన్నారు. సెప్టెంబ రుకే పరీక్షలు పూర్తిచేసి ఎకడమిక్ ఇయర్ ముందుకు తేవడానికి వి.సి. గారు ఆలోచి స్తున్నారన్నారు. సెప్టెంబరుకే పరీక్షలు రాయడానికి సిద్ధంగా ఉండమని అన్ని డిపార్ట్‌మెంట్స్‌లోను విద్యార్థులకి హెడ్స్ చెప్పారు.

ప్రసాదు క్లాసులకి వస్తున్నాడు, వెళుతు న్నాడు. పగటిపూట లైబ్రరీకి వెళ్ళడం మానేసాడు. సాయంత్రం వాలీబాల్ కి అసలు వెళ్ళడం లేదు.

ఆర్ట్స్‌కాలేజి మెట్లమీద నుంచి పైకి వెళుతుంటే, "ఏం ప్రసాదు, ఈ మధ్య నువ్వు బొత్తిగా కనిపిం చడం మానేసావు? " అంది మాణిక్యం ఎదురు పడి.

"ఎందుకు కనిపించడం లేదు? ఎవరి తొందరలో వాళ్ళున్నాం. కలిసి మాట్లాడుకోవడం లే దంతే!" అన్నాడు ప్రసాదు.

## వ్యవస్థ - అవస్థ

ఆంధ్రా పోలీసు, సీబీఐ, బ్లాక్ క్యాట్ కమెండోలకు ఓ అడవిలో వదిలిన కుందేలును పట్టుకునే పరీక్ష పెట్టారు. ఆంధ్రా పోలీసులు అడవిలో ఇన్‌ఫార్మర్లను అడిగా మని, అసలు అక్కడ కుందేళ్లే లేవని మూడునెలల తర్వాత చెప్పారు. తర్వాత రంగంలోకి దిగిన సీబీఐవాళ్లు ఓ ఎలుగుబంటిని పట్టుకొచ్చి కొట్టికొట్టి కుందే లని ఒప్పించే ప్రయత్నం చేశారు. చివరిగా వెళ్లిన బ్లాక్ క్యాట్ కమెండోలు మాత్రం అడవినంతా వెంటనే కాల్చిపారేసి కుందే లుకు తగినశాస్తి జరిగిందని సంబరపడ్డారు.



బోటనీ డిపార్ట్‌మెంటు వైపు వెళ్ళడానికి జంకు. చదువు ఎక్కడం లేదు. జిమ్‌కెళ్ళా లనే స్పృహే పోయింది. ఏదీ సహించని స్థితి. సముద్రం, జగదాంబ సెంటర్, సిరి పురం, కరాచీవాలా డిపార్ట్‌మెంటల్ స్టోర్స్, కార్యక్రమాలు అన్నీ పనికిరానివిలా అయి పోయాయి. ఈ సముద్రం, సముద్రంలో సూర్యోదయం, ఈ క్యాంపస్, ఈ వసతులు ఏవీ... ఏవీ రుచించడం లేదు. విజయ తప్ప తన ఆలోచనల్లో ఏమీ లేనితనం!. ఏమిటో పోగొట్టుకున్న దిగులు!

మాణిక్యం తన ధోరణిలో తాను మాట్లా డుతోంది-"సెప్టెంబరులో పరీక్షలంటే గుండెదడగా ఉంది ప్రసాద్! సిలబస్‌లు అవలేదు. అసలేమీ చదవలేదు. మధ్యలో ఎసైన్మెంట్స్ రాయాలి. అంతా కంగారుగా ఉంది. విజయకీ మధ్య ఒంట్లో బావుండ లేదు. టైఫాయిడ్ దానికి. అశుభ్రం అంటే అంతా నన్ను వెక్కిరిస్తారు గానీ వారం రోజుల్లో చాలా నీరసమయిపోయింది. వాళ్ళ నాన్నగారు కూడా వచ్చారు. ఇంటికి తీసుకుని వెళిపోతానంటే, ప్రాక్టికల్స్ అని ఇక్కడే ఉండిపోయింది- వాళ్ళ బాబాయి ఇంట్లో. దానికి పదిరోజులు క్లాసులు

పోయాయి. ఇపుడు క్లాసులకెళుతోంద నుకో!. హాస్టల్‌కి మాత్రం నిన్ననే వచ్చింది. సౌభాగ్య ఈ మధ్య ఎక్కు వగా....." అంటూ ఏవేవో చెప్తోంది.

ప్రసాదుకి మరేమీ వినిపించడం లేదు.

విజయకి బావులేదన్న విషయం తెలి సాక, మరి కాలు నిలవలేదు. అతికష్టం మీద క్లాసులో కూర్చున్నాడు. ముందు బోటనీ డిపార్ట్‌మెంట్‌కి వెళదామనుకు న్నాడు. సాయంత్రం హాస్టల్‌కి వెళ్ళడమే మంచిదని నిర్ణయించుకున్నాడు.

సుధాకర్‌ని అడిగాడు, "లేడీస్ హాస్టల్‌కి విజిటర్స్ ఏ టైమ్ నుంచి వెళ్ళొచ్చు"

సుధాకర్ నవ్వుతూ, "హరిప్రకాష్‌లాంటి వాళ్ళైతే ఏ టైమ్‌లోనైనా వెళ్ళొచ్చు. నీలాంటి వాళ్ళు మాత్రం నాలుగు గంటల నుండి ఏడుగంటల లోపు మాత్రమే వెళ్ళొచ్చు" అని కాసేపు ఆగి, "విజయ కోసమా" అన్నాడు.

అవునని తలూపాడు ప్రసాదు.

సాయంత్రం వెలుగు సముద్రం మీద అలలు అలలుగా తేలుతోంది. ఒకటి, రెండు సార్లు ఎలక్షన్ల సమయంలో మిన హాయిస్తే లేడీస్ హాస్టల్‌కి ప్రసాదెప్పుడూ వెళ్ళలేదు. విజయతో మాటలన్నీ క్యాంపస్ లోనే.

బితుకు బితుకుమంటూ లేడీస్‌హాస్టల్‌కి వెళ్ళాడు. గేటు దాటాడు. 'ఎలాగురా' అనుకుంటూ నిలబడ్డ ప్రసాదుని అటెం డరు వచ్చి, "ఎవరికోసం సార్" అని అడి గాడు.

"బోటనీ డిపార్ట్‌మెంట్, విజయ" అని ఆగి "న్యూ బ్లాక్‌లో ఉంటారు" అన్నాడు ప్రసాదు.

"ఎవరని చెప్పాలి."

"ప్రసాద్ అని చెప్పు"

"కూర్చోండి" అని వెయిటింగ్ రూము చూపించి ముందుకు వెళ్ళాడు అటెండర్.

సాయంత్రం ఆరు దాటుతోంది. అప్ప టికే వెయిటింగ్ రూమ్‌లో కొద్దిమంది ఆడ, మగ కూర్చుని ఉన్నారు. పైన ఫ్యాన్ తిరుగుతోంది. కింద ఉక్కపోతగా ఉంది ప్రసాదుకి. గుండె దడగానూ ఉంది. ఒక్కొక్క సెకను గడుస్తోంది. చాలా సేపు అయినట్లుగా ఉంది. రాదేమో... అనుకు న్నాడు. ఐదు నిముషాల్లో అటెండరు వచ్చాడు. వెళ్ళిపొమ్మని చెప్పిందేమో... అనుకుంటూ అటెండర్‌ని చూసాడు.

"వస్తున్నారు. కూర్చోమన్నారు" అని గేటు దగ్గరికి వెళ్ళిపోయాడు అటెండర్.

అటెండర్ వెళ్ళిన రెండుక్షణాలకి వచ్చిం ది విజయ నైటీలో. అప్రయత్నంగా లేచి నిలబడ్డాడు ప్రసాదు.

ప్రసాదు ముందున్న కుర్చీలో కూర్చుంది విజయ. ప్రసాదూ కూర్చున్నాడు. కాస్త పాలిపోయినతనం విజయ శరీరంలో.

ఇద్దరి మధ్యా కొన్నిక్షణాల మౌనోద్వేగం!

"ఒంట్లో ఎలా వుంది?" అన్నాడు గొంతు పెకల్చుకుని.

"ఇప్పటికనిపించిందా నన్ను చూడాలని" అంది. గొంతు పూడుకుపోయింది.

"లేదు విజయా!... మొహం చెల్లలేదు. నువ్వు నాతో మాట్లాడడానికైనా ఇష్టపడ తావో లేదోనని... ఆ రోజు... ఐ యామ్ సారీ విజయా! ఇన్నాళ్ళూ పిచ్చిపట్టినట్టుగా అనిపించింది. నావైపు కూడా చూడవని భయపడ్డాను. ఎలా నీ ముందుకు రావాలో తెలీలేదు" నెమ్మదిగా, విజయ కళ్ళవైపు చూస్తూ అన్నాడు ప్రసాదు. ఒక్కొక్క మాటా అనేస్తుంటే ఇన్నాళ్ళ గుండె బరువు దిగుతున్నట్టనిపించింది ప్రసాదుకి.

విజయ ఆ మాటలని అనుభవిస్తూ కూర్చుంది.

"టీ చెబుతాను. తాగుతూ ఉండు. ఐదు నిముషాల్లో వస్తాను" అని టీ, బిస్కెట్లు

అక్కడ పెట్టించి వెళ్ళింది.

ప్రసాదు మనసులో భారాలేమిలేవు. తేలిగ్గా వుంది.

అనారోగ్యం నుంచి కోలుకున్న విజయ, తేటనవ్వుతో 'వెళదామా' అంది.

గేటుదాటి బయటకొచ్చి బీచ్‌వైపు నడుస్తున్నారు.

తొలి యవ్వనపు జంట ఒద్దికగా వెళుతోంది అందంగా. సముద్రపు అలల్ని తాకుతూ కాస్త దూరంగా నడుచుకుంటూ వెళ్ళి అక్కడ ఇసుకలో కూర్చున్నారు. మసక కమ్ముకుంటోంది. దూరంగా ఓడల వెలుగులు జన సమ్మర్దం పెరుగుతూ ఉంది.

ఈ నెల రోజులూ ఎలా గడిచాయో చెప్పుకున్నారు.

వీళ్ళ ముందునుంచి మేరీ, మరో వ్యక్తి నడుచుకుంటూ వెళుతున్నారు.

"ఆవెళుతున్నది మీ హిస్టరీ మేరీ కదా!" అంది విజయ.

"అవును"

"ఇదిక్కడింత స్టైల్ మెయిన్‌టెయిన్ చేస్తుందా! వాళ్ళమ్మేమో కూలి చేసుకునేదంట" అంది విజయ.

ఒకరి ముఖాల్లో భావాలు మరొకరికి కనిపించనంతగా చీకటి కమ్ముకుంది.

"విజయా! చీకటి పడుతోంది. ఈ సముద్రపుగాలిలో ఎక్కువసేపు కూర్చోడం నీకు మంచిది కాదేమో! బయలుదేరుదామా? " అన్నాడు లేస్తూ.

విజయ లేవడానికి ఆసరా ఇవ్వడానికి ప్రసాదు చెయ్యి, ఆసరా తీసుకోడానికి విజయ చెయ్యి కదిలీ కదలకుండా కదిలాయి. కానీ మళ్ళీ వెనక్కి తగ్గాయి.

ఇద్దరూ దగ్గర దగ్గరగా నడుస్తున్నారు. ప్రసాదు నిదానంగా చెప్పడం ప్రారంభించాడు.

"విజయా! నా గురించి నా కులం తప్ప నీకు ఏమీ తెలియదు కదా! మేరీ వాళ్ళ అమ్మలాగ మా అమ్మ కూడా కూలిపని చేసుకునేదే. మా నాన్న చాలాకాలం పాలేరుతనం చేసాడు. పరీక్షలు రాసి ఇంటికెళ్ళాక మా అమ్మానాన్నలతో కలిసి నేను కోతలకి కట్టేతలకి వెళతాను" అని విజయ వైపు చూసాడు.

దీర్ఘంగా ఆలోచిస్తున్నట్లుగా విజయ ముఖం.

ఇద్దరూ మౌనంగా నడుచుకుంటూ హాస్టల్ గేటు వరకూ వచ్చారు.

"టైమెంతయింది ప్రసాద్? " అంది క్యాజువల్‌గా.

"నాకు వాచ్ లేదు" అన్నాడు నవ్వుతూ.

"సారీ" అని, "ఎలా వెళతావ్ హాస్టల్‌కి? "

"మహారాణీపేట సెంటర్‌కి వెళ్ళి బస్సెక్కేస్తాను. లేదంటే జగదాంబ సెంటర్‌కి"

"సెంటర్ వరకూ వస్తాను పద" అంది.

"ఒద్దులే, బాకీ తీర్చేద్దామనా? కొద్దిగా రుణం ఉండనీ! వస్తానూ" అని ముందుకు కదిలాడు.

కాసేపు అతన్ని వెనకనుంచి చూస్తూ నిలబడి, లోపలికి వెళ్ళిపోయింది విజయ.

★ ★ ★

వేసవి సెలవులు ఇచ్చారు. ఎసైన్‌మెంట్స్ రాసుకోవడానికి కొంత మెటీరియల్ కూడా సమకూర్చుకుని, ఆ మెటీరియల్‌తో సహా ప్రసాదు పాటిపూడికి వస్తున్నాడు. ఈసారి, పగలు కాకుండా రాత్రి పూట వస్తున్నాడు పాటిపూడికి.

పోయిన వేసవికి వస్తుందనుకున్న కరంటు, ఈ వేసవికి కానీ రాలేదు.

స్వతంత్రం వచ్చిన నలభై ఏళ్ళ తరువాత, నలభైసార్లు అధికారుల చుట్టూ తిరిగితే, పాటిపూడి మాలపల్లికి కరంటు వెలుగులు వచ్చాయి. కరంటు వచ్చిందని నెల క్రితం సాధు రాశాడు.

కరంటు వీధుల్లో నుండి నడిచి వెళదామని, విజయ వాళ్ళతో బయలుదేరకుండా ప్రసాదు ఉదయం సింహాద్రికి బయలుదేరాడు. ఊరిలోకి వెళ్ళే సమయానికి కరంట్ కట్ ఉండకూడదని మనస్ఫూర్తిగా కోరుకున్నాడు.

ఊరిలో బస్సు దిగాడు. పమిడేశ్వరరావు వీధి అరుగు దాటాడు. కరంటు స్తంభం దాటాడు. దూరంగా మిణుకు మిణుకుమనే ఆశ నింపుతూ పాటిపూడి మాలపల్లి డొంక మీద కరంటు బల్బు వెలుగుతోంది. పాటిపూడి ఊరికొచ్చిన కరంటు మాలపల్లికి రావడానికి పాతికేళ్ళు ఎందుకు ఆలస్యమయిందని అడిగితే, ఒకే పంచాయతీలో ఈ ఆలస్యమెందుకు జరిగిందని అడిగితే- ఏ అద్వితీయ నాయకురాలు, ఏ ప్రజా నాయకుడు, ఏ అమ్మ, ఏ అన్న, ఎవరు సమాధానం చెప్తారు? "

ప్రసాదు ఇంటికి వచ్చాడు. ఇంటి వసారాలో అరవై క్యాండిల్స్ బల్బు వెలుగుతోంది. అంతే వెలుగుతో అమ్మా నాన్న 'పెసాదూ' అంటూ బయటకొచ్చారు. కరంటు రావడం, ఊరంతా వెలుగు రావడం వాళ్ళమ్మ వెలుగు గొంతుతో చెబుతుంటే విన్నాడు.

"అయ్యా, ఎప్పుడు తినొచ్చావో లే! తానం చెయ్యి!" అంది మాలచ్చిమి.

ప్రసాదు తెచ్చిన బెల్లపు బూందీ చెక్క నోట్లో వేసుకుని, 'నేనటు బయటకెల్లి వత్తానయ్యా' అని పోతురాజు బయటకెళ్ళాడు. ఇవాళ పోతురాజుకి కొడుకుని చూస్తే చాలా గర్వంగా ఉంది.

"అమ్మా, సాధు ఉండాడా? " అని అడిగాడు.

"ఉండాడయ్యా. పొద్దుట కనపడ్డాడు నాకు. మరెక్కడన్న ఎల్లాడేమో" అంది మాలచ్చిమి.

భోజనం చేసి సాధు ఇంటికి వెళ్ళాడు ప్రసాదు. "అప్పా సాధుగాడేడి? " అన్నాడు.

"పెసాదు నువ్వంట్రా, రాయ్యా రా! ఆడు ఉప్పుడే చేలోకెళ్లాడు. వచ్చేత్తాడు" అంటూ మంచం వాల్చి దుప్పటి పరిచి, "కూచోయ్యా, నీ పేరు చెప్పుకుంటన్నారు కరంటు వచ్చిందని. ఎట్టాగుందిరా అక్కడా? సదువెప్పుడుదాకుంటయ్యా!" అంది సాధు వాళ్ళమ్మ.

"చదువయిపోద్ది. గంగానమ్మ సంబరం వచ్చేటప్పటికీ" అన్నాడు ప్రసాదు.

"ఎక్కడో ఎల్లి పెద్ద సదువు సదివేవు కదా! మరి గవురుమెంటు ఉజ్జోగమేత్తారయ్యా? "

"ఇవ్వాళంటే నేను మనూర్లో ఈ చదువు చదువుకున్న. నాలాంటి చదువు సంవత్సరానికి వేలమంది చదువుకుంటారప్పా! ఉద్యోగం ఎవుడుకో వత్తే వత్తది, లేపోతే లేదు"

"ఆపాటి దానికి ఎందుకురా ఇన్ని రోజులు సదుకోటం? ఏ పనో పాటో జేసుకోవచ్చుగా! ఇదంతా వొట్టిదేనన్నమాట! ఊరికే సదువులు సదువులని ఎందుకు ఎగబడతారు? "

"అప్పా! నేను రాగానే మంచం వాల్చి, దుప్పటి పరిచి కూచోయ్యా అన్నావు. నీ వల్లే కరంటొచ్చిందన్నావు. చదువుకోటం వల్లే గదా! సరే ఇయన్నీ కాదుగానీ, ఈ సంవత్సరమన్నా ఆడికి పెళ్ళి జేసేత్తవా? లేపోతే ఆణ్ణి అట్టాగే ఎండగట్టేత్తావా? " అన్నాడు.

"చిలకలపూడిలో అమ్మాయిని చూసొచ్చాం గదా! అంతా కాయమై పోయినట్టే! కలగల్లు తాగేసి, లగ్గాలెట్టుకోటమే!. నువ్వంటావుగా, నీ చేతులమీదగా జేసెయ్యి ఆడిపెళ్ళి" అంటుంటే, "ప్రెసాదో" అన్నాడు సాధు వస్తూనే.

★ ★ ★

రి-ఓపెనింగ్ రోజు ఉదయమే మాణిక్యం కారిడార్‌లో కనిపించేటప్పటికి ప్రసాదు ఆశ్చర్యపోతూ అడిగాడు- "ఇదే మిటి నువ్వు నాలుగు రోజులు ఆలస్యంగా వస్తావుకదా! ఈసారి రి-ఓపెనింగ్‌కే వచ్చే సావేం? " అని.

"ఏం లేదు ప్రసాద్! ఎసైన్‌మెంట్స్ ఇంతవరకూ మొదలు పెట్టలేదు. సెప్టెంబ రులో పరీక్షలంటున్నారు కదా! ఏమీ చదవలేదు. ఇంకెందుకని ముందుగానే వచ్చే సాను. ముందు ఎసైన్మెంట్స్ పూర్తి చెయ్యాలి నేను. నీవి ఎంత వరకూ వచ్చాయి? " అంది మాణిక్యం.

"స్కెలిటన్ తయారయింది. ఫెయిర్ చెయ్యాలి. సరే కానీ విజయ వచ్చిందా? " అని అడిగాడు చిన్నగా.

"నన్నడుగుతావేం? నీకే తెలియాలి" అంది నవ్వుతూ.

"నాకు తెలిస్తే నిన్నెందుకు తల్లీ అడ గడం? "

"నిన్ననే వచ్చేసింది" అంది తల ఎగ రేస్తూ. అక్కడికి సుధాకర్, కృష్ణమోహన్ వచ్చి చేరారు.

"ఏమిటీ, బందరు వాళ్ళు ఏదో మాట్లా డుకుంటున్నారు? " అన్నాడు సుధాకర్.

"గోదావరి వాళ్ళకి ఎందుకు చెప్పాలి? " అంది మాణిక్యం.

ఒక్కొక్కరుగా విద్యార్థులు కారిడార్‌లో చేరుతున్నారు. అందరూ ఎసైన్మెంట్లు, పరీక్షలు పోస్ట్‌పోన్‌మెంట్ అయ్యే అవకాశాలు గురించి మాట్లాడుకుని టైమ్ అవడంతో ఎవరి క్లాసులకి వాళ్ళు వెళ్ళిపోయారు.

ప్రసాదు, విజయ ఆ రోజు పన్నెండు గంటలకి లైబ్రరీ ముందు ఎదురు పడ్డారు. ఇద్దరూ లోపలికి వెళ్ళకుండా చెట్టు దగ్గర దిమ్మ మీదికి వచ్చి కూర్చున్నారు.

"ప్రసాద్! ఎప్పుడొచ్చావ్ నువ్వు? "

"నిన్న ఉదయం. పూరీ ఎక్స్‌ప్రెస్‌కి. మరి నువ్వు? "

"హాస్టల్‌కి రావడం నిన్న. కానీ మొన్న మెయిల్‌కి వచ్చాం నేనూ మా చిన్నాన్న కూతురూ కలిసి. మా చిన్నాన్న కూతురు వసుంధర, సెలవులకి నాతో పామర్రు వచ్చింది. అదిక్కడ బి.వి.కె.లో డిగ్రీ చదువుతోంది. ఏమిటో ప్రసాద్, డిపార్ట్‌మెంట్‌కి వచ్చానో లేదో పరీక్షలు అని భయ పెట్టేస్తున్నారు. అంతా కంగారుగా ఉంది" అంది విజయ.

"మాకూ అలాగే ఉంది... నేను పామ ర్రొచ్చాను. నువ్వు కనిపించవని తెలిసినా, చిన్న ఆశ."

"నేను కూడా బయటికి పనిమీద వచ్చి నప్పుడు కనిపిస్తావేమోనని వెతికాను. మా వసుంధర గమనించేసింది. ఒకటే ఆటప ట్టించటం!" అంది నవ్వులో సిగ్గుని దాచు కుంటూ.

ఆగి, మళ్ళీ "సాయంత్రం ఒకసారి మా హాస్టల్‌కి రావాలి" అంది విజయ.

"హాస్టల్‌కా!" అన్నాడు మొహమా టంగా.

"బీచ్‌కొస్తాను. సరేనా!" అన్నాడు.

"సరే ఆరు, ఆరున్నరకి"

ఇద్దరూ ఎవరి హాస్టల్‌కి వాళ్ళు వెళ్ళిపో యారు.

విపరీతమైన ఉక్కపోతగా ఉంది. ఓ ప్రక్క సూర్యుడు అస్తమిస్తున్నాడు. మరో ప్రక్క మేఘాలు కమ్ముకొస్తున్నాయి. ఎండల తాపానికి ఆర్.కె.బీచ్ నిండా జనం!

లేడీస్ హాస్టల్ నుండి సముద్రానికి దిగే చోట సిమెంట్ స్తంభాల తోరణమున్న పార్కులోకి వచ్చాడు ప్రసాదు. సిమెంట్ బెంచిమీద కూర్చుని, సముద్రాన్ని చూస్తూ, అప్పుడప్పుడు వెనక్కితిరిగి చూస్తూ కూర్చు న్నాడు ప్రసాదు.

పొద్దు కుంకింది. ఒకవైపు మబ్బులు

కమ్ముకుంటున్నాయి నిధానంగా.

"ఎంతసేపయింది వచ్చి?" అంది విజయ.

ప్రసాదు విజయవంక అపురూపంగా చూస్తున్నాడు.

"ఏమిటి చూస్తున్నావ్" అంది.

"చాలా కళగా ఉన్నావ్"

"థాంక్యూ"

"ఎందుకు?"

"అంటే?"

"అంటే, కొంటే ఏం లేదు గానీ, అటు బీచ్ వైపు నడుద్దాం" అంది కదులుతూ.

ఇద్దరూ నడుస్తున్నారు.

"ఎందుకు ఇలా నడిపించడం?" అన్నాడు.

"నడిస్తే నీ ఆరోగ్యానికి మంచిదని!" అంది.

"ఓహో!"

నడుస్తూ నడుస్తూ, వ్యానిటీ బ్యాగ్ లోంచి చిన్న గిఫ్ట్‌ప్యాక్ తీసి ప్రసాదు జేబులో వేసింది.

"ఏమిటిది" అని జేబులోంచి తియ్యబోయాడు.

"ఇక్కడొద్దు. రూమ్‌కెళ్ళాక ఓపెన్ చెయ్యి"

"ఇంతకీ ఏమిటది?" అన్నాడు ఆసక్తిగా.

"గిఫ్ట్. గిఫ్ట్ ఇచ్చినపుడు ఏమిటి, ఎందుకు, లాంటివి అడగకూడదు. తీసుకోవాలంతే!" అంది గాంభీర్యం నటిస్తూ.

"ఓహో! సరే!" అని గిఫ్ట్ ఇచ్చిన చేతిని మృదువుగా చేతిలోకి తీసుకున్నాడు.

★ ★ ★

నవంబరు రెండు నుంచి పరీక్షలు. మరొక్క నెలరోజులే ఉన్నాయి. అన్ని రూముల్లోంచి పొగలూ సెగలూ వస్తున్నాయి. పి.జి. విద్యార్థులు కబుర్లు మానేసి పుస్తకాలతో కుస్తీ పడుతున్నారు. ప్రసాదు, విజయ చదువులో మునిగిపోయారు. పుస్తకాలకి, రెన్యువల్‌కి ముందుగా అనుకుని లైబ్రరీ దగ్గర కలుస్తున్నారు.

ఇద్దరూ బుక్స్ తీసుకుని బయటకొస్తుండగా "రేపొకసారి లైబ్రరీకి ఈ టైమ్‌కి వస్తావు కదా!" అని అడిగింది విజయ.

"తప్పనిసరిగా వస్తాను. ఏమిటి?" అన్నాడు.

"మా వసుంధరకి మన విషయం తెలుసు కదా! నిన్నొకసారి చూస్తానని గొడవ. రేపు దానికి క్యాంపస్ చూపించి ఇక్కడికి తీసుకొస్తాను. వస్తావు కదూ!"

"క్యాంపస్ చూపించు. నన్నెందుకు పరిచయం చెయ్యడం... ఇక్కడ.." అన్నాడు మొహమాటంగా.

"అది నన్ను చంపుకు తినేస్తోంది. పోనీ, పరిచయం చెయ్యనులే! దూరం నుంచి చూపిస్తాను."

"సరే, నీ యిష్టం"

"ప్రసాదు, నేనిచ్చిన వాచ్ పెట్టుకోవేం ఎప్పుడూ?"

"అది నాకు చాలా విలువైన గిఫ్ట్. చేతికి పెట్టుకుంటే, పాడైపోతుందని చాలా అపురూపంగా చూసుకుంటున్నాను."

"వట్టి కబుర్లు! రేపు ఆ వాచ్ ఓసారి పెట్టుకోవా! చూడాలనుంది నీ చేతికి."

"చదువెలా సాగుతోంది?"

"ఆం బాగానే చదువుతున్నాను"

"మాణిక్యం మాత్రం ఫస్ట్‌ర్యాంక్ రావాలని కనీసం భోజనం దగ్గర కూడా ఎవరితోనూ మాట్లాడడం లేదు. మెస్‌కి కూడా పుస్తకం పట్టుకుని వచ్చేస్తుంది. మరి నీ చదువెలా వుంది?"

"చదువుతున్నాను. పి.జి. పరీక్షలే కదా! రాసేస్తాం! నెట్‌కి బాగా ప్రిపేరవాలని. నెట్ వస్తే, ఇక్కడే ఉండి, కాంపిటేటివ్ ఎగ్జామ్స్‌కి ప్రిపేరవొచ్చుకదా!"

"ఏం చదవనట్లు మాటలు చెబు

తారుగానీ ఎక్కువగా చదివేది మీ మగ వాళ్లే! అది సరే గానీ, పోయిన వారం వేసుకొచ్చిన బిస్కట్ కలర్ డ్రస్ వేసుకోవా! బావుంటావు ఆ డ్రస్‌లో!" అంది బిడియంగా.

"ఆ బట్టలు వేసుకుంటే తప్పించి మీ చెల్లికి నన్ను పరిచయం చెయ్యవా? "

"ఇందాక చూపిస్తానంటే మొహమాట పడిపోయావ్! ఇప్పుడు పరిచయం చెయ్యవా అంటున్నావ్."

"ఇదేమిటి నేనలా అనలేదే!"

"హాస్టల్ బస్ వచ్చే టైమయింది. మాణిక్యం డిపార్ట్‌మెంట్ దగ్గరుంటానంది. దాన్తో కలిసి ఆర్ట్స్ కాలేజి దగ్గర బస్సెక్కేస్తాను. నీకు లైబ్రరీలో పనుందా? "

"బోలెడు పనుంది ఆర్ట్స్ కాలేజి దగ్గర" అంటూ విజయతోపాటు కదిలాడు ప్రసాదు.

"ప్రసాద్, మరోలా ఏం అనుకోవొద్దు!. నువ్వు మా క్యాస్టే అని చెప్పాను. ఒకవేళ దాని దగ్గర కులం ప్రస్తావన వస్తే నువ్వు అలాగే చెప్పు" అంది అతని వైపు చూస్తూ.

ప్రసాదు అక్కడే ఆగిపోయాడు. అతని ముఖంలో పొంగుతున్న రక్తం. తన్ను తాను అదుపు చేసుకుంటూ, "నేనెందుకలా చెప్పాలి" అన్నాడు.

విజయ కంగారుపడింది.

"కులం తెలియడమెందుకని..." అంది మాట మింగుతూ.

"నా కులం ఎందుకు తెలియకుండా ఉంచడం? " అన్నాడు తీవ్రతని అదుపు చేసుకోలేక.

విజయ కూడా కరుగ్గానే చూసింది.

"ఇది తెలియాల్సినంత గొప్ప విషయమా? అది అడుగుతోంది కదా అని నిన్ను పరిచయం చేస్తానన్నాను. నా ఇబ్బందిని నువ్వు అర్థం చేసుకోవా? " అంది.

"నువ్వు ఇబ్బందిపడుతూ నన్ను మీ చెల్లికి పరిచయం చెయ్యడం అవసరమా? ఇంతకంటే నువ్వు నన్ను మీ చెల్లికి పరిచయం చెయ్యకుండా ఉండడం మంచిది. నా కులం మీవాళ్లకి తెలియడం నీకు ఎంబరాసింగ్‌గా ఉంటే, నాకు ఏ కారణం చేతనయినా కులం దాచుకోవడం, నేను మనషిననిపించుకున్నట్లుగా ఉండదు. ఐయామ్ సారీ! నేనురేపు రావడంలేదు" అన్నాడు విజయవైపు చూస్తూ.

చాలా కంగారుగాను, కటువుగాను చూచి "అంతేనా" అంది విజయ.

"అంతే" అన్నాడు ప్రసాదు.

ఇద్దరూ మౌనఘర్షణలో నలుగుతూ ఆర్ట్స్ కాలేజి వరకూ వెళ్లారు.

ఆర్ట్స్ కాలేజి గేటు దగ్గర నిలబడి మాణిక్యం కేకపెట్టింది- "విజయా!, త్వరగారా! బస్సొస్తోంది" అని.

విజయ గబగబా వెళ్లిపోయింది.

ప్రసాద్ హాస్టల్‌కొచ్చేసాడు.

★ ★ ★

పి.జి. పరీక్షలు అయిపోయాయి.

సెకండియర్ అయిపోయిన వాళ్లు నోడ్యూసుల కోసం తిరుగుతున్నారు. ఒక్కొక్క డిపార్ట్‌మెంట్ దగ్గరే నోడ్యూసుల పని అవుతోంది.

డిపార్ట్‌మెంట్ దగ్గర మాణిక్యం, ప్రసాదు కలిసారు. ఓ గంటాగి రమ్మన్నాడు క్లర్కు.

"ప్రసాద్, నోడ్యూసుల కోసం తిరిగి తిరిగి కాళ్లునొప్పులు పుడుతున్నాయి. చేరినప్పుడు కూడా ఇంత తిరుగుడు తిరగలేదు. ఓ గంటసేపు ఇక్కడే వెయిట్‌చేసి తీసికెళ్లిపోతాను. కాసేపు బయట గార్డెన్‌లో కూర్చుందామా! నీకు ఏమైనా పనుందా!" అంది మాణిక్యం.

"అంత అర్జంటు పనేమీలేదులే" అన్నాడు ప్రసాదు.

ఇద్దరూ గార్డెన్‌లోకి వచ్చి కూర్చున్నారు.

"డల్‌గా కనిపిస్తున్నావ్ ప్రసాద్!" అంది మాణిక్యం కూర్చున్నాక.

మాట్లాడకుండా మౌనంగా చూసాడు.

"ప్రసాదు, నేను చెబుతున్నాననుకో వొద్దు. నువ్వొకసారి విజయని కలవడం బావుంటుందనుకుంటున్నాను. అది చాలా బాధపడుతోంది ప్రసాద్!. మీరిద్దరూ నాకు అయిదేళ్లుగా తెలుసు. నీలా అదీ డల్‌గానే ఉంది. అందుకే చెబుతున్నాను" అంది ప్రసాదు సమాధానం కోసం అతన్ని పరిశీలనగా చూస్తూ.

ప్రసాదు ఒక్కసారి కళ్లు మూసుకుని, దీర్ఘంగా గాలి తీసుకుని, "విజయని కలవాలని నాకు చాలా ఉంది మాణిక్యం!. నాకు చాలా వెలితిగా ఉంది తెలుసా! నేను ఈ క్యాంపస్‌లో ఏమీ మిగుల్చుకోలేదనిపిస్తోంది. వెళ్లేలోపు మరో రెండురోజుల్లో విజయని చూడాలని నాకు చాలా అనిపిస్తోంది..." కాస్సేపు ఆగి మళ్లీ కొనసాగించాడు.

"కానీ నేను విజయని కలవాలనుకోవడం లేదు మాణిక్యం!" అన్నాడు స్థిరంగా.

"మాణిక్యం! మనం అయిదేళ్లుగా ఒకరికొకరం తెలుసు. మనం కాలేజిలో మామూలుగా మాట్లాడుకోవడం పెద్ద సమస్యేమీ కాదు. మన కుటుంబాల స్థితి, వాటికి చుట్టుకున్న కులం గుర్తుంటే చాలా కష్టం మాణిక్యం!"

"నిజమేననుకో ప్రసాద్! అసలు మీమధ్య సమస్యేమిటి? పోనీ నేను మాట్లాడుతాను"

"మా ఇద్దరి మధ్యా ఏదైనా సమస్య ఉందని నేను అనుకోడం లేదు మాణిక్యం! నా కులమే సమస్య"

"కులం అంటున్నావు కాబట్టి అడుగుతున్నాను. ఏదో అది అప్పటికి చెప్పమందట. దానికే నువ్వు సీరియస్ అయిపోవాలా? !"

## కొత్తగాలి...

**శ్రమ జీవన**
**సౌందర్యమేమిటో**
**చీమను చూశాకే**
**నాకు తెలిసింది**

– సి. కామేశ్వరరావు, కాశీబుగ్గ

"తాత్కాలికంగా నేను వేరే కులం చెప్పాలా? ఎందుకు చెప్పాలో నువ్వే చెప్పు మాణిక్యం? " అన్నాడు.

మాట సౌమ్యంగానే ఉన్నా దాని వెనక ఉన్న సూటిదనానికి మాణిక్యం తడబడింది.

"అంటే... ఇప్పుడు... ప్రసాదూ!..."

"తక్కువతనాన్ని సర్దిచెప్పడానికి మాటలు తడుముకుంటున్నావ్ మాణిక్యం! నాతో లేని ఇబ్బంది విజయకి నా కులంతో ఉంది. రేపు జీవితమంతా ఈ కులంతోనే సాగాలి మాణిక్యం! నా కులం మీద ఉండే తక్కువతనమంతా నా మీద ఉంటుంది. నాది తక్కువకులంగా గుర్తించేచోట ప్రేమ నిలుస్తుందా? !... ఆ ప్రేమని నేను నిలుపుకోవాలా? ! నా కులంలో నచ్చనివన్నీ నాలోనూ ఉంటాయి. మా అమ్మా నాన్నా కూలిపనే చేస్తారు. అంతకుమించి మరో బ్రతుకు తెరువు కూడా లేదు. క్యాంపస్‌లో పనిచేసే అటెండర్లు, స్వీపర్లు, మా అమ్మా నాన్నకంటే నాగరికంగా కనిపిస్తారు. ఇక్కడి నుండి వెళ్లాక నేను, అమ్మా నాన్నతో కలిసి కూలి పనులకి వెళతాను. ఇదీ నా కులం స్థితి. దీన్ని నేను దాచుకోవాలనుకోవడం లేదు. అధిగమించాలనుకుంటున్నాను. నేను కులాన్ని కాదు మాణిక్యం, మనిషిని!" ©




# ప్రాయశ్చిత్తం!

**సాయంకాలం ఏడుదాటింది. ట్యాంక్‌బండ్‌పై విద్యుద్దీపాలు మందంగా కాంతులు ప్రసరిస్తున్నాయి. షికారుకు వచ్చినవారితో, తినుబండారాలు అమ్ముకునేవారితో, రయ్యిరయ్యిమంటూ పరుగులు తీస్తున్న వాహనాలతో ఆ ప్రదేశమంతా సందడిగా ఉంది. అంత హడావిడిలోనూ అతను మాత్రం మౌనశిలలా, సుదీర్ఘతపస్సు చేస్తున్నవాడిలా ఉన్నాడు. ఎంతసేపటి నుంచో ఫుట్‌పాత్ మీది చెక్కబెంచీ మీద కూర్చుని సాగరం మధ్యనున్న తథాగతుని వంక తదేకంగా చూస్తున్నాడు.**

ఎంత వద్దనుకుంటున్నా మధ్యాహ్నం జరిగిన సంఘటనే అతని కళ్ల ముందు కదలాడుతోంది.. కలత పెడుతోంది.

తను ఎప్పటిలా బాస్ కేబిన్ శుభ్రం చేస్తున్నాడు. టేబిల్ తుడుస్తుండగా సొరుగు సగం తెరిచి ఉండడం కన్పించింది. నిన్న సాయంత్రం బాస్ తాళం వేయడం మరిచినట్లున్నాడు. తను అలా ఊరుకున్నా పోయేది.. అందులో ఏముందో చూడాలన్న కుతూహలం! పూర్తిగా లాగాడు.. ఆ క్షణంలోనే బాస్ కేబిన్‌లోకి ఎంటరవడం.. తను చేస్తున్న పనిని గమనించడం ఒకేసారి జరిగిపోయాయి.

అంతే! ఆయన ప్రళయరుద్రుడే అయిపోయాడు. దొంగ అన్నాడు.. ఎన్నాళ్ల నుంచీ చేస్తున్నావీపని? అన్నాడు.. ఆఫీసులో పోయిన వాటన్నింటికీ నువ్వే బాధ్యుడివి అన్నాడు. సొరుగు తాళంతీసే ఉంది మహప్రభో అన్నా విన్పించుకోలేదు. సగం తెరిచి ఉంటే మూయాలిగానీ సాంతం ఎందుకు తెరిచావ్ అని లాపాయింటు లాగాడు. అంతటితో ఊరుకుంటేనా? చొక్కా కాలర్ పట్టుకుని హాల్‌లోకి లాక్కొచ్చాడు. స్టాఫ్ అందరిముందు తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టేడు. పోలీసులకు పట్టిస్తానని బెదిరించాడు.. స్టాఫ్‌లో అమ్మాయిలు ముసిముసిగా నవ్వుకోవడం ఓరకంట గమనించిన తనకు మనసు చివుక్కుమంది.

ఎంతవమానం? తలగొట్టేసినట్లయింది. వాళ్లమధ్య మళ్లా రేపట్నుంచి పన్లెలా చేయగలడు? ఇంటికి పోబుద్ధి కావడంలేదు. అసలు బతకాలనే అన్పించడంలేదు. ఇంత జరిగాక ఇంకెందుకీ బతుకు!

తనెంత పరువుగల మనిషో... స్వాభి




మానో రేపు తనశవాన్ని చూశాక బాస్‌కు తెలుస్తుంది. ఓ నిండు ప్రాణాన్ని బలితీసుకున్నందుకు ఏడ్చి మొత్తుకుంటాడు. ఆఫీసులో అంతమంది ఉన్నారు కదా? ఎవడో ఒకడు పోలీసులకు ఉప్పందించక పోడు. తర్వాత అరెస్టు.. కోర్టు.. శిక్ష! అప్పటిగ్గానీ తెలిసిరాదు.. అధికారముందని ఎదటివాడిని ఎంతమాట పడితే అంతమాట అనకూడదని!

రామం ఆలోచనలు పరిపరి విధాలు పోతున్నాయి.

ఆలోచిస్తున్న అతను 'ఢడేల్' మన్న పెద్దశబ్దంతో ఉలిక్కిపడి తలతిప్పి రోడ్డువంక చూశాడు. యాక్సిడెంట్ కాబోలు! జనం మూగుతున్నారు. ఒక్క ఉదుటన లేచి తనూ అటు పరుగుతీశాడు. కారు లారీ ఎదురెదురుగా వచ్చి గుద్దుకున్నాయి. కారు ముందుభాగమంతా నజ్జునజ్జయింది. డ్రైవింగ్ సీట్లోని వ్యక్తి రక్తం మడుగులో స్టీరింగ్‌పై తలవాల్చేసి కన్పిం

చాడు.

తనెంత తప్పించాలని చూసినా వీలుకా లేదనీ అతివేగంగా వచ్చి కారే తన బండిని గుద్దిందనీ వాదిస్తున్నాడు లారీ డ్రైవర్.

కొందరు కారు డోర్ పగలగొట్టి అతన్ని వెలికితీశారు. దీపం వెలుగులో అతని ముఖం చూసి కొయ్యబారిపోయాడు రామం.

అతనెవరో కాదు... తమ బాస్!

స్పృహలో లేని అతని గురించి పోలీసులకు వివరాలు అందించాడు. తనూ అంబులెన్స్‌లో ఆస్పత్రికి వెళ్లి అక్కడ ఏర్పాట్లన్నీ చూశాడు. బాస్ ఇంటికి, బంధుమిత్రులకు, సిబ్బందికి ఫోన్‌చేసి సమాచారం అందించాడు. కంటిమీద రెప్ప వేయకుండా ఆ రాత్రంతా ఆస్పత్రిలో ఉండి సేవలందించాడు.

★ ★ ★

వారం రోజులు గడిచింది.

ఆఫీసు కాన్ఫరెన్స్‌హాల్!

వేదికపై ఉన్నతాసనంలో పూలమాలలతో రామం! తలకు, చేతికి బ్యాండేజితో మైక్‌ముందు నిలబడి మాట్లాడుతున్నాడు బాస్.

'ఆ రోజు ఉదయం నుంచీ నాకన్నీ అపశకునాలే! శివార్లలో ద్రాక్షతోట కోసం కొన్న నాలుగెకరాల్లో రెండెకరాలు రింగ్‌రోడ్ ఎలైన్‌మెంట్‌లో పోతోందన్న ఫోన్‌తోనే నిద్రలేచా. మారిషస్ నుంచి ప్రేమతో తెచ్చిన వజ్రపుటుంగరం కన్పించడంలేదని నా భార్య ఫిర్యాదు. గుంటూరు గోడవున్‌లో దాచిన 200 క్వింటాళ్ల మిర్చి బూడిదైందని, దానికి ఇన్సూరెన్స్ లేదని గుంటూరు మేనేజర్ చావుకబురు చెప్పాడు. విపరీతమైన ఒత్తిడి, మనోవేదనతో ఆఫీసులో కాలుపెట్టిన నాకు రామం సొరుగు తీస్తుండడం చూసి పిచ్చికోపం వచ్చేసింది. అమానుషంగా బిహేవ్ చేశాను. అందరి ముందు అవమానించాను. తెలుసు.. అనవసరంగా అతన్ని తిట్టిపోస్తున్నానని! కానీ ఏంచేయను? సర్కమ్‌స్టెన్సెస్ మేడ్ మి టు లాస్ట్ మై కంట్రోల్! ఆ సాయంత్రానికి కాలిపోయిన మిర్చికి ఇన్సూరెన్స్ ఉందని తెలిసింది. ఉంగరం కూడా దొరికిందని ఆవిడ ఫోన్ చేసి చెప్పింది. రింగ్‌రోడ్ ఎలైన్‌మెంట్ అదే పక్కాకాదని, మళ్లీ మారొచ్చనీ, ఆందోళన వద్దనీ, తెలిసిన రాజకీయ నాయకులు చెప్పారు. ఇవన్నీ ఓ కొలిక్కొచ్చాక అనవసరంగా ఓ అమాయకుడ్ని అవమానించాననే పశ్చాత్తాపం దహించడం మొదలెట్టింది. అందరం మనుషులమే. దేవుడి దృష్టిలో మనం అందరం సమానమే. అతన్నలా అవమానించడానికి నాకెవరిచ్చారు అధికారం? ఇదే ఆలోచన! ఇదే ఆవేదన!! మానసికంగా కుంగిపోయాను. ఆ పరిస్థితిలో అన్యమనస్కంగా డ్రైవ్‌చేస్తుంటే యాక్సిడెంట్!! తర్వాత జరిగిందంతా మీకు తెలిసిందే!

ఎనీహౌ రామం అయామ్ వెరీసారీ! నీకు చేసిన అవమానానికి ప్రక్షాళనగా అదే స్టాఫ్ ముందు ఇవ్వాళ నీకీ ఘనసన్మానం!! ఇది నువ్వుచేసిన మేలుకు రుణం తీర్చుకోవడం ఎంతమాత్రం కాదు. ఎందుకంటే ఆరోజు నువ్వు లేకుంటే ఇవ్వాళ నేను లేను. నేను చేస్తున్నది కేవలం చేసిన తప్పుకు ప్రాయశ్చిత్తం చేసుకోవడమే! అంతేకాదు.. రేపటినుంచీ నువ్వు ఆఫీస్‌బాయ్‌వి కావు. నాకు అంగరక్షకుడివి సరేనా?' అంటూ ముగించాడాయన. తర్వాత రామాన్ని దగ్గరకు తీసుకుని గుండెలకు హత్తుకున్నాడు. అప్పటికే ఆ ఇద్దరి కళ్లలో సన్నటి కన్నీటిపొర!

ఆ దృశ్యాన్ని చూసి సిబ్బందికీ కళ్లు చెమరించాయి. లేచి నిలబడి చప్పట్లు కొట్టారు.

–చంద్రప్రతాప్

# రష్దీకి మూడోసారి
# బుకర్ బహుమతి

**1975లో** 'గ్రైమస్'తోనే సల్మాన్ రష్దీ రచనలు ప్రారంభించినప్పటికీ, 1981 నాటి రెండో నవల 'మిడ్‌నైట్స్ చిల్డ్రన్'తో అతనికి అగ్రశ్రేణి ప్రపంచ రచయితగా గుర్తింపు వచ్చింది. ఇంగ్లిష్ భాషలో అత్యున్నత సాహిత్య పురస్కారంగా 1969లో ప్రారంభమైన బుకర్ ప్రైజ్ ఇప్పటికి మూడుసార్లు ఈ నవలను వరించింది. 1981లో తొలిసారిగా, ఆ ప్రైజ్ రజతోత్సవ సందర్భంగా 1993లో బుకర్ ఆఫ్ బుకర్‌గా రెండోసారిగా, ఆ ప్రైజ్‌ను స్థాపించి నలభై సంవత్సరాలు పూర్తి చేసుకున్నందుకు బెస్ట్ ఆఫ్ బుకర్‌గా ఈ సంవత్సరం మరోసారి ఎంపికైంది ఈ నవల.

ప్రచురితమైన వెంటనే దీన్ని ఒక 'ఆల్‌టైమ్ గ్రేట్ క్లాసిక్'గా గుర్తించారు విమర్శకులు. ప్రముఖ అమెరికన్ వారపత్రిక టైమ్ మేగ్‌జైన్ ఎంపికచేసిన 'ఇంగ్లిష్ భాషలోని వంద గొప్ప నవలల్లో' స్థానం దక్కించుకున్న ఒకే ఒక్క భారతీయ నవల మిడ్‌నైట్స్ చిల్డ్రన్.

'మాజిక్ రియలిజం' రచనా ధోరణికి గాబ్రియెల్ గార్షియా మార్క్వెజ్ రాసిన 'వన్ హండ్రెడ్ ఇయర్స్ ఆఫ్ సాలిట్యూడ్'తో బహుళ ప్రచారం లభించినప్పటికీ, ఆ ఒరవడిని అంత బాగా కొనసాగించిన నవల మిడ్‌నైట్స్ చిల్డ్రన్. సహజంగానే రెంటిలోనూ సారూప్యాలు చూశారు సాహిత్యకారులు. జేమ్స్‌జాయిస్, గంటర్ గ్రాస్ (జర్మన్ రచయిత), హోర్హే లూయిస్ బోర్హేస్ (అర్జెంటీనా రచయిత), మిహైల్ బుల్గాకోవ్ (రష్యన్), లూయిస్ కరోల్‌ల రచనలతో ప్రభావితుడైన సల్మాన్ రష్దీ అతి నవీన శైలీ ప్రయోగాలు అందర్నీ ఆశ్చర్యచకితుల్ని చేశాయి.

భారతీయ సంస్కృతి, సంస్కృత కావ్యాలు, రామాయణ భారతాలు, అరేబియన్ నైట్స్ ఆధారంగా తన కథన శిల్పాన్ని తయారు చేసుకున్న రష్దీ, ఈ నవలలో వాడిన ఇండియన్ ఇంగ్లిష్ పదాలు (ఈ సంకర భాషే 'హింగ్లిష్') అధికారిక ఇంగ్లిష్ పదకోశంలో కూడా చేరిపోయాయి.

'మిడ్‌నైట్స్ చిల్డ్రన్' పేరే ఆధునిక భారతదేశానికి ప్రతీకాత్మకంగా(అలెగరీగా) ఉపయోగించాడు రచయిత. కథానాయకుడు




సలీం సైనాయ్ 1947లో అర్ధరాత్రి ఆగస్టు 15న జన్మిస్తాడు. అతనికి టెలిపతీ శక్తి ఉంటుందిగాని ఎప్పుడూ ముక్కు కారుతుంటుంది. సోదరి జమీలా గాయని. ఆమె తరువాతి కాలంలో పాకిస్తాన్‌లో ప్రముఖ గాయనిగా ఎదుగుతుంది. అదాం అజీజ్ అని ఒక డాక్టరుంటాడు. తన సందేహాలన్నీ దేవునికి చెప్పుకుని సమాధా

నాలకోసం నిరీక్షిస్తాడు. తాయ్ ఓ పడవ సరంగు. పద్మామంగ్రోలి- సలీం ప్రేమికు రాలు. ఇలా అనేకానేక పాత్రలతో, అద్భుతమైన కథాకథనంతో పాఠకులను విస్మ



**సల్మాన్ రష్దీ**

యపరుస్తుంది మిడ్‌నైట్స్ చిల్డ్రన్. "ఒకప్పుడు రాధాకృష్ణులున్నారు. రాముడూ సీత, లైలామజ్ను, రోమియో జూలియట్, స్పెన్సర్ ట్రేసీ కాథరైన్ హెప్‌బర్న్‌లాంటి ఆదర్శ ప్రేమికులెందరో" అంటూ సలీం తన గురించి ప్రేయసి పద్మకు చెప్పుకోవటంతో ప్రారంభమవుతుంది కథ.

ప్రచురణ అయిన సంవత్సరంనుండే ప్రపంచంలోని అనేక విశ్వవిద్యాలయాలలో పాఠ్యగ్రంథంగా మారిన ఈ నవలను జాయిస్ రాసిన యూలిసిస్, గ్రాస్ రాసిన 'టిన్ డ్రమ్'లతో కూడా పోల్చారు.

మనదేశంలో కూడా దీనికి అనేకమంది అభిమానులున్నప్పటికీ అప్పుడు (1981లో) అధికారంలో ఉన్న ఇందిరాగాంధీనీ, ఎమర్జెన్సీనీ తప్పుపట్టడం వల్ల ఈ నవల కొంత వివాదాస్పదంగా కూడా మారింది.

## రష్దీ జీవితం- ఇతర రచనలు

ఇండియన్- బ్రిటిష్ నవలా రచయిత సల్మాన్‌రష్దీ 1947లో జూన్ 19న బొంబాయిలో జన్మించాడు. తండ్రి అనీస్ అహ్మద్ రష్దీ, ఒక లాయర్. తల్లి నెగిన్ బట్, టీచర్. బొంబాయిలోని కాథెడ్రల్ జాన్ కానన్ స్కూళ్లల్లోను, తరువాత రగ్బీ స్కూల్ కింగ్స్ కాలేజ్, కేంబ్రిడ్జ్‌లలోను విద్యాభ్యాసం కొనసాగింది. కొన్నాళ్లు అడ్వర్టయిజింగ్ ఏజెన్సీలలో కూడా పనిచేశారు.

రష్దీ ఇప్పటికీ నాలుగుసార్లు వివాహం చేసుకున్నాడు. చివరి భార్య పద్మలక్ష్మితో 2007 జులై 2న వివాహం రద్దయింది. అదే సంవత్సరం, బ్రిటీష్ అత్యున్నత పురస్కారం నైట్‌హుడ్ కూడా లభించింది. ఇదిగాక ప్రపంచవ్యాప్తంగా రష్దీని వరించిన అవార్డుల, ప్రైజుల, సత్కారాల పట్టిక చాలా పెద్దది.

## రష్దీ ఇతర రచనలు

షేమ్ (1983), జాగ్వర్ స్మైల్ (1987), సటానిక్ వర్సస్ (1988) - అత్యంత వివాదాస్పదమైన నవల. ఆయాతుల్లా ఖొమైనీ ఇచ్చిన ఫత్వాతో అనేక సంవత్సరాలు రహస్య జీవితం గడిపాడు రష్దీ. హారూన్ అండ్ ది సీ ఆఫ్ స్టోరీస్ (1990), ఇమాజినరీ హోంలాండ్స్ (1992), హోంలెస్ బై ఛాయిస్ (1992), ఈస్ట్ వెస్ట్ (1994), ది మూర్స్ లాస్ట్ సై (1996), గ్రౌండ్ బినీత్ హర్‌ఫీట్ (1999), ప్యూరీ (2001), స్టెప్ అక్రాస్ దిస్ లైన్ (2002), షాలిమార్ అండ్ ది క్లౌన్ (2005), ఇటీవలే విడుదలయిన నవల 'ఎన్‌చాంట్రెస్ ఆఫ్ ఫ్లొరెన్స్'

అటు విమర్శకుల ప్రశంసలు పొందుతూ ఇటు పబ్లిషర్లకు కాసులు కురిపిస్తున్నాడు రష్దీ.

మిడ్‌నైట్స్ చిల్డ్రన్‌ను రాయల్ షేక్స్పియరియన్ కంపెనీ, నాటకంగా కూడా ప్రదర్శించింది.

–స్వప్న



# చతుర ప్రవేశిక



## ఆగస్టు - 08

ఆగస్టు 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయగలరేమో ప్రయత్నించండి. అన్నీ సరిగా రాసినవారికి ఆకర్షణీయమైన బహుమతులు లభిస్తాయి.. (ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. విజేతల ఎంపికలో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. సంపాదకులదే తుదినిర్ణయం).

1. ఏకోపాధ్యాయ పాఠశాల మాస్టారు?
2. హరిజనపిల్లలంటే ఏ మాస్టారికి పడదు?
3. ప్రసాద్ తండ్రిపేరు?
4. చిన్న చిట్టిని కొట్టిందెవరు?
5. బందరులో ప్రసాద్ చేరిన కాలేజి?
6. ప్రసాద్‌కి స్ఫూర్తిఇచ్చిన జీవిత చరిత్ర ఎవరిది?
7. స్కాలర్స్ హాస్టల్‌లో ప్రసాద్ రూంనంబర్?
8. డేనీనుంచి రామస్వామి లాక్కున్న ఆయుధం?
9. ఏ ప్రాంతం ఊచకోతతో హాస్టల్ హోరెత్తింది?
10. ప్రొసెషన్ ఏ అధికారిని కలిసింది?
11. శ్రావ్య వెళ్లాలనుకున్న ట్రైనింగ్?
12. విక్టర్ పెళ్లాడింది ఎవరిని?
13. శతపథబ్రాహ్మణంలో మాంసమంటే...?
14. తూకం ఏ మిషన్‌మీద కరెక్ట్‌గా ఉంటుంది?
15. రామం ఆఫీసులో చేస్తున్న ఉద్యోగం?

---

పంపినవారి పేరు: ---------------------------------------- వయసు (    )

చిరునామా: ----------------------------------------

----------------------------------------

----------------------------------------

పిన్‌కోడ్:                ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

ప్రవేశికలకు చివరి తేదీ 16

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.



ప్రతిరోజూ పుట్టలుపుట్టలుగా
రైతులు చస్తున్నా...
'అబ్బెబ్బే, అదేం లేదం'టూ
కొట్టిపారేసే సర్కారు దివాళా
కోరు రాజకీయాన్ని తీవ్ర
స్థాయిలో ఎండగడుతూనే...
ఆరుగాలాలు ఒళ్లువంచి
పొలాలు దున్నినా కడుపు
నిండా అన్నం తినేందుకు
నోచుకోని నిర్భాగ్య రైతన్నల
వ్యథామయజీవనాన్ని
హృదయం ద్రవించేలా
అక్షరీకరించిన
ఎలికట్టె శంకరరావు
నవల

# దేవుని రాజ్యం

త్వరలో...

---

## జూలై ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. కూతురు రాంరెడ్డి - 113 సుందరం అపార్ట్‌మెంట్స్, హైదరాబాద్
2. బొంతా రమ్య - బ్రాహ్మణవీధి, అరసవిల్లి, శ్రీకాకుళం
3. ముమ్మిళ్ల వందన - కిషన్‌పుర, హన్మకొండ, వరంగల్
4. కె.శ్రీధర్‌రెడ్డి - ఎల్కతుర్తి, కరీంనగర్ జిల్లా
5. డా॥ సి.జనార్ధన్‌సింగ్ - రామకోఠి, హైదరాబాద్



అసంఖ్యాకంగా స్పందనలు రావడంతో అందరి పేర్లు ప్రచురించలేకపోతున్నాం.

# కాలాతీతం



# ఫ్రాంకెన్‌స్టీన్

(1818)

ఉత్తర ధృవాన్ని అన్వేషించటానికి బయల్దేరిన రాబర్ట్ వాల్టన్ తన సోదరికి రాసిన లేఖల ద్వారా ఫ్రాంకెన్‌స్టీన్ కథ మనకు తెలుస్తుంది. మొదట ఆ మంచు టెడారిలో తన జీవన్మరణ పోరాటాన్ని వర్ణిస్తాడు. ముందుకు కదిలిన ప్రతిక్షణమూ ఉత్కంఠభరితమే. ఎప్పుడు ఆపద ముంచుకొస్తుందో తెలియదు. నిర్మానుష్యమైన ఆ దుర్గమదేశంలో సాహసయాత్ర చేయటమంటే ప్రాణాలతో చెలగాటమే. మంచుకొండలు అడ్డుపడటంతో షిప్పు ముందుక్కదలదు.

అక్కడ వాల్టన్‌కు విక్టర్ ఫ్రాంకెన్‌స్టీన్ తారసపడతాడు. అతడు కుక్కలు లాగే స్లెడ్జిబండి మీద అక్కడి దాకా వచ్చాడు. జవసత్వాలుడిగి మొహంలో ప్రేతకళ తాండవిస్తున్నది. వాల్టన్ అతణ్ణి తన షిప్పు మీదికి ఆహ్వానిస్తాడు. అప్పటికే చలితో, అనారోగ్యంతో, తిండీ తిప్పలూ లేక కదలలేని స్థితిలో వున్నాడు ఫ్రాంకెన్‌స్టీన్. మంచి భోజనం పెట్టి వెచ్చని దుస్తులు తొడిగి, మందులిచ్చి ఆరోగ్యవంతుణ్ణి చేసి చేరదీస్తాడు వాల్టన్. అలా కోలుకుంటున్న క్రమంలో, విక్టర్ తన గురించి చెబుతాడు.

జెనీవా రిపబ్లిక్ అతని మాతృదేశం. గౌరవప్రతిష్ఠలు మెండుగా వున్న వంశం. పూర్వీకులు కౌన్సిలర్లుగా పేరు గడించారు. తండ్రి వున్నతోద్యోగి. అతడి మొదటి సంతానమే విక్టర్. నేపుల్స్‌లో పుట్టాడు.

పెంపుడు చెల్లెలు ఎలిజబెత్ లావెంజా సాహచర్యంతో సరదాగా గడుస్తుంది బాల్యం. ఆనాటి మరో మిత్రుడు హెన్రీ క్లెర్వాల్.

స్కూలు చదువు ముగించుకుని, యూనివర్సిటీ ఆఫ్ ఇంగాల్‌స్టాట్‌లో నాచురల్ ఫిలాసఫీ, కెమిస్ట్రీ అధ్యయనం చేస్తాడు. కార్నెలియస్ అగ్రిప్పా రచనలు అతనిలో ఈ భూమ్మీద 'జీవి' ఎలా ఆవిర్భవించిందో తెలుసుకోవాలనే జిజ్ఞాసను పెంచుతాయి. ఆల్బర్టస్ మాగ్నస్, పారా సెల్సిస్‌ల పుస్తకాలు కూడా చదవటంతో కోరిక మరింత బలపడుతుంది.



యూనివర్సిటీలో ఈ పరిశోధనలకే తన జీవితం అంకితం చేస్తాడు. లేబరేటరీ నెలకొల్పి ప్రయోగాలు చేస్తాడు. మొదట శరీరభాగాలు రూపొందించి, తరువాత ఆ ఆకృతికి ప్రాణంపోస్తాడు. ఈ కొత్త జీవిని చూసి, తనే భయంతో వణికి పోతాడు. ఆ వికృతాకారుడి ప్రవర్తనను, మనస్తత్వాన్ని తాను శాసించగలడా?

ఇప్పుడా రాక్షసుణ్ణి నియంత్రించటం ఎలా? తన శాస్త్రపరిజ్ఞానం మానవాళికి మేలు చేస్తుందా? లేక వినాశానికి దారి తీస్తుందా? పశ్చాత్తాపంతో, ఆత్మగ్లానితో



మేరీ షెల్లీ

వీధుల్లో పరిగెడతాడు. ఒకచోట బాల్యమిత్రుడు హెన్రీ కనిపిస్తాడు. తన బాధను, సందేహాలను మరెవరితో పంచుకోగలడు? హడావిడిగా అతణ్ణి అపార్టుమెంటుకు తీసుకొస్తాడు. కాని ఆ కొత్తజీవి అక్కడ వుండదు. భయం రెట్టింపవుతుంది. ఏ ప్రమాదం పొంచి వుందో? తన సృష్టి ఏ ఉపద్రవానికి నాంది పలకనుందో! విక్టర్ మనోవ్యాధితో మంచం పడతాడు.

ఆరోగ్యం కాస్త కుదుటపడిన తర్వాత ఇంగెల్‌స్టాట్ యూనివర్సిటీ అపార్టుమెంటు నుండి జెనీవాకు తిరిగి రావాలనుకుంటాడు. కాని అంతలోనే తండ్రి నుం ఉత్తరం వస్తుంది- తమ్ముడు విలియం ఎవరో హత్య చేశారు. ఉన్నఫళం యింటికి వెళతాడు. తమ్ముణ్ణి గొంతు లిమి చంపింది ఆ రాక్షసుడే అని తె స్తుంది. అడవిలో వాడి అడుగుజాడ కూడా కనిపిస్తాయి. అయినా ఫ్రాంకె స్టీన్ కుటుంబం, జస్టిన్ మార్టిన్ అనే ప పిల్ల మీద నిందవేస్తారు. తాను నేర చెయ్యలేదని మొత్తుకున్నా నమ్మరు హత్యానేరానికి శిక్ష మరణమే. అలా ఆ ప్రాణాలు గాలిలో కలుస్తాయి.

తన సృష్టి యిప్పటికి యిద్దరిని బలితీస కుందని ఖిన్నుడవుతాడు విక్టర్. మ శ్శాంతి కరువవుతుంది. తన మీద తన అసహ్యం వేస్తుంది. ఈ సమాజాని దూరంగా, పర్వతాలలో గడపాలనుకు టాడు. ఒకనాడు ఒక శిఖరంవద్ద హిమ నదం దాటుతున్నప్పుడు రాక్షసుడు ఎదుర పడతాడు. హత్యలు చేసింది తానేన అంగీకరించి, తప్పిదానికి క్షమించమ వేడుకుంటాడు. సృష్టికర్తమీది కోపంతో అతడికి బదులు, అతడి తమ్ముణ్ణి త కోపానికి బలి చేశాడు. ఒక బొమ్మక ప్రాణప్రతిష్ఠ చేసి వదిలేస్తే సరిపోతుందా ఒంటరితనం భరించలేక పోతున్నాడు అందువల్లే మనస్తత్వం యిలా మారింది కనీసం తనకో 'తోడు'నిస్తే అందర్లా ప్రశాంతంగా బతుకుతానంటాడు.

కాని ఒక్కడే యిన్ని సమస్యలు సృష్టిస్తు న్నాడే? ఇలాంటి మరో జీవికి రూపకల్ప చేసి మరిన్ని ప్రమాదాలు కొని తెచ్చుకో టమెందుకు? రాక్షసుడు దయతలచి త కోరిక మన్నించమంటాడు. ఇంకెప్పుడు యిలాంటి ఆగడాలకు ఒడిగట్టన వాగ్దానం చేస్తాడు. విక్టర్ అతని కోరి తీర్చడానికి అంగీకరిస్తాడు.

హెన్రీతోపాటు జెనీవా నుండి ఇంగ్లం డుకు బయల్దేరి, 'రాక్షసి'ని సృష్టించటాని

రిశోధన ప్రారంభిస్తాడు. ప్రయోగాలకు ఏకాంతం వసరం. మిత్రుడు హెన్రీని స్కాట్లండ్‌లో వదిలి, ర్కనీ' ద్వీపం మీద ప్రయోగశాల నెలకొల్పుతాడు. లలు గడిచినా ఫలితం కనిపించదు.

తన 'అన్వేషణ'లోని నైతికత మీద సందేహం స్తుంది. సమాజ కళ్యాణానికిది ఏ విధంగా సహ సిస్తుంది? తన సృష్టి తననే ధిక్కరిస్తే మానవజాతి నికికే ప్రమాదం కాదా! ఇలా ఆలోచనల్లో సతమ మై, కిటికిలోంచి బయటకి చూస్తాడు. తోటలో చెట్ల కులు వెన్నెల్లో మెరుస్తున్నాయి. మరోపక్క మసక కటిలో ఒక ఆకారం కనిపిస్తుంది. పరికించి ాస్తాడు. రాక్షసుడు చెట్టుకింద నిల్చుని తనవైపే ాస్తున్నాడు. వీడు తనను ప్రశాంతంగా పనికూడా సుకోనివ్వడన్నమాట. అసలే భయంకరరూపం. లాంటి మరో జీవిని సృష్టించాలి! చేసిన పరిశోధన ాలు. ఇదంతా శాస్త్ర పరిశోధనేనని ఆత్మద్రోహం సుకోలేడిక. ప్రయోగశాలలో ఇంచుమించు పూర్తి వచ్చిన రూపాన్ని ధ్వంసం చేస్తాడు విక్టర్.

రాక్షసుడికి కోపం వస్తుంది. తన సృష్టికర్త పట్ల ్వేషం పెల్లుబుకుతుంది.

త్వరలో విక్టర్ పెళ్లి చేసుకోబోతున్నాడు. ఆ రోజే తడిమీద ప్రతీకారం తీర్చుకుంటానని శపథం స్తాడు. రాక్షసుడి ప్రగల్భాలు విక్టర్‌కు నవ్వు తెప్పి ్తాయి. తన ఊహల్లో పుట్టిన బొమ్మ తనకే అప ారం చెయ్యటమేమిటి? ఆ రాత్రే ప్రయోగశాల ుండి, సగం తయారైన ఆకృతి అవశేషాలను ోట్‌లో తీసికొచ్చి సముద్రంలో జారవిడుస్తాడు. క్షణం ప్రకృతిలో పెనుమార్పు వస్తుంది. గాలి ధృతం పెరుగుతుంది. ఆకాశమంతెత్తు ఎగసిన లలతో బోట్, కాగితం పడవలా కొట్టుకుపోతుంది. ుండపోతగా వర్షం కురుస్తుంది. ఉరుములు మెరు ులతో ప్రకృతి విలయతాండవం చేస్తుంది. ాత్రంతా ప్రాణాలు అరచేత పట్టుకొని గడిపిన విక్టర్, ెల్లవారేసరికి తనకు అపరిచితమైన కొత్త ఊళ్లో ంటాడు. క్రితం రోజు అక్కడో హత్య జరిగింది. ేరం చేసింది తనేనంటూ అరెస్టు చేస్తారు. ఎందు లా జరుగుతుందో అర్థంకాదు. ఈ అనూహ్య ిరిణామాలకు కారణమెవరు? అసలీ ఊరికి ందుకు కొట్టుకొని వచ్చింది తన పడవ? అమా




యకుణ్ణి ఎంత వేడుకున్నా అధికారులు వినరు. మృతుడి దేహం చూసి విక్టర్ నిర్ఘాంతపో తాడు. హతుడైన ఆ వ్యక్తి మరె వరో కాదు. తన బాల్య మిత్రుడు క్లెర్వాల్. మెడమీద రాక్షసుడి గోళ్లుంటాయి.

అనుచితమైన శాస్త్ర విజ్ఞాన పరిణామమిది. పర్వర్టెడ్ సైన్స్. తన పాపాలకు నిష్కృతి లేదు. పశ్చాత్తాపంతో కుంగిపోతాడు. ఆరోగ్యం పాడవుతుంది. ఆ పరి స్థితిలో అతణ్ణి కొన్నాళ్లు జైల్లో పెడతారు. చివరకు నిరపరాధి అని రుజువు కావడంతో విడు దల చేస్తారు.

జెనీవా తిరిగి వచ్చి ఎలిజిబె త్‌ను వివాహం చేసుకుంటాడు విక్టర్. రాక్షసుడి హెచ్చరిక జ్ఞాపకం వస్తుంది. పెళ్లిరోజే తనను హత్య చేస్తానన్నాడు.

ముందుగా ఎలిజిబెత్‌ను ఒక సురక్షిత స్థానంలో వుండమని చెప్పి, తాను ఒంటరిగా హంత కుడి కోసం నిరీక్షిస్తాడు. కాని కాసేపటికి ఆమె పొలికేక వినిపి స్తుంది. గుండె జారిపోతుంది. వాడు తుదముట్టిస్తానన్నది తన

# మేరీ షెల్లీ

## (1797 - 1851)

తొలితరం స్త్రీవాద ఉద్యమకారిణి, రచయిత్రి, ధీర వనిత మేరీ వూల్‌స్టన్‌క్రాఫ్ట్, ప్రముఖ పొలిటికల్ ఫిలాసఫర్ విలియం గాడ్విన్‌ల సంతానమే మేరీ.

పుట్టిన పదకొండు రోజులకే తల్లి మరణించింది. సోదరి ఫానీ ఇమ్లే సాహచర్యంలో పెరిగింది మేరీ. 1801లో గాడ్విన్ పక్కింటి మేరీజేన్ క్లెయిర్ మాంట్‌ను పెళ్లి చేసుకున్నాడు. తండ్రి గ్రంథాలయంలోని రోమన్, గ్రీక్ చరిత్రల్ని అధ్యయనం చేసిందామె. ఇంటికి తరచుగా వచ్చే కవి, తాత్వికుడు ఎస్.టి. కోలరిడ్జ్, అమెరికా మాజీ ఉపాధ్యక్షుడు అలాన్ బర్‌ల సంభాషణలు ఆమెలో రాడికల్ భావాలను పెంచాయి.

1814లో గాడ్విన్ శిష్య బృందంలో ఒకడైన ప్రముఖ కవి పి.బి. షెల్లీతో ప్రేమలో పడింది మేరీ. తండ్రిని ధిక్కరించి సవతి సోదరిని వెంట తీసుకుని ప్రియుడితో ఫ్రాన్సుకు వెళ్ళిపోయింది. అటునుండి స్విట్జర్లాండుకు ప్రయాణం చేశారు ఆ ముగ్గురూ. అప్పటికే మేరీ గర్భవతి. అవివాహిత కావడంవల్ల సమాజం వీళ్ళను వెలేసింది. పీకల్లోతు అప్పుల్లో కూరుకుపోయారు ప్రేమికులు. నెలలు నిండకముందే పుట్టిన కూతురు మరణించింది. షెల్లీ మొదటి భార్య హేరియెట్ మరణించిన తర్వాత 1816లో వీరు పెళ్లి చేసుకున్నారు.

1818లో షెల్లీ దంపతులు బ్రిటన్ నుండి ఇటలీ వెళ్లారు. రెండో, మూడో

నవవధువునన్నమాట. జీవితంలో అన్నీ పోగొట్టుకున్న విక్టర్ జీవచ్ఛవమై ఇంటికి తిరిగి వస్తాడు. అతడి తండ్రి ఈ మృత్యుహేల భరించలేక మరణిస్తాడు.

విక్టర్‌కిప్పుడొకే లక్ష్యం. ఎలాగైనా తను సృష్టించిన రాక్షసుణ్ణి తానే నాశనం చెయ్యాలి. అదే తన చివరి కోరిక. వాడెక్కడ దాగినా సరే, భూమండలమంతా గాలించి వెదికి పట్టుకోవాల్సిందే.

దేశదేశాలు తిరిగాడు. ఎడారులలో పయనించాడు. అరణ్యాలలో, ఆటవికుల మధ్య జీవించాడు. నడకతో కాళ్ళు బొబ్బలెక్కాయి. అయినా శత్రుసంహారం చెయ్యనిదే మృత్యువు కూడా తన దరికి చేరదు. విలియం, ఎలిజిబెత్‌ల సమాధి దృశ్యాలు లోపల ప్రతీకారేచ్ఛను రగిలించాయి.

వాళ్లు అశరీరులై తనను ఆవహించారు.

చాలాసార్లు ఆ రాక్షసుడు పట్టుబడి కూడా త్రుటిలో తప్పించుకున్నాడు. రోన్ నది వద్ద ఉన్నాడని తెలిసింది. ఆ తర్వాత మధ్యధరా తీరంలో తిరుగాడుతున్నాడనని అక్కడా వెదికాడు. నల్లసముద్రం దిశగా పయనిస్తున్నాడని మరెవరో చెప్పారు. టార్టారీ మరుభూముల్లో, రష్యాలో గాలించాడు. చలి, ఆకలి, అలసటలు ఇప్పుడతణ్ణి బాధించవు.

మరికొన్నాళ్లకు రాక్షసుడు ఉత్తర దిశగా కదులుతున్నాడని తెలిసింది. ఎముకలు కొరికే చలిలో వాడికోసం వెదికాడు. ఆ మంచుటెడారిలో మొక్కలు మొలవవు. దొరికిన జంతువులను చంపి తినటమే అక్కడి వాళ్లకలవాటు. నదులలో నీళ్లు ప్రవహించవు. ఒకచోట వాడు తన కోసం రాసి పెట్టిన సూచన ఒకటి కనిపిస్తుంది.

సంతానం కూడా మరణించారు. నాల్గవ సారి గర్భం దాల్చిన మేరీ, పెర్సీ ఫ్లొరెన్స్‌కు జన్మనిచ్చింది. 1822లో ఒక తుఫాను రోజున బే ఆఫ్ స్పెజియాలో పడవ ప్రమాదంలో మరణించాడు షెల్లీ.

ఏడాది తర్వాతే మేరీ ఇంగ్లండు వచ్చింది. షెల్లీతండ్రి మరణంతో ఆస్తి కలసి వచ్చింది. ఆర్థికస్థితి మెరుగుపడింది.

53వ ఏట బ్రెయిన్ ట్యూమర్‌తో మరణించింది మేరీ. ఈ రచయిత్రి కీర్తి ప్రధానంగా ఫ్రాంకెన్‌స్టీన్ మీదే ఆధారపడింది. ఆమె ఇతర నవలలు వాల్పెర్గా (1823), ది లాస్ట్‌మాన్ (1826), పెర్కిన్ వార్బెల్ (1820), లాడోర్ (1835), ఫాక్నర్ (1837)లకు కూడా గుర్తింపు వచ్చింది.

ఆమె జీవితాన్ని మలుపుతిప్పిన సంవత్సరం 1817. పెళ్లైన ఏడాదికి షెల్లీ దంపతులు కవి లార్డ్ బైరన్, జాన్ విలియం పోలిడోరిలతో కలిసి జెనీవాలో బసచేశారు. అక్కడ వుబుసుపోక జర్మన్ హారర్ కథలు చదువుతున్నప్పుడు 'మనమూ ఒక ఘోస్ట్ స్టోరీ రాద్దాం' అన్నాడట బైరన్.

ఈ నవలకు సబ్‌టైటిల్ 'ది మాడర్న్ ప్రోమెతియస్'. దేవతలను ధిక్కరించి, అగ్నిని మానవాళికి అందించిన మహానుభావుడు ప్రోమెతియస్. ఈ నేరానికి శిక్ష అనుభవించాడతడు.

ఫ్రాంకెన్‌స్టీన్ అతీంద్రియ శక్తులు, మాయా మంత్రాలతో నిండిన హారర్ స్టోరీ. తొలి సైన్స్‌ఫిక్షన్ హారర్ నవలగా దీనికో ప్రత్యేకత వున్నది. 1818లో షెల్లీ ఉపోద్ఘాతంతో అచ్చయింది.

డాన్‌క్విక్సాట్, మదాంబావరీ లాంటి కల్పిత పాత్రల్లాగే, 'ఫ్రాంకెన్‌స్టీన్'కూడా ఇంగ్లిషు శబ్దకోశంలో చేరిపోయాడు. ఆక్స్‌ఫర్డ్ ఇంగ్లిష్ డిక్షనరీ ప్రకారం 'ఫ్రాంకెన్‌స్టీన్స్ మాన్‌స్టర్' అంటే 'సృష్టికర్తనే కబళించేవాడు'

"నీ కష్టాలు ఇప్పుడే ప్రారంభమైనాయి. చలికి ఉన్ని గుడ్డలు సమకూర్చుకో. ముందర ఆహారం కూడా లభ్యంకాదు. నువ్వు గిలగిలా కొట్టుకుని మరణించినప్పుడే నేను సంతోషిస్తాను"

వాడు దరిదాపుల్లో ఎక్కడో ఉన్నాడని స్పష్టమైంది. గాలింపు తీవ్రతరం చేస్తాడు. ఒక మంచు శిఖరం మీద రాక్షసుడు కనిపిస్తాడు. విక్టర్ లంఘించి, వాణ్ణి పట్టుకోవటానికి ప్రయత్నం చేస్తాడు. దురదృష్టవశాత్తూ అది విరిగి, మరో హిమఖండం మీద వాడు దూరంగా కదిలిపోతాడు.

ఆ పరిస్థితుల్లో విక్టర్‌ను కలుస్తాడు వాల్టన్. షిప్పు మీద మంచి వైద్య సౌకర్యాలు ఉన్నప్పటికీ, ఆరోగ్యం బాగా క్షీణించి, జీవితం మీద ఆసక్తి తగ్గిన విక్టర్ ప్రతీకారం తీర్చుకోకుండానే తుది శ్వాస విడుస్తాడు. మరి కాసేపటికే రాక్షసుడు వచ్చి, తన సృష్టికర్త మీద పడి విలవిలా రోదిస్తాడు. ఈ వింత దృశ్యాన్ని చూసి ఆశ్చర్యపోతాడు వాల్టన్.

ఒంటరితనం వల్ల, తన జాతికి చెందిన మరో జీవి తనకు తోడుగా లేనందువల్ల తను అనుభవించిన బాధలన్నీ చెప్పుకుంటాడు రాక్షసుడు. వాడికి విక్టర్ పట్ల ఎక్కడో కృతజ్ఞత లేకపోలేదు గానీ ఈ అసంపూర్ణ సృష్టివల్ల ద్వేషం, అసహ్యం పెరిగింది. బాధా, పశ్చాత్తాపం కూడా వాణ్ణి ఉక్కిరిబిక్కిరి చేశాయి.

ఏమైతేనేం, ఆ విలక్షణ శాస్త్రజ్ఞుడిక లేడు. తనూ జీవితం ముగించవచ్చు మరింత ఉత్తరంగా కదిలి మంచులో, ఎక్కడో సమాధి అవుతాడు రాక్షసుడు.

–ఎం.వసంత

# ఇదీ వేదం

## వేదాలు మాంసాహారాన్ని సమర్థించాయా!

-డాక్టర్ సంధ్యావందనం లక్ష్మీదేవి

యజ్ఞయాగాది క్రతువుల్లో విచ్చలవిడిగా మాంసాహార సేవనం ఉండేదని విస్తృత ప్రచారం సాగుతోంది. ఋషులు, మునులు, సాధుసత్పురుషులు, రాజులు, చక్రవర్తులు, సామ్రాట్టులు యధేచ్ఛగా మాంసాహార భక్షణం చేసే వారంటూ పుట్టిన కట్టు కథలూ లెక్కలేనన్ని. ఇదంతా నిజమా? పరిశీలిస్తే పరమార్థం బోధపడుతుంది. అర్థాలు తెలీని మీ'మాంస'తోనే మాంస సేవనం గురించి వదంతులు పుట్టగొడుగుల్లా పుట్టుకొచ్చాయని తెలుతుంది. సంస్కృత పదాలకు అనేక అర్థాలున్నాయి. ఆయా సమయాలలో సందర్భాన్ని, ప్రకరణాన్ని బట్టి సంస్కృ శబ్దాలను అర్థం చేసుకోవాలని వేదఋ: లన్నారు.



వేదాలు, వేదభాష అతి ప్రాచీనమైన: చాలాకాలంగా వాటితో మనకు ప్రత్య సంబంధం తెగిపోయింది. మన మనస: లలో వేదేతర భాష సాహిత్యం, ఆలోచన సంస్కారం బలంగా వుంది. మహాభార యుద్ధం తరువాత మన ఆలోచనల: సత్యదృష్టికోణం కొరవడింది. రాజకీం దురుద్దేశంతో విదేశీయులు వేదాల: చేసిన ఆంగ్లానువాదాలను సత్యమని వి: సించడం వలన మనలో శాస్త్రీయ దృక్పథ బలహీన పడింది. ఈనాటికీ వేదాల ఎవరికైనా దురభిప్రాయముంటే దానికి కారణమని తెలుసుకోవాలి.

వేద వాఙ్మయాన్ని కొంతవరకు మన పరిశీలిస్తే-

**'మిత్రస్యాహం చక్షుషా సర్వా: భూతాని సమీక్షే'** (యజుర్వేదం 36-1

సమస్త ప్రాణులను నేను మిత్ర దృష్టి: చూడాలి అనే వైదిక ప్రార్థన మనకు క పిస్తుంది. చరాచర జగత్తులో జీవరాసు న్నిటిని ప్రేమభావంతో చూసే వ్యక్తి, నిర తరం భగవంతుని ప్రార్థించే భక్తు: మాంసాహార సేవనం చేసేందుకు వీల్లేద భగవత్ సాక్షాత్కారాన్ని అభిలషించే సా



కుడు ప్రాణిహింస చేయలేదు.

"మానో హింసిష్టం ద్విపదో మా చతుష్పదః"

(అధర్వవేదం 1-2-1)

రెండుపాదాలున్న మనుష్య పశుపక్ష్యాదులను, నాలుగు పాదాలున్న ఆవులు, మేకలు, ఎద్దులు, దున్నలు మొదలైన పశువులను ఎప్పుడూ చంపకూడదని వేదం హెచ్చరిస్తుంది.

"గాం మాహిగ్ంసీ అదితిం విరాజమ్"

(యజుర్వేదం 13-43)

మానవ జీవనానికి ఆధారమై అత్యంత ప్రయోజనాన్ని కలిగించే ఆవును చంపకూడదని వేదమంటుంది.

"ప్రియః పశూనాం భూయాసమ్"

(అధర్వ వేదం 17-1-4)

పశువులను ప్రేమించాలి. వాటిని వధించకూడదు. వానిని ప్రియమైనవిగా భావించాలి. అట్లాంటివారే సర్వశ్రేష్ఠులని వేదం ప్రశంసిస్తుంది. మాంసాహారంపై సంశయాన్ని కలిగించే కొన్ని ప్రస్తావనలు మనకు వేదంలో కన్పిస్తాయి.

అథర్వ వేదం నవమకాండం అతిథి సూక్తంలో గోమాంసంతో అతిథిని సత్కరించాలని వుంది. ఈ మాట వింటే మనకు ఆశ్చర్యం కలుగుతుంది. ఇక్కడ మనం జాగ్రత్తగా ఆలోచించాల్సిన అంశం ఒకటుంది. వైదిక శబ్దాలకు అనేక అర్థాలుంటాయి.

ఉదకము అనే సంస్కృత పదానికి వంద అర్థాలున్నాయి. అందులో ముఖ్యంగా జలం, సలిలం, వనం, ఘృతం, మధు క్షీరం, భువనం, శుభం, పిప్పలం, విషం, అమృతం అనే అర్థాలున్నాయి. ఒక్క ఉదకానికే అమృతమని, విషమని పరస్పరం వ్యతిరేక అర్థాలు ఇందులో కనిపిస్తున్నాయి. వీటిని ఆయా సందర్భాలననుసరించి అర్థం చేసుకొంటే సర్వవిధాల

అందరికి శ్రేయస్సు కలుగుతుంది. ప్రాచీన శాస్త్రాలలో 'మాంస' శబ్దానికి కేవలం కండ రమనే అర్థంకాదు. ప్రకరణాన్ని బట్టి శాస్త్రాలలో ఫలం- పండు మధ్యలోని గుజ్జు, స్నిగ్ధము, స్థూలదళభాగం, పాయసమనే అర్థాలను గ్రహించాలని స్వయంగా వేదమే వివరిస్తుంది.

**"ఏ తద్వా ఉస్వాదీయా యదిదగావం క్షీరంవా మాంసం వాతదేవ నాగ్నీయాత్"**

అథర్వవేదంలో గృహస్థుడు అతిథికి, విద్వాంసునకు స్వాదిష్టములైన మధుర పదార్థాలు సమర్పించాలని వుంది. గోవు ద్వారా లభించే పాలతో తయారైన పుష్టికారకములైన పాయసం మొదలైన పదార్థాలు అతిథికిచ్చి తాను భుజించాలని వుంది. ఇక్కడ మాంసమంటే పాయసమనే అర్థాన్ని గ్రహించాలి.

శతపథ బ్రాహ్మణంలో పరమాన్నానికి మాంసమనే అర్థం చెప్పబడింది. 'మాంస' మనే పదం సంస్కృత పదం.

**'ఏ తదు హ్వై పరమ అన్నాద్యం యన్ మాంసమ్'** (11-7-13)

ఈ ప్రకరణంలో మాంసశబ్దం పరమాన్నానికి బదులుగా వాడబడింది. పరమాన్నమంటే 'పరమాన్నంతు పాయసమ్' (2-7-24). పరమాన్నమంటే పాయసమని స్పష్టంగా వుంది.

హింస, మాంసభక్షణ, పశుబలులను, పశువధలను, యజ్ఞాలలో పశుహింసను మనువు పాపకర్మగా భావించారు. మనుస్మృతిలో అహింసను పాటించాల్సిన అవసరాన్ని అనేక శ్లోకాలలో నొక్కి చెప్పారు. సంపూర్ణ మనుస్మృతిని చదివిన తరువాత అదొక అహింసను ప్రతిపాదించే గ్రంథంగా మనకు కనిపిస్తుంది.

**'వర్జయేత్ మధు మాంసం చ ప్రాణినాం బైవ హింసనమ్'**

మానవులు మద్యపానం, మాంస భక్షణ, ప్రాణుల హింసను సర్వదా విడిచి పెట్టాలని మహర్షి మనువు అన్నారు.

ప్రతినిత్యం హింసా కార్యాల ప్రవృత్తి కలవాడు ఈ ప్రపంచంలో సుఖాన్ని పొందలేడని మహర్షులన్నారు.

**నా కృత్యా ప్రాణినాం హింసాం మాంస ముత్పద్యతే క్వచిత్! న చప్రాణి వధః స్వర్గః తస్మాన్మాంసం వివర్జయేత్।** (మనుస్మృతి 5-48)

ప్రాణులను హింసించకుండా మాంసం దొరకదు. ప్రాణులను వధించడం వలన సుఖం లభించదు. అందువలన మాంస భక్షణ తప్పనిసరిగా విడవాలని వేద ఋషులన్నారు.

మన ప్రాచీనులు మాంసాహారం చేసిన ట్లుగా ఋషిమునుల ప్రమాణాలేమీ లేవు.

అభిజ్ఞాన శాకుంతలంలో కాళిదాసు కూడా (ఆమ్రఫలానికి) మామిడిపండుకు మాంసశబ్దమే ఎక్కువగా ప్రయోగించాడు. అథర్వ వేదంలో విద్వాంసుని ఉపసేచన క్రియలో పంచద్రవ పదార్థాలతో సత్కరించాలని ఉంది. అందులో పాలు, తేనె నేయి, జలం, మాంసం అంటే పాయసం అని వుంది.

వేదశాస్త్ర పరిజ్ఞానం లేనివారు సంస్కృత ఆర్ష సాహిత్యంలోని ఈ మాంస శబ్దాన్ని చూచి మన పూర్వులు మాంసాహారులే అనుకుంటే పొరపాటే. ఋషులు, మునుల జీవనం సాత్త్వికం. సత్త్వగుణ ప్రధానమయింది. వారు ఏ ప్రాణిని హింసించరు. సమాజ హితమే ఋషుల ధ్యేయం లోకకళ్యాణం కోసమే వారి తపస్సు. పవిత్రమైన వారి ఆశయాలను అపార్థం చేసుకొని సర్వసంగపరిత్యాగులైన మహాయోగులను, పురుషోత్తములను ఆక్షేపించడం తగదు.

లోకా స్సమస్తా సుఖినోభవంతు ©

చతుర కథ

# సిగ్గుండాలి!

**సా**యంకాలం ఐదు గంటలైంది. శాంత ూరగాయలు తేవడానికి సూపర్ మార్కె ట్‌కి బయల్దేరింది.

దారిలో మీనాక్షి కలిసింది.

"శాంతా! ఎక్కడికి బయల్దేరావు? " అడి ంది మీనాక్షి.

"సూపర్ మార్కెట్లో కూరగాయలు, పళ్లు నడానికి బయల్దేరాను" అన్నది శాంత.

"నేనూ అక్కడికే. మీ ఇంటి దగ్గర్లోనే ోడ్ల ప్రక్కన తోపుడు బళ్ళ వాళ్లు కూరగా ులు అమ్ముతున్నారుగా! ఇంత దూరం ందుకొస్తున్నావు? " అని అడిగింది నాక్షి.

"తోపుడు బళ్ళ దగ్గర రేట్లు ఎక్కువ నాక్షీ! పైగా తూకం సరిగా ఉండదు. న్నీ కూరగాయలు ఒకరి దగ్గర ఉండవు. కరు దొండకాయలు అమ్ముతుంటే, ఇంకొ డు వంకాయలు, టమాట ఇలా ంటాయి. స్టోర్స్‌లో అన్నీ చౌకగా ఒక ోటే దొరుకుతాయి. తూకం ఎలక్ట్రానిక్ షన్ మీద కరక్ట్‌గా ఉంటుంది" అన్నది ాంత.

"నిజమే! అందుకే నేనూ వారానికొక ారి ఈ స్టోర్స్‌లో కూరగాయలు, పళ్ళు ంటున్నాను" అన్నది మీనాక్షి.

"అన్నట్లు రమ్యని వాళ్ళ బావగారు ాచి లెంపకాయ కొట్టాడుగా! అదేమన్నా ాగుందా? " అన్నది శాంత.

"కొట్టాలా? నరకాలా? అటువంటి కేర్ స్ దాన్ని" కోపంగా అన్నది మీనాక్షి.

"ఏం? అదేమంత నేరం చేసింది? "

"అరె... మన భారతీయ సాంప్ర ాయం ఎటువంటిది? పదకొండో ఏడు రాగానే ఆడపిల్లలకు ఓణీలు వేయించి ఛాతీ కప్పి ఉంచుకునే సాంప్రదాయం. అటువంటిది బావగారి ముందు జీన్ ప్యాంట్లు టీ షర్టులు వేసుకుని తిరుగుతుంది. చుడీదార్ వేసుకుంటే చున్నీ కప్పుకోదు. నన్ను చూడు, నా అందం చూడు అని గుండెలు కనపడేట్లు ఎక్స్‌ఫోజ్ చేస్తుంది. చున్నీ మెడ చుట్టూ వేసుకుంటుంది." అన్నది మీనాక్షి.

"రమ్య ఒక్కతేనా అలా తిరుగుతున్నది. అలా కాలేజీకెళ్లు. లేదా సినిమా హాళ్ల దగ్గర చూడు. ఈ కాలం ఆడపిల్లలంతా అంతే. రమ్య ఒక్కదాన్నే తప్పు పట్టడం ఏం న్యాయం? " అన్నది శాంత.

"ఊళ్ళో వాళ్ళ సంగతులు మనకెందుకు? రమ్య అలా తిరగడం ఇంట్లో తనకి ఇబ్బందిగా వుందని బావగారు చెప్పించారు గదా! ఐనా విన్నదా? నా ఇష్టం అని ఎదురు తిరిగింది. అందుకే ఆయనకి కోపం వచ్చి చెంప పగల గొట్టాడు. పెద్దతాడు అలా బుద్ధి చెప్పడం సరైనదే కదా!"

"తమ్ముడి భార్య కూతురుతో సమానం. అలా కొట్టవచ్చునా? "

"కొట్టినా దానికి బుద్ధిరాలా! వేరే కాపురం పెడదామని మొగుడ్ని సతాయిస్తోంది." అన్నది మీనాక్షి.

ఈ లోపల కూరగాయల స్టోర్స్ వచ్చింది. ఇద్దరూ కూరగాయలు కొంటూనే రమ్యని బావ కొట్టడం తప్పా? కాదా అని వాదించుకుంటున్నారు.



"దేన్నికైనా కల్చర్ వుండాలి. పల్లెటూరి వాళ్ళకి సిటీ కల్చర్ ఏం తెలుస్తుంది." తీవ్రంగా అన్నది శాంత.

"ఏంటి? నేను పల్లెటూరి దాన్ననేగా నువ్వనేది. నాకు కల్చర్ తెలీదనా? "

"నిన్ను కాదు. నేను అన్నది రమ్య బావని"

"ఐతే మాత్రం. పల్లెటూరి వాడనేగా నువ్వనేది. ఆయన్ని అంటే నేను వూరుకోను" అన్నది మీనాక్షి.

"రమ్యని తప్పు బడితే నేనూ వూరుకోను. కాలాన్ని బట్టి మారాలి. పల్లెటూళ్ళో వున్నట్లు సిటీలో వుండాలంటే కుదురుతుందా? " తీవ్రంగా అన్నది శాంత.

"ఆడదై పుట్టాక సిగ్గుండాలి" అన్నది మీనాక్షి

"ఏంటి మాటలు మీరుతున్నావ్? నాకు సిగ్గులేదనా? " మండిపడిన శాంత పెద్దగా అరిచింది.

"నిన్ననలేదు. రమ్యకి సిగ్గు లేదన్నాను." అన్నది మీనాక్షి.

శాంత, మీనాక్షి కేకలు వేసుకుంటూ వుండగా అక్కడ సేల్స్‌గర్ల్ "ఏమిటి మేడమ్? ఎవరి గురించి పోట్లాడు కుంటున్నారు. రమ్య ఎవరికి చుట్టం? " అని అడిగింది.

"మాకేం చుట్టం కాదు. ఏడింటికి వచ్చే ఇంద్ర ధనస్సు సీరియల్లో కేరెక్టర్ రమ్య" చెప్పింది శాంత.

"మై గాడ్ సీరియల్లో పాత్ర గురించి మీరు పోట్లాడుకుంటున్నారా? " అని పైకి అన్నది.

'ఇట్లా పోట్లాడు కోవడానికి మీకు సిగ్గుండాలి' అని గొణుక్కున్నది.

– వాణిశ్రీ

Owned, Printed, Published and Edited by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28232390; Bangalore:25583804. & www.eenadu.net.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2006-2008 RNI/32186/78